# ఆంధ్ర నాటక రంగమున క్రొత్త రుచులు



★

శ్రీ రాజరాజేశ్వరి
నాట్యమండలి
శ్రీ పి. సూరిబాబు
శ్రీమతి రాజేశ్వరి
పాల్గొన్న
నాటకరాజము

(N. 18770-75)

★

## తారాశశాంకము

క్రొత్తనాటకము
హెచ్. ఎం. వి. డ్రమేటిక్ పార్టీ

**"భూ కైలాస్"**

(4 రికార్డులు N. 18777-80)

'హెచ్. ఎం. వి.' గ్రామఫోన్
వ్యాపారులందరియొద్ద దొరకును.

"హిస్ మాస్టర్స్ వాయ్స్"

HIS MASTER'S VOICE

M. SAMUEL

ది గ్రామఫోన్ కంపెని లిమిటెడ్.



# విషయానుక్రమణిక

## నవంబరు, 1945



## చిత్రములు



# బల్లకట్టు

ధనికులు, బీదలు పని తొందరలో నున్న వారు, వ్యవధి కల్గినవారూ, అందరూ బల్లకట్టుకోసం ఆగవలసిందే. తాము పట్టిన మత్స్యాలని ఎండలో దూర ప్రదేశాలకి మోసుకొనిపోయి, అమ్మి, ఆయాసపడి వచ్చిన పల్లెవాడు, వానిభార్య, ఓ కప్పు టీ ఆనందంతో సేవిస్తారు. సెలవు దినాల్లో ఖులాసాగా షికారు వెళ్లేవారు తాము దారిలో తీసికొనే అల్పాహారాన్ని గురించి శ్రద్ధ వహిస్తారు.

తూర్పు బెంగాల్, మలబార్, ఆంధ్రదేశము, కథియావార్ ఇంకా, సముద్రం తీరంలోకి చొచ్చుకొని పోయిన ప్రతి ప్రదేశములోనూ, బల్లకట్టు వాడుక తప్పదు. గంగా, సింధు, కావేరి మొదలైన మహానదులను దాటడానికి వంతెనలకంటె ఎక్కువగా పడవలనే వాడుతున్నారు. నిత్యమూ రెండు గట్లమీదా లేకపోతే అధమం ఒక గట్టుమీదనైనా మీకు ఉత్సాహజనితంగా టీ (తేనీరు) దుకాణం కనబడుతుంది. జలతీరాన్ని మీరు వేచియుండడంవల్ల కలిగే శ్రమ ఒక కప్పు స్వచ్ఛమైన బ్రూక్ బాండ్ టీ ఇచ్చే హాయి వల్ల అదృశ్యమవుతుంది.




నిత్య విస్తరణవల
స్వచ్ఛమైన పదార్థము దొరకుతుంది.

# బ్రూ బాండ్

## రెండు ఆకులు - ఒక మొగ్గ.




సంపుటము 22 | నవంబరు, 1945 | సంచిక 11

పార్థివ కార్తికము

# ఊహాలహరి

— శ్రీ హనుమచ్ఛాస్త్రి

౧

మూగను, వాక్కులో కరవు పుట్టెను; పల్కఁగలేను తీయగా
నాగళమెత్తి, నీ త్రిభువనప్రతిపాదిత దివ్యశిల్ప లీ
లాగతి; పాంచజన్యపుఁగరమ్మున కంఠముదిద్ది తీర్పు మా
లాగులు వాగులై పొరలిపారను హృద్గతకావ్యమాధురుల్.

౨

విహగతురంగ! నాకనుల వెచ్చని యశ్రుల జిమ్మి పాడుకో
మహతియు-లేదు; కావ్యమధుమాసవిశాలరసాలశాఖపై
'కుహూకుహూ' పుణ్యవాక్సరసగుంఫనముల్ పచరింపలేను నా
యహరహస్సంస్మృతి ప్రభవ యాతన కెయ్యది శాంతి? మత్ప్రభూ

౩

ఏలనయా దయాజలనిధీ! యిటు దాగుడుమూతలాట, పం
తాలకు మాదృశుల్ వెనుకతగ్గరు; శాస్త్రపురాణకంఠముల్

## భారతి – పార్థివ కార్తికము

చీలికలై నినుంబొగడి చెప్పెడి నాశ్రితబంధువంచు ; నా
పోలిక నీయెడన్ గనను పొమ్మిక-సత్యము చాటమందువా ?

౪

నీ వున్నావని, లేవులేవనుచు ఘూనీలా ? జగన్నాథ ! వా
చాలై దగ్ధ్యము మీరి, పిచ్చితలలై సాగున్ వృథాతర్కముల్.
పూవుల్ నవ్విన క్రొత్తకాంతి జిగి, వేబోకన్ నవోషస్తనూ
సౌవర్ణోజ్జ్వల శోభలోగరతు లెన్సన్ వింతయాస్తిక్యముల్.

౫

లేతగులాబిపూల నునురేకుల కమ్మదనమ్ములేలు బా
లా తరుణాధరాల మృదులమ్ముగ ముద్దిడి, రమ్యచంద్రశా
లాతత పుష్పశయ్య నవయౌవన మాధురులాని దివ్యసం
గీతకలాదికమ్ముల సుఖింపగనైనను లేదు—మత్ప్రభూ !

౬

ఎన్నో తీయనికాంక్ష లీ బ్రదుకులోనే యింకిపోనిమ్ము ప్ర
చ్ఛన్నానేక పరాభవానలము లేచన్ క్రమ్మగనీ స్వాంత మా
పన్నత్రాణపరాయణా ! జననముల్ ప్రాప్తింపనీ పెక్కు నా
హృన్నీరేజము త్వత్కృపాకిరణసంపృక్తంబు గావింపవే.

# దిరీపతి శుకసప

## 1. కవికాలము, స్థలము, కులము

### = శ్రీ నేలటూరి వెంకటరమణయ్య =

ఆంధ్రపద్యకథావాఙ్మయమున శుకసప్తతి స్థానము మహోన్నతమైనది; నేఁడు మనకు లభ్యమగు పద్యకథాగ్రంథములయందు శుకసప్తతిని మించినదికాని, సమానమైనదికాని కానరాదు. ఈ గ్రంథమును పరామర్శించుటకుముందు దాని రచయిత కదిరీపతినిగూర్చియు, నతనికాలమునుగూర్చియుఁ గొంత చెప్పవలసియున్నది. ఇతఁ డెప్పటివాఁడో, మన దేశ మెద్దియో ఇంకను చక్కఁగఁ దెలియదు. దీనికి ప్రధానకారణ మీతని గ్రంథముయొక్క కృత్యాద్యవతారిక చిరకాలమువఱకు లభ్యపడకపోవుటయే. కృత్యాద్యవతారిక దొరకినపిమ్మటఁగూడ అందుఁ జెప్పఁబడిన చరిత్రాంశములు సుబోధములు గాకపోవుట మఱియొక కారణము.[1]

కదిరీపతి తనది క్షత్రియకులమనియుఁ, జంద్రవంశాంతర్గతమైన యాదవాన్వయ మనియుఁ జెప్పుకొనియున్నాఁడు.[2] యాదవాన్వయములో బాలవేకరికుల మను నొక యంతశ్శాఖ పొడమెను. ఈశాఖవారిది యచ్యుతగోత్రము. ఈవంశమువారిలోఁ బెదయౌబళుఁ డనునతఁడు తాడిగోళ్లపురమున నివసించుచుండెను; ఇతఁడు రాయలచే స్వారణరత్నవరత్నహారాంబరములను సమ్మానముగాఁ బడసెను; అళిరామరాజేంద్రబలవద్రిపుల ద్రుంచు కలని కితఁడు కర్తయాయెను; కదెరాకమున తెర్క మొదలగు బహురాజ్యము నేలెను; మఱియు రాయలొసఁగిన హనుమన్నాగారి చిహ్నములఁ బొందెను. ఖాద్రినృసింహస్వామికి క్రోడుగలు మొదలైన గ్రామములను దానము జేసెను; ఇతని పుత్రుఁడు నారశౌరి; అతనికిఁ దొమ్మండ్రుకొడుకులు; వారిలో నౌబళనాయకుఁడు ప్రఖ్యాతుఁడు; ఔబళనాయకుని పట్టపుదేవి బాలమ; ఈదంపతుల పుత్రుఁడు కరియమాణిక్యరాజు; ఇతఁడు రామదేవరాయల సరిగద్దియ నొడ్డోలగమునఁ గూర్చుండెను; రామరాయ లితనికి తాళిచొకళికాళాంజిచామరద్వయమాక్తికతురావాహనమును, బిరుదాంకవారమును నిచ్చి గౌరవించెను. ఇతనికి వసంతాధీశుఁడు, రామాధిపుఁడు, నారప్రభుఁడు, కదురోర్వీపాలుఁడు నను పుత్రులు నలువురు కలిగిరి. రెండవ కుమారుఁడగు రామరాజు శ్రీరంగరాయదత్తమత్స్యమకరధ్వజాఢ్యుఁడై

---

1. ప్రథమమున కందుకూరు వీరేశలింగంపంతులుగారును (ఆం. క. చ. పుటలు ౨౩౦-౩౧), దరువాత కొచ్చర్లకోట రామచంద్రవేంకటకృష్ణరావుపంతులుగారును (శుకసప్తతి, ప్రథమముద్రణ పీఠిక) కవిత్వశైలినిబట్టియు, నాశ్వాసాంతగద్యమునుబట్టియు కవిదేశకాలములను నిర్ణయించిరి. గ్రంథాద్యవతారిక లభ్యమైనపిమ్మట క్రొత్తపల్లి సూర్యారావుగారు ఇటీవల వావిళ్ల వారిచేఁ బ్రకటితమైన శుకసప్తతిద్వితీయముద్రణ పీఠికయందు మరల నీవిషయమును జర్చించిరి. అటు వెనుక నిడదవోలు వెంకటరావుగారు అవతారికలోఁ జెప్పఁబడిన చరిత్రాంశముల నాధారపఱచుకొని కవికాలమును జక్కఁగ నిర్ణయించిరి (చూ. ఆంధ్రి. సం. 3. పుటలు ౭౯-౯౨).

2. శుక. ౧: ౧౫-౧౬.

మధురధర్మభరణత రహించెను ; రామరాజునకు రఘునాథరా జను కుమారుఁడు కలిగెను ; రామరాజు యొక్క కడగొట్టుతమ్ముఁడు కదురరాజు ; ఇతఁడు కదురమయందు కదిరీపతి వేంకటరాజు లను కుమారుల నిరువురిఁ బడసెను. 3 ఈకదిరీపతియే శుకసప్తతిరచయిత. పై వర్ణింపఁబడిన వంశక్రమము నిట్లు తెలుపవచ్చును :

పెదయోబళరాజు

నారపరాజు

ఓబళరాజు

కరెమాణిక్యరాజు




వంశకర్తయగు పెదయోబళరాజు కృష్ణదేవరాయల యల్లుఁడగు నళియరామరాజునకు సమకాలీనుఁడు. అళియరామరాజు సదాశివదేవరాయలను విద్యానగరసింహాసన మెక్కించి యతనికిఁ బ్రతిగ క్రీ. ౧౫౪౨ మొదలు ౧౫౬౯ వఱకును గర్ణాట సామ్రాజ్యమును గడు దర్పముతో పాలించెను. కావున నతని బలవద్రిపుల గుంపు కలనికిఁ గర్తయైన పెదయోబళరాజును నప్పటివాఁడు కావలయును. అశ్వ వారణరత్నవరత్నహారాంబరంబు లీయోబళ రాజున కిచ్చి సత్కరించిన రాయలు సదాశివరాయలై యుండవలయును. సదాశివరాయల కాలమున నచ్యుత గోత్రు లుండినట్లు కొన్ని శాసనములవల్ల తెలియవచ్చుచున్నది. శాలివాహనశకము ౧౪౯౭ (క్రీ. శ. ౧౫౭౫) నాఁటి యొక కన్నడశాసనమున 'అచ్యుతగోత్రోద్భవ రాద మహానాయకాచాయర్ణరాద రాళకోకె అరవింద నాయకర ... నాగెనాయకరు' పేర్కొనఁబడియున్నాఁడు.4 గోత్రమును, బిరుదమును సామాన్యమే యైనను ఇంటిపేరులు భిన్నమగుటచే వీరికిని, తాడిగోళ్లవారికిని జ్ఞాతిసంబంధము లేదని చెప్పవలసియున్నది. తాడిగోళ్ల పెదయోబళరాజు ప్రస్తాప మప్పటి శాసనములయం దెందును కానరాదు. ఇతని కొమారుఁడగు నారరాజును, మనుమఁడగు నోబళరాజును నంతటి ప్రముఖులు గారు. వారినిగురించి తెలియవచ్చు చరిత్రాంశము లెవ్వియు లేవు.

రెండవ యోబళరాజుకుమారుఁడు కరియమాణిక్యరాజు. ఇతఁడు రామదేవరాయల సరిగద్దెపైఁ గూర్చొని యొడ్డోలగముండెనఁట. రామదేవరాయలు క్రీ. శ. ౧౬౧౭ మొదలు ౧౬౩౦ వఱకుఁ గర్ణాటకసామ్రాజ్యమును బాలించియుండుటచేత నితఁడుగూడ నప్పుడే వెలసెననుట నిశ్చయము. కరియమాణిక్యరాజు పెద్దకుమారునిగూర్చి విశేషాంశము లెవ్వియుఁ దెలియవు ; కాని యొకానొక కోలారుమండలశాసనమున తాడిగోళ్ల వసంతనాయఁడును, నతని కుమారుఁడు తిరుమలనాయఁడును పేర్కొనఁబడియున్నారు

"శ్రీరామ[||*] తారణసంవత్సర మాఘ శు౧౩లు శ్రీమన్మహానాయంకాచార్యులయిన తాడిగోళ వసంతనాయని తిరుమలపనాయనిగారు యనుములయుబమరడి కొమారుణ్ణు తిమ్మరడికి యీ కోరికపల్లిస్థళాన తాము కట్టించిన చెఱువుకింద..."5.

ఈ శాసనమున శకాబ్దము లేకపోవుటవల్ల దీని కాలమును నిశ్చయించి చెప్పుటకు వీలులేదు. శాసనపరిష్కర్తలయిన లూయీ రైసుగారు క్రీ. శ. ౧౬౦౪ నాఁటిదని యూహించియున్నారు. శాసనము వ్రాయించి నిలిపినాతఁడు తిరుమలపనాయఁడగుటచే నతని తండ్రియగు వసంతనాయఁడు తత్పూర్వము ౧౬-వ శతాబ్దమున వెలసియుండునని చెప్పవలసియున్నది. ఈ

3. శుక. ౧: ౧౭-౭౬.

4. Mys. Arch. Rep. 1924. No, 89.

5. EC. X. sp. 98.

శాసనకాలమును నిర్ణయించు సందర్భమున గమనించఁదగిన యంశమొకటి కలదు. తాడిగోళ్ల నాయకుల శాసనములు పెక్కు గలవు. వారి వంశావళి వానిమూలమునఁ గొంత తెలియవచ్చుచున్నది. ఈ వంశావళిలో వసంతనాయఁ డెవ్వఁడును గానరాఁడు; తాడిగోళ్ల కరియమాణిక్యనాయనికి పుత్రుఁడు వసంతనాయఁ డొకఁ డుండినట్లు శుకసప్తతికృత్యవతారికలోఁ జెప్పియుండుటచేతను, నీ వంశమున నెచటను వేఱొక వసంతనాయఁడు కానరాకపోవుటచేతను పై నుదాహరింపఁబడిన కోలారుమండలపు శాసనములోని వసంతనాయఁడు కరియ మాణిక్యనాయని జ్యేష్ఠపుత్రుఁడగు వసంతనాయఁడే కాని యన్యుఁడు కాఁడని తలఁచెదను. అగునేని పై శాసనము వ్రాయించిన తారణాబ్దము క్రీ. శ. ౧౭౦౪ నాఁటి తారణాబ్దము కాక దాని కఱువదియేండ్లకు ముందు గతించిన క్రీ. శ. ౧౬౪౪ నాఁటి తారణాబ్దమైయుండవలయును.

కరియమాణిక్యరాజు రెండవకుమారుఁడగు రామరాజు తన వంశమువారిలోఁ బేరెక్కినవాఁడు. ఇతఁడు 'శ్రీరంగరాయదత్తమత్స్యమకరధ్వజాఢ్యుఁడై మధుర ధర్మ భరణతరహించు'నని శుకసప్తతి తెలుపుచున్నది. మత్స్యమకరధ్వజములు మధుర నాయకులవి. ఈ సీసపాదమువల్ల మధురనాయకులతో శ్రీరంగరాయలకు పొసఁగిన యుద్ధమున రామరాజు సహాయమొనర్చి జయము జేకూర్పఁగా రాయ లతనికి మధుర నాయకరాజచిహ్నములనొసఁగి గౌరవించెనని తోఁచుచున్నది. ఇది యెంతవఱకు సత్యమో కనుఁగొనవలసియున్నది. ఈ శ్రీరంగరాయలు కర్ణాటసామ్రాజ్యపాలకులలోఁ గడపటివాఁడగు ముమ్మడి శ్రీరంగరాయలు. వేలూరుచంద్రగిరులు రాజధానిగ క్రీ. శ. ౧౬౪౨ మొదలు ౧౬౪౯ వఱకును ప్రజాపాలన మొనరించెను. దేశద్రోహులైన మధురతిరుమలనాయకుఁడును, చెంజి వరదప్పనాయకుఁడు నతనిపైఁ దిరుగబడి కప్పముకట్టక నిరాకరించిరి. ముమ్మడి శ్రీరంగరాయలు సింహాసనము నధిష్ఠించినవెంటనే దక్షిణదేశపు నాయకులపై దండువెడలెను. అతని నెదిరించుటకై మధుర తిరుమలనాయఁడు చెంజివరదప్పతోడను, తంజావూరి విజయరాఘవునితోడను గలసి బయలువెడలెను. విజయరాఘవుఁడు మిత్రద్రోహ మొనరించి రాయలతోఁ జేరెను.

" శ్రీరంగరాయలఁ జేపట్టి నిలిపి
యారాయకార్యంబు లొఁగాపటించు
దుండగించిన పాండ్య తుండీరపతుల
ఖండించి వాకిలి గావఁజేసితివి.."

అని విజయరాఘవుఁడు దన రఘునాథాభ్యుదయనాటకమునఁ జెప్పుకొనియుండుటచేత నితఁడు శ్రీరంగరాయలఁ గూడి మధుర చెంజి నాయకులతో యుద్ధము జేసి వారి నోడించినట్లు తోఁచుచున్నది. తాడిగోళ్ల రామరాజునకు శుకసప్తతిలోఁ జెప్పినట్లు రాయలు మత్స్యమకరధ్వజముల నొసఁగి గౌరవించిన దీసమయమునందే యని తోఁచుచున్నది. ఇట్లు మొదట జయము కలిగినను, మధుర చెంజి నాయకులు శ్రీరంగరాయలతోఁ బ్రతిఘటించి హిందూజాతికి సహజవిరోధులును హిందూస్వాతంత్ర్య నిర్మూలనమునకుఁ గంకణము కట్టుకొనియుండిన దక్కను మహమ్మదీయసుల్తానులకు లంచమిచ్చి దేశములోనికి రప్పించిరి. ఈ సందర్భమున నడచిన యుద్ధములలో రామరాజు శ్రీరంగరాయలపక్షమున పోరినట్లప్పటి డచ్చివారి వాణిజ్యాగార దినసరి పుస్తకములందు చెప్పియున్నది.

క్రీ. శ. ౧౬౪౫ డిసెంబరులో బిజాపుర సర్దారుఁడు ఖానె ఖానుఁడును, గోలకొండనుండి మీర్‌జుమ్లాయు నెత్తివచ్చుచున్నారని విని, హిందూరాజ్యమును దేవాలయములను బ్రాహ్మణులను ధర్మమును మహమ్మదీయులు ధ్వంసము సేయనుద్యమించియున్నారనియు, వారి నెదుర్కొని పోఱదోలుట కందఱు నేకీభవించవలసినదనియుఁ గోరెను. అప్పుడే బిజాపురసైన్యాధ్యక్షుఁడగు ముస్తఫాతో సంధిప్రయత్నములు గావించెను. తన దళవాయియగు రామరాజును ఖానెఖానాను నెదిరించుటకై తిరుపతిదిక్కున కంపె

ను. శ్రీరంగరాయల దళవాయి రామరాజు కడు సమర్థుఁడు.6

ఇందువల్ల రామరాజు క్రీ. శ. ౧౬౮౨-౮౫ల మధ్య శ్రీరంగరాయల కొలువునందుండెనని నిశ్చయ పడుచున్నది. ఈవిషయ మీతని శాసనములవల్ల దృఢ మగుచున్నది. మొదట పేర్కొనఁదగినది సీగలపాల్యపు శిలాశాసనము.

౧. యీశ్వరసంవత్సరఆషాఢ బ ౫

౨. శ్రీమన్ మహానా[య]ంకాచార్యుల్ .

3. తాడిగోళ్లరామప్పనాయఁడు......

౪. సీగలపాలెం చెఱువులోంమగా......

౫. నవీరముస్థిరాచంనగారికి కరి

౬. యమాణిక్యనాయనికిపుణ్య...

౭. గాధారబోసిచ్చి గ్రామం

౮. ఇదుయవరుతప్పిన

౯. నర్కబ్రాప్తిఅవును. 7

ఇందు తాడిగోళ్ల రామప్పనాయనికిని, మాణిక్య నాయనికిని గల సంబంధ మెట్టిదో చెప్పలేదు; కాని తాడిగోళ్లవంశమునం దంతటను రామరాజుతండ్రి యొక్కఁడే కరియమాణిక్యనామధారి కానవచ్చు చుండుటచే సీగలపాల్యపు శాసనమునఁ బేర్కొనఁబడిన కరియమాణిక్యనాయఁడును, నతఁడును నొక్కఁడే యనియు రామప్పనాయఁడే యతని కుమారుఁడగు రామరాజనియుఁ దోఁచుచున్నది. శాసనమున శకా బ్దము లేకున్నను నందుదాహరింపఁబడియుండు ఈశ్వరసంవత్సరమునుబట్టి దాని కాలము క్రీ శ. ౧౬౩౭ అని తేలుచున్నది.

ఇంతకంటె ముఖ్యమైనది సోమయాజులపల్లె తామ్రశాసనము. ఇది యయింగరాల నారాయణప్ప యను బ్రాహ్మణునికి రామరాజు, లేక రామప్ప యొసఁ గిన భూదానమును దెలుపుచున్నది.

౧. స్వస్తివిజయాభ్యుదయశాలివాహనశకవర్షంబులు ౧౫౮౭ అగు

౨. ననేయటివిశ్వావసునామసంవత్సర చయిత్ర శు ౯లు శ్రీమద్రాజాధిరాజ పరమేశ్వర శ్రీవీరప్రతాప శ్రీవీర శ్రీరంగ

3. రాయదేవమహారాయలుఅయ్యవార్లు ఘనగిరి దుర్గమందు ప్రుథ్వీసామ్రాజ్యంచేయుచుణ్డగాను

౪. అచ్యుతగోత్రపవిత్రులైన శ్రీమన్మహానాయ కాచార్యులైనతాడిగోళ్ల ఓబళిరా

౫. యనివారిపౌత్రులైనకరియమాణిక్యనాయని వారిపుత్రులయినరామప్పగారనేమేము

భారద్వాజగోత్రంకాత్యాయనసూత్రంశుక్ల

లక్కయ్యపౌత్రులయిన హరియప్ప పుత్రు లయిననారాయణప్పఅనేమీకువ్రాయించిఇ

౮. చ్చిన భూదానధర్మశాసనం... 8

ఈ దానశాసనము వ్రాయించిన ౧౫౮౭, విశ్వావసు, చైత్ర, శు. ౯. క్రీ. శ. ౧౬౬౫, మార్చి, తే ౧౫ దికి సరిపోవుచున్నది. శుకసప్తతి కృత్యాదియందు నర్ణించియుండు కదిరీపతివంశమును, ఇందు పేర్కొనియుండు వంశమును ఒక్కటియే. దానశాసనమున వ్రాయించిన రామప్పయే కదిరీపతి యొక్క పెదతండ్రియగు రామరాజు. అచ్యుతగోత్ర మును, తాడిగోళ్ల గృహనామమును ఓబళరాయకరియ మాణిక్యనాయక యను తాతతండ్రులపేర్లును వారి వ్యక్తైక్యతను స్థిరపఱచుచున్నవి. ఉదాహృతశాస నాదిసాక్ష్యము ననుసరించి రామరాజు, లేక రామప్ప క్రీ. శ. ౧౬౩౭ మొదలు ౧౬౬౫ వఱకు నుండెనని నిస్సందేహముగఁ జెప్పవచ్చును.

ఈరామరాజునకు రఘునాథుఁడు. అనుకుమారుఁ డొకఁడుండినట్లు శుకసప్తతియందు చెప్పియున్నది

6. Indishe Compagnie als zeemsgerdheid in Azie of Macleod P. 191. English Analysis by Prof. K. A. N. Sastri.

7. E. C. X. Ci. 148.

8. Mys. Arch. Rep. 1924 No, 105,

కదా. ఇతని ప్రశంసగూడ శాసనములందుఁ గలదు. క్రీ. శ. ౧౬౪౯ నాఁటి యొక శాసనమున నొక మహానాయకాచార్య రఘుపతినాయఁడు పేర్కొనఁబడి యున్నాఁడు.9 కాని ఇతఁడు తాడిగోళ్ల కుటుంబమునకుఁ జెందినవాఁడో కాఁడో నిశ్చయించి చెప్పుటకుఁదగిన యాధార మీశాసనమునం దేమియుఁ గానరాదు. క్రీ. శ. ౧౭౩౩ నాఁటి యొక శాసనమున నితని ప్రస్తావన కానవచ్చుచున్నది. ఇతని మునిమనుమఁడగు రాయప నాయకుఁడు దన వంశక్రమము నిట్లు చెప్పుకొని యున్నాఁడు: "అచ్యుతగోత్రోద్భవులైన శ్రీమన్మహానాయకాచార్యులయిన తాటిగోళ్ల రఘుపతినాయకుల ప్రపౌత్రులయిన రామప్పనాయకుల పౌత్రులయిన కదిరీపతిరాయనాయకులు ఇచ్చిన శాసనము." 10 ఇందు రఘునాథ, రామప్ప, కదిరీపతి, రాయనాయకులను నాలుగుతరముల తాడిగోళ్లనాయకులపేర్లు గానవచ్చుచున్నవి. తరమునకు ఇరువదియైదేండ్లచొప్పున గణించిచూచినచో రఘునాథనాయకుఁడు క్రీ. శ. ౧౬౪౭ ప్రాంతమున నుండినట్లు తేలుచున్నది.

తాడిగోళ్లనాయకుల శాసనములు పెక్కు గానవచ్చుచున్నను, కదిరీపతివిషయమైకాని, యతని తండ్రియగు కదురభూపాలుని విషయమైకాని వాని మూలమున నేమియుఁ దెలియరాకపోవుట శోచనీయమే; కాని యతని పెదతండ్రులగు వసంతరాజు రామరాజుల కాలము దెలియవచ్చుచుండుటచేత నతని తండ్రి కదురభూపాలుని కాలము స్థూలముగ నిర్ణయించవచ్చును. వసంతరాజు క్రీ. శ. ౧౬౪౪ ప్రాంతమునను, రామరాజు క్రీ. శ. ౧౬౩౪-౬౫ ల మధ్యను నభ్యుదయమందియుండుటచే వారి తమ్ముఁడగు కదురభూపతియు నప్పటివాఁడే యని చెప్పుట యొప్పును. వసంతరాజు కుమారుఁడగు తిరుమలప్ప క్రీ. శ. ౧౬౪౪ నను, రామరాజుకుమారుఁడగు రఘునాథుఁడు క్రీ. శ. ౧౬౪౭ నను ఉండిరని తెలియవచ్చుటచేత వారి పినతండ్రి కదురరాజుపుత్రుఁడగు కదిరీపతి క్రీ. శ. ౧౬౬౦ ప్రాంతమున నుండెనని యెంచవచ్చును. శుకసప్తతి క్రీస్తుశకము ౧౭-వ శతాబ్దపు తృతీయపాదమున విరచింపఁబడెనని గట్టిగఁ జెప్పవచ్చును.

కదిరీపతికులము:— కదిరీపతికుల మేది? ఈ ప్రశ్నకుఁ గవియే ఈక్రిందిపద్యములయందు సమాధానము జెప్పియున్నాఁడు: 11.

" ఆ యమృతాంశుఁడు త్రిజగ
న్నేయుండగు రోహిణేయుఁ గిల్బిషహరణో
పాయున్ సంశ్రితనికరవి
ధేయు న్బుధనామధేయు ధీయుతుఁ గాంచెన్.
అతనికిఁ గల్గె పురూరవుఁ
డతఁ డాయువుగాంచె నహుషుఁ డాపుణ్యునకున్
సుతుఁ డతఁడు కనియెఁ దనయుం
డతవిభవోన్నతి యయాతిఁ దద్వంశమునన్.
భువనాహారవిహారియైన హరియా
పుణ్యాత్ము నామంబుచే
భువి భాసిల్లు కులంబునన్ హరిహరాం
భోజాసను ల్మెచ్చ సం
భవుఁడై ధాత్రి నరాతిజాతిభయకం
పం బెల్ల వారించి సం
స్తవనీయుం డనఁ బొల్చె నాతఁడు యదు
క్ష్మాభర్త పొల్పున్ మహిన్.
ఆరసికావతంసకుల
మాత్మసముద్భవహేతుభూతమై
ధీరతఁ బాలవెల్లి జగ
తిన్ దగఁ దన్మహిమం బపారగం
భీరఘనాఘసంభరణ
భీమబలప్రతిభాప్తిఁ గాంతు నం
చారయఁ బాలవేకరికు
లాఖ్య వహించె ముదంచితోన్నతిన్."

ఇట్లు కదిరీపతి తాను చంద్రవంశాంతర్గతయాదవాన్వయుఁడగు క్షత్రియుఁడనని స్పష్టముగఁ జెప్పు

9. Mys. Arch. Rep. 1924. No. 88.
10. Do. No. 84.
11. శుక. ౧ : ౧౬-౧౯.

కొనియున్నాఁడు; కాని ఇది సంశయాస్పదము. క్షత్రియవంశజు లెచ్చటను తాము నాయకులమని చెప్పుకొనలేదు. శుకసప్తతియాశ్వాసాంతగద్యల యందు "కదిరీపతినాయకప్రణీతంబైన" యని యున్నది. మఱియు దీని కనుగుణముగా శాసనములం దన్నిటను తాడిగోళ్లవారు నాయక్లని వ్రాసియున్నది. "తాడిగోళ్లవసంతప్పనాయని తిరుమలప్పనాయనిగారు"[12] "తాడిగోళ్లరామప్పనాయఁడు", "కరియమాణిక్యనాయనికి"[13] "తాడిగోళ్ల ఓబళిరాయనివారి పౌత్రులైన కరియమాణిక్యనాయనివారి పుత్రులైన",[14] "తాటిగోళ్లరఘుపతినాయకుల ప్రపౌత్రులయిన రామప్పనాయకుల పౌత్రులయిన కదిరీపతిరాయనాయకులు"[15] "తాడిగుళ్ల రఘునాధనాయనివారి...రామప్పగారి పుత్రులయిన రఘునాథనాయనిగారు",[16] "అచ్యుతగోత్రపవిత్రులయిన రఘునాథనాయనివారి పవుత్రులయిన రామప్పనాయని పుత్రులయిన నరసింహనాయనివారనే మేము",[17] "శ్రీ తాటిగోళ్ల కరియనారాయని రామప్పనాయనిగారు తనతండ్రి అక్కపనాయని...",[18] ఇత్యాది. "ఓబళిరాయని" యను ట్టునఁ దప్పతక్కినయెడల నెల్లను "నాయని" శబ్దమే వాడఁబడియున్నది. 'నాయని' 'రాయని'గ మారుట కలదు. పానుగంటి రామానాయనింగారు రామారాయనింగారైనట్లు ఈ యోబళిరాయఁడు మొదట నోబళినాయఁడైయుండవచ్చును. ఇది యెట్లున్నను, క్రీ. శ. ౧౫,౧౬,౧౭ శతాబ్దములలో 'నాయఁడు' అను కులసూచకబిరుదు 'కమ్మ వెలమ బలిజ' కులములవారికే చెల్లుచుండెను. ఎంతటి యల్పులైనను క్షత్రియులు మహామండలేశ్వరుల మనియు, 'రాజు' లేక 'మహారాజుల' మనియు శాసనాదులయందు వ్రాయించుకొనెడివారు. కావున కదిరీపతి క్షత్రియుఁడైయుండిన శూద్రజాతిసూచకమైన 'నాయక' పదమును దన పేరుతో జోడించుకొనియుండునా యని సంశయము. దీనికిఁ దోడు శాసనములం దీతని వంశమువా రందఱును క్షత్రియోచితమైన 'మహామండలేశ్వర' బిరుదును వహింపక, దాము మహానాయకాచార్యులమని చెప్పుకొనియున్నారు. ఈ బిరుదు విజయనగరరాయలకాలముననే వాడుకలోనికి వచ్చినట్లున్నది. సర్వసామాన్యముగ నిది విజయనగర సామ్రాజ్యమున దేశకావలిగాండ్రైన పాళెగాండ్రకే యుండినట్లు శాసనములవల్లను, గ్రామకవిలెలవల్లను తెలియవచ్చుచున్నది. దేశకావలిగాండ్రగు నీనాయకులందఱును బోయ బలిజ కమ్మ మున్నగు రాసికులములకుఁ జెందినవారగుటచేతను, క్షత్రియుల కెవ్వరికి నీబిరుదు లేకుండుటచేతను, తాడిగోళ్ల వంశజులు మహానాయకాచార్యులని శాసనములం దుండుటచేతను కదిరీపతి క్షత్రియుఁడు కాఁడేమో యను సందేహమున కెడముగల్గుచున్నది.

ఇట్టి సంశయ మొక తాడిగోళ్లవంశమువారియెడనే కాదు, ఆకాలమున ప్రాముఖ్యత వహించిన మఱికొన్ని కుటుంబములయెడను గలదు. ఇంచుమించు కదిరీపతికిసమకాలీనుఁ డనఁదగు నవరముచిననారాయణనాయకుఁడు దనది సూర్యవంశ మనియుఁ గాశ్యపగోత్ర మనియుఁ బ్రకటించికొనియున్నాఁడు.[19] సూర్యవంశ కాశ్యపగోత్రము లితఁడు తెలుఁగుచోళవంశజుఁడని తెల్పుచున్నవి. కాని చోళులు రాజాంతనామధేయులుగాని చిననారాయణనాయకునివలె నాయకాంతనామధేయులు గారు. మఱియుఁ దిరుమలదేవరాయల కాలముననుం, మొదటి శ్రీరంగరాయదేవమహారాయల కాలముననుం పెనుగొండదుర్గాధ్యక్షుఁడైయుండిన నవరము చన్నప్పనాయనింగారు "తిరుమలదేవమహారాయలయ్యవారి వూడిగం చిప్పగిరిసింగమనాయని

12. EC. X. Sp 98
13. ,, Ci. 148
14. Mys. Arch. Rep. 1924, No. 105
15. ,, ,, No. 84
16. ,, ,, No. 107
17. ,, ,, No. 106
18. ,, .. No. 110
19. కువలయాశ్వచరిత్రము. ౧: ౧౬,౨౦.

పౌత్రులయిన చెంనపనాయని పుత్రులైన చవరం చెంనప్పనాయనివారు" అని చెప్పుకొనియుండుటచేత 20 సవరమువారి క్షత్రియత్వమునకు న్యూనత కలుగు చున్నది. క్షత్రియు లెచ్చటను ఊడిగెము జేసినట్లు కానరాదు

ఈ యంశములనన్నిటిని పరామర్శించిచూడఁగాఁ గదిరీపతి క్షత్రియుఁడు గాఁడనియు, క్షత్రియత్వము నాకాంక్షించు శూద్రకుటుంబమునకుఁ జెందినవాఁడనియుఁదోఁచుచున్నది. కాని యీ యనుమానమే సత్యమని దృఢముగఁ జెప్పుటకు వీలులేదు. నాయక, మహానాయకాచార్యబిరుదులు శూద్రులయందే కాక క్షత్రియులయందుఁ గూడ నాకాలమున వాడుకలోనుండి యుండవచ్చును. కావున కదిరీపతి తనది క్షత్రియకుల మని స్పష్టముగఁ జెప్పినమాటలను ద్రోసిపుచ్చి కేవల మనుమానములను నమ్మక తాత్కాలికముగ నతఁడు క్షత్రియుఁడని యొప్పుకొనుట యుక్తము.

ఇంటిపేరు:—యాదవవంశము పాల వెల్లి వలె జగతిఁ దగుటచే పాలవేకరికులాఖ్య వహించెననియుఁ, దాను పాలవేకరికులకలశాంభోనిధిసుధాకరుఁడ ననియుఁ దెల్పియున్నాఁడు. శాసనములం దితని వంశమువారందఱును తాడిగోళ్లవారని పేర్కొనఁబడియున్నారు.

దీనికి సమన్వయ మెట్లు? అను ప్రశ్న మొకటి కలదు; ఈ ప్రశ్నకు సమాధానము శుకసప్తతియవతారికయందు కానవచ్చుచున్నది.

"ఆమహితాన్వవాయవసు
ధాధిపు లచ్యుతగోత్రపాత్రు లు
ద్దామభుజాపరాక్రమవి
దారితఘోరమదారివీరులై
భూమి భరించి రాన్నృపుల
భూతిమహోన్నతి నేలె భోగసు
త్రాముఁడు తాడిగోళ్లపుర
ధాముఁడు శ్రీపెదయాబళుండిలన్." 21

మొదట వీరియింటిపేరు పాలవేకరివారు; తాడిగోళ్లయందు స్థిరనివాస మేర్పఱచుకొని యచట నెలకొనుటవలన తాడిగోళ్ల యను ఇంటిపేరు గలిగినది. ఇట్టి మార్పు పెక్కుకుటుంబములయందుఁ గానవచ్చుచున్నది. పాలవేకరివారు గాక యచ్యుతగోత్రులు రాళ్లకోటవారు గలరని పైఁ జెప్పియున్నాను; అట్లే చిప్పగిరివారు సవరమువారైరి. ఆరెవీటిబుక్కరాజు సంతతిలో నొక శాఖవా రాగృహనామముతోడనే యుండఁగా, నితరులు నంద్యాలవారనియు, నాకువారనియు నిజనివాసస్థానములనే గృహనామములు గ గ్రహించిరి. రేచర్లవారు రావువారనియు, వెలుగోటివారనియు, సురభివారనియు ఇంటిపేర్లను మార్చుకొనిరి. కావున కదిరీపతి పాలవేకరివాఁడని చెప్పుకొనఁగా నతని పెదతండ్రులును, వారి సంతతివారును తాడిగోళ్లవారమని ప్రకటించుకొనుటయందు వైపరీత్యమేమియుఁ గానరాదు.

కదిరీపతిజన్మదేశమునుగూర్చి కొంత యభిప్రాయభేదము గానవచ్చుచున్నది. రావుబహదూరు వీరేశలింగంపంతులుగారితఁడు నెల్లూరుమండలమువాఁడనిరి; 22 కొచ్చర్లకోటరామచంద్రవెంకటకృష్ణరావు పంతులుగారు దీని నంగీకరింపక నితఁడు కడపమండలములోని కదిరిరాజ్యమును బాలించిన ప్రభువని నుడివిరి; 23 శ్రీ త్తపల్లి సూర్యారావుగారు పాలవేకరివారికి

20. SII. VII. Nos. 1563,564,569. 'సవరము' అను ఇంటి పేరు ఈచినచన్నప్పవల్ల కలిగినట్లున్నది. మొదట వీరిఇంటిపేరు చిప్పగిరివారు; 569 లో చిప్పగిరిసింగమనాయనిపౌత్రుఁడు చవరం చన్నప్పయని యున్నది; 564లో సవరము చన్నప్పకు బదులు 'కుంచ్చ చన్నప్ప' యని యున్నది. రాయలకు కుంచె వేయుటచే నితనికి 'కుంచె', లేక 'సవరము' చన్నప్ప యను పేరు రూఢియాయెను. ఇతని వంశమువారు 'సవరము' వారైరి.

21. శుక. ౧:౨౦.

22. ఆం. క. చ. పుట ౩౬౧.

23. శుకసప్తతి ప్రథమముద్రణపీఠిక.

'రాజధాని తాడిగోళ్ల పురము' అని చెప్పి శాసనములలో తాడిగొట్లయని కనఁబడునదియే తాడిగోళ్ల కావచ్చునని యూహించిరి; 24 కాని యేశాసనములలో నీ తాడిగొట్ల కనఁబడుచున్నదియో, యెచ్చట నది కలదో తెలుపరైరి.

తాడిగోళ్ల తాడిగొట్ల కాదు; అది మొరసు రాజ్యమునందు, అనగా నిప్పటి కోలారుమండలమునందలి శ్రీనివాసపూరుతాలూకాయందు గానవచ్చుచున్నది. విజయనగరరాయల కాలమున నీగ్రామము పెనుగొండ రాజ్యమున కణఁకువరై యుండెను. సోమయాజుల పల్లి తామ్రశాసనమున "పెనుగొండరాజ్యం ముకొట్టిడ్లి స్థలం గుండ్లూరసీమ...మానాయకానకు చెల్లే తాడిగోళ్ల" అని చెప్పియున్నది; 25 మఱియొక శాసనమున "పెనుగొండ్లగుండ్లవారిసీమకు చెల్లే...మానాయకానకు చెల్లే తాడిగోళ్ల యెడ్డాలవసీమలోపల" యని యున్నది. పెనుగొండ్లగుండ్లవారిసీమ పెనుగొండగుండ్లూరిసీమకు భ్రష్టరూపము. మఱియు నింతవఱకు లభ్యమైన తాడిగోళ్ల వంశీకుల శాసనము లన్నియు నీకోలారుమండలము నందలి శ్రీనివాసపుర తాలూకాయందును దత్పరిసరస్థలములందే కానవచ్చుచున్నవి. తాడిగోళ్ల పురధాముఁడైన పెదయోబళరాజు "గదెరాకమున తెర్కణ మొదలుగల్గు బహురాజ్య" మేలినట్లు కృత్యవతారికయందుఁ గలదుగదా. 'కదెరాక' మెద్దియో తెలియకపోయినను 'దెర్కణ' యనునది బెంగుళూరుమండలములోని 'తెర్కణాంబి' యనుదానికి సంగ్రహరూప మనుటకు సంశయింపఁబనిలేదు. కావునఁ గదిరిపతిజన్మదేశము ప్రస్తుతి మైసూరుసంస్థానాంతర్గతాంధ్రదేశములోని కోలారు మండలమని దృఢముగఁ జెప్పవచ్చును.

24. శుకసప్తతి ద్వితీయ ముద్రణపీఠిక.

25. Mys. Arch. 1924 p. 92.



ఆర్యరసాయనశాల
ముక్త్యాల, కృష్ణా.
స్థాపితము 1925
ప్రశస్తాయుర్వేదౌషధముల
కు నిలయము. ఏమందు కావ
లసినను మాకు వ్రాయుడు.
నమ్మకమైనవి లభింపగలవు

ఆయుర్వేద భూషణ
యూరి శంకరశాస్త్రి ఎం.ఎ.
CONSULTING PHYSICIAN

## ఆంధ్ర గ్రంథమాల,

నెం. 2 తంబుశెట్టి వీధి, మద్రాసు.

ఆంధ్రవిజ్ఞానసర్వస్వము
(2 సం.) సం. 1 కి రు. 10-0-0

జీర్ణవిజయనగర చరిత్ర-కుం.
ఈశ్వరదత్తుగారు 1-0-0

తంజాపురాంధ్రనాయకరాజ
చరిత్ర-కురుగంటి సీతా
రామయ్యగారు 1-0-0

అళియ రామభూపాలుడు-
టి. శివశంకరంగారు 1-0-0

## పంచరత్నములు

### 1 S. K. M.

### సిద్ధకల్ప మకరధ్వజ

యౌవనపటుత్వము,
శరీరసౌష్ఠవమునకు
60 మాత్రలు రు. 10. 30 మాత్రలు రు. 5.

### 2 M. C. T.

### మహాచందనాది తైలము

మెదడుకు, వెంట్రుకలకు
శ్రేష్ఠమైన టానిక్
12 ఔ॥ రు. 4. 6 ఔ॥ రు. 2-2.

### 3 అబలాకల్పం

ఋతుదోషములకు. కుసుమ
వ్యాధులకు, దివ్యౌషధము.
స్త్రీలపాలిటి వరప్రసాదము.
12 ఔ॥ రు. 2-8. 6 ఔ॥ రు. 1-6.

### 4 హింగు లేహ్యం

జీర్ణించిన కడుపునొప్పి, అజీర్ణము,
పొత్తికడుపు వ్యాధులకు అత్యద్భు
తముగా గుణమొసగు దివ్యౌషధము.
20 రోజులకు మందు రు. 2.

### 5 ద్రాక్షాది లేహ్యం

మలబద్ధకమును నివారణచేసి
రక్తమును శుభ్రపఱచు హల్వా.
30 తులములు రు. 3. 15 తు॥ రు. 1-10,

మాన్యుఫాక్చరర్లు :
దిమదరాసు ఆయుర్వేదిక్
ఫార్మసీ లిమిటెడ్.
సోల్ డిస్ట్రిబ్యూటర్స్ ఏజంట్లు :
శ్రీ హనుమాన్
ట్రేడింగు కంపెనీ,
292, ఎస్ప్లనేడ్, జి.టి. మదరాసు.

# హిందూదేశపు సర్వజనా సౌందర్యమువను

# నవీన ఆకృతి




మీకు అభిమానమైన "వత్ని" సబ్బు తూకంలోగాని, విశిష్ట గుణములలోగాని, ఏ విధమైన తగ్గుదలలేక, పాత స్వరూపమును విడిచి, నూతన ఆకృతిని పొందినది. చిరపరిచయమైన ఈ చిహ్నాములతో, ఆకుపచ్చ తెలుపురంగుల పెట్టెలలో లభించు మనోపూసమైన ఈసబ్బును మీరు గుర్తించగలరు.




ఈ సబ్బు యీ ఆకుపచ్చ తెలుపు రంగుల పెట్టె యీ చిహ్నాములతో నుండినగాని నిజమైనవిగావు

Vatni వత్ని - చిన్న సైజు (నవీన ఆకృతి)
పెద్దసైజు సబ్బులవలెనే ప్రత్యేకముగా పెట్టెలలో సమర్పబడియుండును

Godrej గోద్రెజ్
చావి ఛాప్
గ్లిసరిన్

మరికొన్ని సుప్రసిద్ధమైన గోద్రెజ్ చావి ఛాప్ స్నానపు సబ్బులు

| | | | |
|---|---|---|---|
| No. 1 | Sandal | Limda | Khus |
| నం. 1 | స్యాండల్ | లిమ్డా | ఖస్ |

| | |
|---|---|
| Shaving Stick | Shaving Round |
| షేవింగ్ స్టిక్ | షేవింగ్ "రౌండు" |

గో ద్రె జ్ సో పు, లి మి టె డ్
మదరాసు (164, బ్రాడ్వే) ; ఎర్నాకులము (9/278, జీవ్ స్ట్రీట్)

# మాలపల్లి నిర్మాత ఉన్నవ లక్ష్మీనారాయణగారు

= శ్రీ శ్రీనివాసశిరోమణి =

మద్రాసు ఆంధ్రపండితులు ౧౮౯౦-వ సంవత్సర ప్రాంతమునుంచీ ఆంధ్రవచనరచనను అపమార్గము పట్టించినారు అనిన్నీ, అప్పటినుంచీ ఆంధ్రములో పరంపరాగతమయిన వచనరచనాపద్ధతి ధ్వంసము అయిపోయిందనిన్నీ, ఆంధ్రరచయితలందరున్నూ ఆ పరంపరాగతమయిన వచనరచనాపద్ధతిని అనుసరించడము అవశ్యకర్తవ్య మనిన్నీ కీర్తికాయుడు గిడుగు వేంకటరామమూర్తిపంతులుగారు ౧౯౧౦ వ సంవత్సరములో సింహనాదము చేసినారు.

ఆ సింహనాదానికి గ్రాంథికాంధ్రము అనే పేరుతో కృత్రిమ తెలుగులో వ్రాస్తున్నవారందరూ బెంబేలుపడిపోయినారు. పంతులవారీసిద్ధాంతము చేసిన తరువాత ఒక్క దశాబ్దమువరకున్నూ బుద్ధిమంతులందరున్నూ పరంపశాగతమయిన వచనరచనాపద్ధతి ఏదనే జిజ్ఞాసకు దిగినారు. కాని ఒక్కరున్నూ పంతులువారి సిద్ధాంతము ప్రకారము గ్రంథరచనకు పూనుకొన్నవారు లేరనే చెప్పవచ్చును.

రెండో దశాబ్దములో, అనగా ౧౯౨౦ వ సంవత్సరముతో ఆరంభమయిన దశాబ్దములో కొంతమంది బుద్ధిమంతులు—విద్వాంసులు పంతులవారి సిద్ధాంతము ననుసరించి వచనరచనారంభము చేసినారు.

ఈ నాడు ప్రసిద్ధవచనరచయితలందరున్నూ ఈ రెండోదశాబ్దమురచయితలు పోయినదారినే పోతున్నారు. కొంచెము ఆలోచించిచూస్తే ఈ నాడు ఆంధ్రభాషలో గ్రాంథికాంధ్రము అనే కృత్రిమాంధ్రములో వ్రాయగలవారుకానీ, వ్రాస్తున్నవారుకానీ బహుకొద్దిమందే నని తోచకతప్పదు. వ్యవహారికాంధ్రము బహువ్యాప్తము అయిపోయింది. చివరకు గవర్నమెంటువారు యుద్ధప్రచారముకోసము వ్రాయించిన వ్రాతలనుకూడా ఈవ్యవహారికాంధ్రములోనే వ్రాయించి ప్రకటించినారు. వయోజన విద్యాభ్యాసముకోసము క్రిస్టియన్ లిటరేచరు సొసయిటీవారు పాఠపుస్తకాలను వ్యవహారికాంధ్రములోనే వ్రాయించక తప్పనిసరి అయింది.

వ్యవహారికాంధ్రము ఇంత బహుజనరంజకము కావడానికి కారణము రెండోదశాబ్దము రచయితల రచనలూ, వారందుకు చేసిన కృషీ అని చెప్పవచ్చును.

ఈ రెండోదశాబ్దపు రచయితలలో శ్రీ ఉన్నవ ల నారాయణపంతులుగారు అగ్రగణ్యులు.

అగ్రగణ్యులు అంటే పంతులుగారే మొట్టమొదటి రచయిత అని అనడానికి వీలులేదు. వారికన్నా ముందుగా వ్యవహారికాంధ్రములో గ్రంథము చేసినవారు ఉన్నారు. నన్నయ ఆదికవి అన్నప్పుడు పద్యకవిత్వము నన్నయ్యకు పూర్వము లేదని అనడానికి వీలులేదు. ఇంగ్లీషుభాషలో ఛాసరుకు పూర్వము గ్రంథరచన చేసినవారు లేరని అనడానికి వీలులేదు. అయితే ఆయా రచయితలు తరతరాలవారికిన్నీ మార్గదర్శకు లయినారు. అదేవిధముగా ఉన్నవ లక్ష్మీనారాయణపంతులుగారు వ్యవహారికాంధ్రవచనరచనకు యుగపురుషులు,

పంతులుగారు కేవలము పేదకుటుంబములో కాకపోయినప్పటికిన్నీ సామాన్య బ్రాహ్మణకుటుంబములో ఫిరంగిపురముసమీపములో ఉన్న వేములూరుపాడు అనే గ్రామములో ఈశ్వరనామ సంవత్సర కార్తీక బ॥ 30నాడు జన్మించినారు. తల్లి పసితనములోనే పోయింది. వయస్సు వచ్చేసరికి సంసారభారము పంతులుగారిమీద పడ్డది.

అసలు పంతులుగారి జీవితములో వచ్చినన్ని మార్పులు—అందులో అంతంత తొందరగా వచ్చినన్ని మార్పులు ఏ తెలుగునాయకుడి జీవితములోనూ రాలేదేమో.



గుంటూరు ఏ. ఇ. యల్. యం. కాలేజీలో ఎఫ్. ఏ. చదువుతున్న రోజులలోనే ఇతికర్తవ్యతామూఢత పంతులుగారిని పట్టుకొంది. ఉపాధ్యాయవృత్తికి తయారుకావడమా, కాక ప్లీడరీవృత్తికి తయారుకావడమా అనే జిజ్ఞాస వచ్చింది.

ఆయనజిజ్ఞాస అంతటితో ఆగలేదు. రాజకీయముగా దేశములో మార్పురావలెనా, ముందుగా సంఘములో మార్పురావలెనా అనే జిజ్ఞాసయున్నూ కలిగింది.

ఏమయితేనేమి, ఆనాడు పంతులుగారి చిత్తాన్ని ఉపాధ్యాయవృత్తే ఆకర్షించింది. రాజమహేంద్రవరము ట్రయినింగ్ కాలేజిలో ఉపాధ్యాయశిక్షణము పొందడానికి వెళ్లినారు

ఆనాడు ఆ రాజమహేంద్రవరములో కందుకూరు వీరేశలింగంపంతులుగారికి లక్ష్మీనారాయణ పంతులుగారు ముఖ్యులయినారు. ఆయనవితంతుశరణాలయానికి సూపరింటెండెంటున్నూ అయినారు. అయితే ఆయన ఎక్కువకాలము అక్కడ ఉండలేదు.

రెండు కత్తులు ఒక్కవరలో ఇముడుతవా!

రాజమహేంద్రవరము వేడితో పంతులుగారు గుంటూరు చేరినారు. వృత్తికి ఉపాధ్యాయులు అయినారు. వితంతుశరణాలయమున్నూ గుంటూరులో పంతులుగారు స్వయముగా ఆరంభించినారు. కాని పాలితజాతికి రాజకీయసమస్యలు తప్ప సాంఘికసమస్యలతో నిమిత్తములేదని పంతులుగారు తేల్చుకొన్నారు.

ఈనిశ్చయానికి పంతులుగారు వస్తూఉండగానే అటు వితంతుశరణాలయము అంతరించడము మొదలుపెట్టింది.

లౌక్యజీవితము పంతులుగారికి ఈవిధముగా నడుస్తూఉన్నందువల్ల వారికి ఉపాధ్యాయవృత్తికన్నా లాయరీయే యోగ్యముగా తోచింది. ప్లీడరుపరీక్ష ఇచ్చి ప్లీడరు అయినారు పంతులుగారు. కొద్దికాలానికే ఆవృత్తిన్నీ ఆయనకు నచ్చలేదు. ఆయనదృష్టి వర్తకముమీదికిపోయింది. పాశ్చాత్యవాణిజ్యసంస్థ ర్యాలీ బ్రదర్స్ కంపెనీలో కాషియర్ కొలువుకు పంతులుగారు కుదురుకొన్నారు. పాశ్చాత్యవాణిజ్యసంస్థలవారు వ్యాపారము పేరుతో చేసే దుష్టచేష్టలను సహించలేకపోయినారు. ఆ పనీ మానుకొన్నారు. ఉన్నంతలో ప్లీడరీవృత్తే బాగున్నట్లుగా పంతులుగారికి తోచింది. తిరిగీ ప్లీడరు అయినారు.

పంతులుగారు వృత్తికి ప్లీడరు. కాని ఆయనబుద్ధి అంతా రాజకీయాలమీదికి పోయింది. దేశచరిత్రపఠనమూ, అర్థశాస్త్రవిలోడనమూ ఆరంభించినారు.

ఆయన వక్త కాడు. కాని గోష్ఠి చేయడములో ఆయనను మించినవారు ఆంధ్రదేశములో మరొకరు ఉండరు.

# 'మాలపల్లి' నిర్మాత ఉన్నవ లక్ష్మీనారాయణగారు

పంతులుగారు ప్రాచీనాంధ్ర గ్రంథమథనము ఆరంభించినారు. అంతటితో ఆయన తృప్తిపడలేదు. సంస్కృతభాషాభ్యాసమునకు తయారయినారు. అందుకోసము ప్రత్యేకముగా ఒకానొక సంస్కృత పండితునిదగ్గర రఘువంశకావ్యపాఠము మొదలుపెట్టినారు.

అప్పటి కాయనకు వయస్సు ముప్ఫయి సంవత్సరాలపైచిల్కు ఉంటుంది.

వంగదేశ విభజనముతో ఒక్కసారిగా వంగ నాయకులు నిద్రలేచినారు. అంతవరకూ వంగదేశములో సాంఘికోద్యమాలే చెలరేగినవి. కాని రాజకీయోద్యమాలు విజృంభించలేదు. బ్రిటీషురాజ్యము సుస్థిరము అయింది అని తెలియగానే పాలితజాతికి రాజకీయసమస్యతప్ప మరొకటి లేదని మొట్టమొదట గమనించినవారు మహారాష్ట్రులు. బ్రిటీషురాజ్యాన్ని ధిక్కరించడానికి యావద్భారతదేశములో మొట్టమొదట పూనుకొన్నవారున్నూ మహారాష్ట్రులే. తమ వంగరాష్ట్రము రెండుముక్కలు అయిపోతుందని తెలియగానే బాంగ్లావారున్నూ స్వరాజ్యోద్యమము తలపెట్టినారు. దేశమంతటా స్వరాజ్యోద్యమ ప్రచారానికి బాంగ్లానాయకులు బయలుదేరినారు. వారిలో విపిన చంద్రపాల్ స్వరాజ్యోద్యమ ప్రచారానికి దక్షిణ హిందూస్థానానికి వచ్చినాడు.

విపినచంద్రపాల్ ఆంధ్రదేశ సంచారానికి రాగానే మొట్టమొదట జోహారు అన్నది పంతులుగారు. ఆ విపినచంద్రపాల్ ఉపన్యాసాలను మొట్టమొదట తెలుగులోకి తర్జుమా చేసిందిన్నీ పంతులుగారే.

ఆ రాజకీయోపన్యాసాల తర్జుమాయే పంతులుగారి గ్రంథరచనకు ప్రథమప్రయత్నము. ఆ తరువాత కొంతకాలానికి అక్బరుచరిత్ర అనే గ్రంథము వ్రాసినారు. అయితే అదిన్నీ స్వతంత్రగ్రంథము అనడానికి వీలులేదు. అది ఒకానొక ఇంగ్లీషుగ్రంథాన్ని పట్టి వ్రాసింది. కొంతకాలానికి పంతులుగారున్నూ, వారి మిత్రులు మరిఒకరున్నూ కలసి ఇండియారాజ్యతంత్రము అనే గ్రంథము వ్రాసినారు. ఇది పంతులుగారి స్వతంత్రగ్రంథము అని చెప్పవచ్చును. కేవల రాజకీయార్థికవిషయాలను అంకెలతో తెలియచెప్పిన పుస్తకము అది.

ఈ మూడుపుస్తకాలున్నూ పంతులుగారు గ్రాంథికాంధ్రములోనే వ్రాసినారు.

ఈ విధముగా పంతులుగారి చిత్తవృత్తులన్నీ లోకసంగ్రహమువీద ప్రసరించినవి. ఇక నా పరిస్థితులలో ఆయనవరుమానమువిషయము ఒకరు చెప్పవలెనా!

ఏవిధముగా ఆలోచించిచూచినా బారిష్టరు అయ్యేట్లయితే తన సమస్తసమస్యలున్నూ తొలగిపోయేటట్లుగా పంతులుగారికి తోచింది. ఆయన ఐర్లాండుదేశము ప్రయాణమై వెళ్లిపోయినాడు. సాధ్యమయినంత త్వరలో పంతులుగారు బారిష్టరుకోర్సు పూర్తిచేసుకొని డబ్లిను నగరము కింగ్సు ఇన్సులో బారిష్టరుపట్టం సంపాదించుకొని స్వదేశము తిరిగివచ్చినారు. రాజధానీనగరము-మద్రాసులో బారిష్టరు ప్రాక్టీసు ప్రారంభించినారు. ఇంకా వృత్తిలో పంతులుగారు పుంజుకోలేదు. ఒకవైపున తిలకుమహాశయుడు రెస్పాన్సివ్ కో ఆపరేషన్ అవలంబించవలెనన్నాడు. మరొకవైపున గాంధీజీ సర్వానికీ శూన్యము చెప్పమన్నాడు.

పంతులుగారికి మొదట తిలకుమహాశయుడి మతమే నచ్చింది. అయితే ఆయన అసహాయోద్యమములో చేరినాడు.

వృత్తికి స్వస్తి చెప్పినాడు. ఆ రాజకీయోద్యమములోకి ఉరికినాడు.

పంతులుగారు దీర్ఘకాయులు. ఉదాత్తమయిన విగ్రహము. ఆ పొడుగుకు తగినంత లావు. ఆ ఒడ్డూ పొడుగుకూ వన్నెతీసుకొనివచ్చే విశాలఫాలభాగము, సుదీర్ఘ నాసిక. కొమ్ములుతిరిగిన గుబురుమీసాలు— అసహాయోద్యమములో తిలతండులన్యాయాన్ని అనుసరించిన బుర్రమీసాలు. ఆనాటి బారిష్టరు ఉన్నవ లక్ష్మీనారాయణపంతులుగారి దేహచ్ఛాయ మేలిమి బంగారురంగు. ఆ రంగుకు దీటయిన గోధుమరంగు

పట్టుతలపాగ. అందులో తోకజారవిడిచిన తలపాగ. నీలిమందురంగుకోటు. అదేరంగు ఇజారు. నల్లటి బూట్సులు.

ఇది ఆనాటి బారిష్టరు వేషము. అయితే ఆ తలపాగలో అప్పుడు దాక్కొన్న పిలకజుట్టుమాత్రము అప్పటికీ ఇప్పటికీ అట్లాగే ఉంది. ఇంగ్లాండు దేశములోకూడా ఆయన తలపాగలో ఆ పిలకజుట్టును భద్రముగా దాచిఉంచినాడు. అది భారతజాతీయతా చిహ్నమని ఆయనమతము.

అసహాయోద్యమములోకి దిగేసరికి అదివరకటి వేషము మారిపోయింది. పలనాటి ఒడుకునూలుతో తయారయిన ఎఱ్ఱమన్నురంగు ముతకగుడ్డతో గుంటూరు ముసల్మానుదర్జీ చేతితోకుట్టిన షేర్వాణీ. అదేరంగు తలపాగ. నాటుచెప్పులు. ఎఱ్ఱటి కుంకుమతో నిలువుగా తీర్చిన బొట్టు. ఈ వేషముతో పంతులుగారు జెయిలుకు వెళ్లినారు.

పంతులుగారు ౧౯౨౧-వ సంవత్సరము జులయి మాసాంతాన పలనాడులో అసహాయోద్యమము నడిపినందుకు శిక్షపడి జయిలుకుపోయినారు.

ఆనాటి అసహాయోద్యమములో యావద్భారత దేశానికిన్నీ మొట్టమొదట జయిలుకు పోయింది ఉన్నవ లక్ష్మీనారాయణపంతులుగారే !

సంవత్సరము రాయవేలూరు జయిలులో ఉండి పంతులుగారు తిరిగివచ్చినారు. వేషము సంపూర్ణముగా మారిపోయింది. మీసాలు పోయినవి. క్రాపింగ్ పోయింది. ముఖాన పట్టెవర్ధనాలు వెలసినవి. చిత్రము—నిజముగా విచిత్రము—ఆయనదేహచ్ఛాయకూడా మారిపోయింది. బంగారురంగు పోయింది. ఎండి వడలిపోయిన నిమ్మపండురంగుగా అయిపోయింది. అయితే మొట్టమొదట స్వతంత్ర తెలుగునవల మాలపల్లితో వచ్చినారు పంతులుగారు.

పాశ్చాత్యసాహిత్యములో ఉద్గ్రంథాలన్నీ వయస్సు ముదిరినవారు వ్రాసినట్టుగా కనబడుతుంది. కాక వయస్సుముదిరినవారు వ్రాసినవే ఉద్గ్రంథాలు అయినవో ఏమో.

ఆధునికాంధ్రులు నవయౌవనులే గ్రంథరచనకు పూనుకొన్నారని చెప్పవచ్చును. కిందటి పాదశతాబ్దములో రచయితలుగా తెలుగుదేశములో బయలుదేరిన వారందరున్నూ ఇరవయ్యో సంవత్సరములో మహాకావ్యరచనకూ, మహాగ్రంథరచనకూ సంకల్పించినారు. ముప్ఫయ్యోసంవత్సరము వచ్చేసరికి సంసారసాగర తరణానికి తాపత్రయపడినారు. నలభయ్యో సంవత్సరము వచ్చేసరికి ఏవృత్తిలోనో లీనమయిపోయినారు. వారందరూ ఒకప్పుడు చేసిన రచనలకు వారే మురిసిపోతూఉంటారు. ఒక్కొక్కప్పుడు తాము చిన్నప్పుడు వ్రాసింది తాము వ్రాసిందేనా అనే సందేహపడుతుంటారు కూడానూ.

ఇందువల్లనే తెలుగులో గొప్పగ్రంథాలు లేదో ఏమో !

ఈ విషయములోకూడా లక్ష్మీనారాయణపంతులుగారు విశిష్టులు. ఆయన నవల వ్రాయడానికి సంకల్పించుకొని వ్రాయనారంభించింది నలభైఅయిదో సంవత్సరములో. అప్పటికి ఆయన కావలసినంత జీవితము చూచినాడు. ఆయనవయస్సు నలభైఅయిదే కావచ్చును. కాని నూరుసంవత్సరాల అనుభవము అయిపోయింది ఆయనకు.

రాయవేలూరుజయిలులో తెలుగువారి మొట్టమొదటి స్వతంత్రనవల "మాలపల్లి" ఉన్నవ లక్ష్మీనారాయణపంతులుగారి కరకమలములో ఉద్భవించింది.

అంత బృహద్గ్రంథము తెలుగువాడుకభాషలో రావడానికి అదే మొదటిపర్యాయము

పంతులుగారు నవల వ్రాసినారంటే తెలుగు లోకానికి కొంత ఆశ్చర్యము వేసింది. ఏమంటే — అంతవరకున్నూ లోకము ఆయన్ను రాజకీయ నాయకుడుగానే గుర్తించింది. కాల్పనికసాహిత్యములోకి వచ్చినాడంటే కొంత విపరీతముగానే తోచింది.

గుంటూరు పెద్దలందరూ వ్రాతప్రతిని చదివి చూచినారు. చకితులై పోయినారు. చాలా గొప్ప పుస్తకము తెలుగులో వచ్చింది అన్నారు. ఆంధ్ర

దేశములో నాటికీ నేటి పుస్తక ప్రకాశకులకు కరువే అయిపోయింది.

అంతపుస్తకమూ అచ్చొత్తించడానికి ఒకానొక బ్రాహ్మణుడు-ఆనాడు ఆయన అగ్రహారందారు-పూనుకొన్నాడు. వందలకొద్దీ పేజీలతో ఒక్కొక్క సంపుటముగా బయటకెకివచ్చింది.

పుస్తకములు అమ్మకముచేయించే తెలివితేటలు అచ్చొత్తించిన ఆయనకు లేవు. పుస్తకము వ్రాసిన ఆయనకు ఆ తెలివితేటలు అసలే లేవు. ఉభయులూ సంపుటాలు సంపుటాలు, అడగనివారు పాపాత్ములుగా, దానధర్మాలు చేసినారు.

మాలపల్లి సంపుటాలు దేశములో విరివిగా కనబడడము మొదలుపెట్టినవి. అంతా అర్థమయ్యే భాష కాబట్టి ప్రతివారూ చదవసాగినారు. గవర్నమెంటువారికి కన్నెర్ర అయింది. ఆపుస్తకాన్ని అమ్మరాదనీ, ప్రకటించరాదనీ ఉత్తరువులు జారీఅయినవి.

కొంతకాలానికి ఆపుస్తకములో కొన్నిభాగాలు తీసివేసేటట్లయితే అచ్చువేసుకోడానికి గవర్నమెంటువారు అంగీకరించినారు.

ఆంధ్రపత్రికాకార్యాలయాధిపతి శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావుపంతులుగారు ఆ "మాలపల్లి"నవలను ఒక్కపుస్తకముగా అచ్చువేయించినారు.

ఆంధ్రాయూనివర్సిటీవారు ఒకసంవత్సరము ఇంటర్మీడియెటుపరీక్షకు పఠనీయగ్రంథముగా "మాలపల్లి"ని నిర్ణయించినారు.

నవల అనేది అంత పెద్ద గ్రంథముగా రావడానికిన్నీ, అందులో గ్రంథమంతా వ్యావహారికభాషలో రావడానికిన్నీ తెలుగులో అదే మొదటిపర్యాయము

గుంటూరుజిల్లా మెట్టతాలూకాగ్రామాలవారు నిత్యజీవనములో వ్యవహరిస్తూఉన్న భాషలోనే పంతులుగారు గ్రంథమంతా వ్రాసినారు. ఒకవిధముగా మాలపల్లి భాష మాండలీకము అనవచ్చును. మాండలీక శబ్దాలు అపారముగానే ఉన్నవి. అయితే వాక్యాలు సజీవములూ, సజాతీయములూ అయినందువల్ల ఆశబ్దానికి అర్థము ఏమిటి అనే చిక్కు రాదు. పంక్తినిబట్టిగానీ, ఘట్టాన్నిబట్టిగానీ ప్రతిశబ్దమూ యిట్టే బోధపడుతుంది. తెలుగు అక్షరాలు వచ్చిన ఏ తెలుగుప్రాంతీయుడయినా చదివి విషయము యిట్టే తెలుసుకోగలిగిన భాషలో ఆగ్రంథము తయారయింది.

గ్రంథమంతటా వాక్యాలూ, పంక్తులూ ఒక్కమాదిరిగా లేవు.

గ్రంథము చదువుతూఉన్నప్పుడు అతిహాయిగా, అతిధారాళముగా మెయిలుబండి వేగముతో సాగిపోతూపోతూ చటుక్కున ఆగిపోవలసివస్తుంది. కొమ్ములుతిరిగిన విద్వాంసులకున్నూ ఒకపట్టాన మింగుపడని సంస్కృత సమాసపదభూయిష్ఠమయిన భాషయున్నూ, శతాబ్దాలనాటి మారుమూలతెనుగుపదాలకు యీనాటి వ్యావహారికప్రత్యయాలను తగిలించి తయారుచేసిన భాషయున్నూ వెక్కిరించినట్టుగా కండ్లఎదట నిలుచుంటుంది. ఆఘట్టము దాటేవరకున్నూ అతివేగముతో పరుగులుతీస్తున్న రైలుబండి కొండలెక్కుతున్నట్టుగా ఉంటుంది. ఎట్లాగో చచ్చిచెడి చేయంగల విన్నపము లయి ఆఘట్టము దాటితే మళ్లీ మామూలుమాటలతో అతిసొగసుగా, తెలియకుండా, పుస్తకము చదువుతున్నామనే జ్ఞానము లేకుండా గ్రంథము చదువరిని లాక్కొనిపోతుంది. మళ్లీ కొంతదూరము పోయేసరికి కొండలు, తిప్పలు ఉన్న ఘట్టము వస్తుంది....

అది లక్ష్మీనారాయణపంతులుగారి రచనారీతి అనవచ్చును. పంతులుగారు గ్రాంథికాంధ్రములో వ్రాసిన అక్బరుచరిత్రలోనూ, విపినచంద్రపాలు ఉపన్యాసాల తర్జుమాలోనూ రచనారీతి ఈమాదిరిగానే ఉంది.

రచయితలు ఆరంభదశలో ఖేదాంతగ్రంథాలు వ్రాస్తారనీ, ఆరంభదశలో ఉన్న ఏ జాతీయ వాఙ్మయము అయినా ఖేదాంతగ్రంథాలతో ఉంటుందనీ పెద్దలు అభిప్రాయపడ్డారు.

పరిణతులయిన రచయితలు మోదాంతగ్రంథాలనే వ్రాస్తారనీ, అదేవిధముగా పరిణతమయిన ఏ దేశ

# భారతి - పార్థివ కార్తీకము

వాఙ్మయము అయినా మోదాంతముగా ఉంటుందనీ కనిపెట్టినారు పెద్దలు.

ఈ అభిప్రాయము యథార్థమో ఏమో అన్నట్లు పంతులుగారున్నూ మాలపల్లి లోచాలవరకూ చేసినారు.

మాలపల్లి ఖేదాంతము అనడానికిన్నీ వీలులేదు: మోదాంతము అనడానికిన్నీ వీలులేదు. ఏవిధముగా గ్రంథము ముగిసింది అని ప్రశ్న. సమాధానము చెప్పడము చాలా కష్టసాధ్యము.

పంతులుగారు మహాగొప్పపాత్రలను సృష్టించినారు. ఆసృష్టించినవారిని ఒక్కొక్కరినే ఒక్కొక్క సంపుటములో వరుసగా చంపుకొంటూవచ్చినారు. చివరకు ఎందుకూ పనికిమాలిన ముసలిముతకపాత్రలను మాత్రము బ్రతికించినారు. [ఆ బ్రతికించిన ముసలివాండ్లను ఏమి చేయవలెనో తెలియక తికమకపడిపోయి ఈ విశాలప్రపంచములోకి వదిలివేసినారు.

పంతులుగారు పరిణతవయస్కులు. బుద్ధిన్నీ పరిణతదశకు వచ్చింది. కాని రచనకుమాత్రము ఆరంభదశ అయింది. అందువల్లనే గ్రంథము ఖేదాంతమూ, మోదాంతమూ కాకుండా అయోమయాంతము అయిపోయింది.

మాలపల్లి నవలలో నాయకుడు సంగదాసు అని అనుకోమని పంతులుగారు అంటారు. ఆనాయకుడు మొదటిసంపుటములోనే ఖూనీఅయిపోయినాడు.

మాలపల్లి నవల దారితప్పడము అయింది. సంగదాసుకాకుండా సంగదాసుతండ్రి మొదటి సంపుటములో హతుడయిపోయి ఉన్నట్లయితే నవల చివరకు అటు ఖేదాంతమో, ఇటు మోదాంతమో అయితీరేది.

ఆధునిక నాగరకతాపద్ధతివల్లనూ, ఇంగ్లీషు భాషాసంస్కారమువల్లనూ తెలుగుగ్రామాలలో సంసారాలు ఏ విధముగా భ్రష్టమయిపోతున్నదీ రెండోసంపుటములో చెప్పదలచుకొని పంతులుగారు ఒకానొక ఇంగ్లీషునవలను అనుకరించినారు. అది అనుకరణముగానే ఉండిపోయింది. అసలు గ్రంథములో అది అతుకుగానే ఉండిపోయింది

మిగిలిన చక్కని పాత్రలు మూడోసంపుటములో చనిపోయినారు. నాల్గోసంపుటములో ముసలీముతకా అంతా మిగిలిపోయినారు.

ఈవిధముగా ఎన్ని లోపాలనయినా ఆ మాలపల్లిలో చూపించవచ్చును.

ఏ ఒక్క సమస్యో కథావస్తువు కాదు. ఆంధ్రదేశాన్ని—కాదు యావద్భారతదేశాన్ని యీనాడు బాధిస్తున్న సమస్యలన్నికూడా మాలపల్లి కథావస్తువులే.

ఇన్ని మాటలెందుకు?—పంతులుగారి మాలపల్లి ఒక చిన్న ఎత్తున ఆంధ్రదేశప్రత్యక్షజగత్తు.

పంతులుగారు స్త్రీపాత్రలను సృష్టించి పోషించడములో సిద్ధహస్తులు. నిత్యజీవనములో కనుపించే స్త్రీలకన్నా ప్రత్యక్షముగా మాలపల్లిలో స్త్రీలందరూ కనిపిస్తారు. ఆ నవలలో ఒక్కొక్క స్త్రీ ఒక్కొక్క ప్రయోజనముతో ఒక్కొక్క పద్ధతితో ఒక్కొక్కందుకు పుట్టి పెరిగినది.

ఆ నవల ఒక్కపర్యాయము చదివినా అందులో స్త్రీలందరూ భావవీథిలో ఎప్పుడూ సంచారము చేస్తూఉంటారు.

నిత్యజీవితములో పురుషుల భాషణకున్నూ, స్త్రీల భాషణకున్నూ భాష ఒక్కటే అయినప్పటికిన్నీ ఎంతో తేడా ఉంటుంది. అందులో ఒక్కొక్కరకము స్త్రీ ఒక్కొక్కమాదిరిగా వాక్యాలను అల్లుతూఉంటుంది. ప్రత్యక్షజగత్తు గమనిస్తే అనుక్షణమూ ఈవిషయము ధ్రువపడుతుంది. కాని మన తెలుగుపుస్తకాలలో నన్నయభట్టులగాయతూ నన్నా సాయిబుగారివరకున్నూ స్త్రీపురుషులందరున్నూ ఒక్కమాదిరిగానే భాషించినారు. భాషిస్తున్నారు.

పంతులుగారి స్త్రీపాత్రలు ప్రత్యక్షజగత్తులో స్త్రీలు సంభాషించినట్లే సంభాషిస్తారు. అందులో కాముకి ఒకరకముగా మాట్లాడుతుంది. వృద్ధాంగన ఇంకొకరకముగా మట్లాడుతుంది. పనికత్తె మరొక

రకముగా మాట్లాడుతుంది. ఈవిధముగా ఆయా స్త్రీలు వారికి ఉచితమయిన రీతిన మాలపల్లినవలలో ప్రసంగిస్తారు. అంతేకాదు. స్త్రీసహజముగా సంచరిస్తారు. ప్రవర్తిస్తారు.

ఈవిషయములో మాత్రము మాలపల్లితో తుల్యమయిన రచన ఇంతవరకున్నూ తెలుగులో రాలేదు.

ఆంధ్రదేశగ్రామజీవితాన్ని పంతులుగారు చూపించినంత చక్కగా, యింపుగా, సొంపుగా మరొక తెలుగురచయిత ఇప్పటికిన్నీ ఏగ్రంథములోనూ చూపించలేదు.

తెలుగుజాతీయ నుడికారము (idiom) తెలుసుకోవలెనంటే, తెలుగువాక్యాలు ఎన్ని మాదిరిలుగా ఉంటవో తెలుసుకోవలెనంటే, చివరకు ఇంగ్లీషు తెలుగువాక్యాలు ఎంత ఎబ్బెట్టుగా ఉంటవో తెలుసుకోవలెనంటే పంతులుగారి మాలపలి చదవవలసిందే.

కందుకూరు వీరేశలింగంపంతులుగారు రాజశేఖర చరిత్ర అనే పేరుతో తెలుగులో మొట్టమొదటినవలను వ్రాసినారు.

అది ఆంగ్లో ఇండియన్ పడుచుమాదిరిగా తయారయింది. ఆపడుచును చూచి ముగ్ధులయిపోయిన రచయితలు నవలలు రచించడానికి పూనుకొన్నారు. ఆతరువాత బయలుదేరిన నవలలన్నీ అయోమయపు పడుచులుమాదిరిగా తయారయినవి. తమ దేశపు పడుచులు బాగా లేరని పక్కయింటి బెంగాలీపడుచులను తెలుగులోకి లాగుకొనివచ్చినారు.

ఈతర్జుమాలు తప్పులు తిప్పలుగా తెలుగుభాషలో బయలుదేరేసరికి నవలలు అంటేనే తెలుగువారికి అసహ్యము పుట్టింది. అందువల్లనే ఆరోజులలో మన తెలుగులో నవలలు అక్కరలేదు అని కథానికలు వ్రాయడానికి శ్రీ శివశంకరశాస్త్రిలవారి ముఠావారు పూనుకొన్నారు. ఆరోజులలో లక్ష్మీనారాయణ పంతులుగారి మాలపల్లి వచ్చింది.

అది నూటికి నూరుపాళ్లూ తెలుగుపడుచు.

లక్ష్మీనారాయణపంతులుగారు ఇంకా నవలలు వ్రాసినట్లయితే ఎంతో బాగుండేది. కాని అట్లా చేయలేదు. నాయకురాలు అనే నాటకము వ్రాసినారు. నాపసాని అనే చిన్న పుస్తకము ఒకటి వ్రాసినారు. ఇంకా ఏవో పాటలపుస్తకమున్నూ వ్రాసినారు. కాని అవేవీ జనరంజకములు కాలేదు.

చివరకు ఆయనదృష్టి వాఙ్మయముమీదినుంచి మరొకవైపు పోయింది.

కిందటి శతాబ్దపు రష్యన్ వాఙ్మయానికి అలెగ్జాండరుపోష్కిన్ ఎటువంటివాడో ఆధునికాంధ్ర వచనరచనకు లక్ష్మీనారాయణపంతులుగారు అటువంటివాడు.






**జర్మెక్సు**

తామర
పొడలు, గజ్జి,
పుండ్లు,
కత్తికోత,
గాయములు
మొటిమలు
చర్మవ్యాధు
లను మాన్పు
ఆయింటు
మెంటు.

**A LITTLE'S ORIENTAL BALM PRODUCT**

మృదువైన నిగనిగలాడు కేశసంపదకు

# కేశమిత్ర

వెజిటబుల్ తలనూనే వాడుడు.

తల వెంట్రుకల పెరుగుదలకు తోడ్పడును.

బట్టతల కానీయదు. చుండు నివారణ చేయును. కేశములను రాలి పోనివ్వదు.

కెమిస్టులవద్ద దొరకును, లేక దిగువ అడ్రెస్సునుండి నేరుగా తెప్పించుకొనవచ్చును.

**లిటిలు ఓరియంటల్ బామ్ అండ్ ఫార్మస్యూటికల్స్ లి॥**

పోస్టు బాక్సు 67, మదరాసు.

# ప్రవర, నిగమశర్మలు



= శ్రీ కుంటిమద్ది శేషశర్మ =

ప్రవరనిగమశర్మ లిరువురు ఇద్దరు మహాకవుల కవితా చమత్కృతి నవతరించినవారు. ప్రవరపాత్రనిర్మాత యగు మహాకవి

"హితుడవు చతురవచోనిధి
వతులపురాణాగమేతిహాసకథార్థ
స్మృతియుతుడ వాంధ్రకవితా
పితామహుడ వెవ్వ రీడు పేర్కొన నీకున్"

అని రాజమాత్రుడు గాక, కవివతంసుడును నగు కృష్ణదేవరాయలచే కీర్తింపబడినవాడు. మరొకరు డన్ననో—

"ఉదయం బస్తనగంబు సేతువు హిమ
వ్యూహంబునన్ జుట్టిరా
విదితంబైన మహిన్ మహాంధ్రకవితా
విద్యాబలప్రౌఢి నీ
కెదు రేరీ సరసార్థబోధఘటనా
హేలాపరిష్కార శా
రద నీరూపము రామకృష్ణకవిచం
ద్రా సాంద్రతేజోనిధీ!"

అని పేరుపొంది, ఘలోక్తుల నెట్టివారి నేని వాయికట్టగల దిట్ట.

ఇట్టి మహాకవి కవితాపరిపుష్టులగు నీవ్యక్తుల సామ్యవైషమ్యముల నించుక విచారింతము.

పూర్వుడగు ప్రవరుడు మకరాంక శశాంక మనోజ్ఞమూర్తి. భాషాపరశేషభోగి. వివిధాధ్వర నిర్మల ధర్మకర్మ దీక్షాపరతంత్రుడు. అంబురుహగర్భ కులాభరణంబు. అనారతాధ్యాపన తత్పరుండు. అలేఖ్య తనూ విలాసుడును. సుఖులై తలిదండ్రులు దేవి యుం దేవరవోలె నుండి యిలుదీర్పగ, కూకటుల్ గొలిచి చేసిన సోమిదమ్మ సౌఖ్యావహయై భజింప, యవ్వనమందు నిశ్చింతగ కాపురమొప్పువాడు. మాన్యక్షేత్రము లెప్పుడు పెక్కుచందాలన్ పండి, ఇంట నొకప్పుడు పాడిపంటలు తరుగకుంటచేత నర్థార్జనా తాపత్రయ మితనికి లేదు. కానన్, శీలంబున్ కులమున్ శమంబు దమమున్ జెల్వంబు లేప్రాయమున్ బోలన్ జూచి, "యితండు పాత్ర"మని యేభూపాలుండే వచ్చినన్ సాలగ్రామము మున్నుగా గొనడు. అతిథులేతేర నడికిరేయైన పెట్టవలయు భోజ్యంబు లింట నవ్వారిగాగ.

ఇక రెండవవాడన్ననో—

"ప్రాసగు విత్తువంటి నెఱపారుకొలంబున బుట్టి వేదముల్ వోసినగాదె, శాస్త్రములు పుట్టిన యిల్లు, కళాకలాపముల్ డాసిన రచ్చ" యంచు నఖిలంబు దనన్ గొనియాడ నొప్పు నుద్భాసితభాసితద్యుతి సభాపతి.

అతులనిష్ఠ నింగివేల్పుల నేలకు, నేలవేల్పు కొలము నింగికి దెచ్చుచు కొలువ, సత్కృపాభ్యుదయమహిమ నుదయించినవాడు.

వనితామానస సూనసాయకుడు. జీవత్తాతపాదుడు. భూజన సన్మాన్య విశుద్ధవర్తనుడు. ఉదంచతా చంద్రుని పెన్నుద్ది సమగ్రకాంతి మహిమన్. నూనూగుమీసాల లేగొనబున్ బ్రాయపు తేజుకూన. అత డుత్కొంచుండు వాచాలతన్. ఇవ్విధముగ ననూచానసంతతి నవతరిల్లి సకలనిగమశిఖారహస్యముల్ గనినవాడు.

ద్వైవిధముగ అన్వయసౌందర్యవైదగ్ధ్య గౌరవ త్యాగములయందు ఒకరికొకరు తీసిపోవువారు కారు. ఇరువురు జీవత్రాతపాదులు. సంసారభారమునకు కుందని భుజాస్కంధులే. కాని అతని ఆచరణకు, ఇతని నడవడికి నించుకేని సాటిలేదు.

అతడు, నిచ్చలు వరుణాతరంగిణీ దరవికస్వర నూతన కమలకషాయగంధము వహించి ప్రత్యూషపవనాంకురములు పైకొను వేళ వామనస్తుతిపరత్వమున లేచి, సచ్ఛాత్రుడగుచు నాపగ కేగి, యర్ఘ్యోట నఘమర్షణస్నాన మాచరించి, సాంధ్యకృత్యము తీర్చి, సావిత్రి జపియించి, సైకతస్థలి కర్మసాక్షి కెరగి, ఫలసమిత్కుశ కుసుమాదిబహుపదార్థతతియు నుదికిన మడుగుదోవతుల గొంచు బ్రహ్మచారులు వెంటరా ప్రజ దన్ను మెచ్చిచూడ నింటి కేతెంచును.

దినము తీర్థసందర్శనాభిలాష ఆత్మ నుప్పొంగ నత్తరుణాగ్నిహోత్రి, తీర్థ సంవాసు లేతెంచినారని విన్న నెదురుగా నేగు దవ్వొంతయైన. ఏగి తత్పదముల కెరగి ఇంటికి దెచ్చును. తెచ్చి సద్భక్తి నాతిథ్య మిచ్చును. ఇచ్చి మృష్టాన్న సంతృప్తులగా జేయును. చేసి కూర్చున్నచో చేరవచ్చును. వచ్చి యిద్దర గల్గు వనథిపర్వతసరిత్తీర్థ మాహాత్మ్యముల్ దెలియనడుగును. అడిగి యోజనపరిమాణ మరయును. అరసి చూడబోవలయుననుచు నూర్పులు నిగుడ్చును

నిగమశర్మ యన్ననో—

“తలగడు గంగిమర్దనము
ధౌతపటావరణంబు సంస్కృతో
జ్జ్వలకలమాన్న భోజనము
చందనచర్చ ప్రసూనదామకం
బులు కపురంపువిడ్యమును
భూషణపంక్తులు గల్గి నిచ్చలుం
బులుగడుగంగబడ్డనును
ముత్యముబోలుచు వాలుచుం బురిం”

కలదులేదను వాదముల కోర్చి మీనుమీసము కంటి యొంటిదంజము మెరయగ, బహుసంకుమదపంక పాణింధమంబైన తాళిగోణపు గొంగు నేలజీర, కడలేని విడ్యంపుకప్పు చందురుకావిమోవిపల్లొత్తుల ముసుగు దన్న, సానతాకులు గల్గు సూనాస్త్రు శంఖంబు గతి నఖరేఖాంకగళము తనర, సఖులు పరిహాసకులు వెంట జనగ యువతిభుక్త నిర్ముక్త పరిధానయుక్తుడగుచు, నౌరపుగజీవియాజాతిమాత్రోపజీవి నగరఘంటాపథంబుల నగుచు దిరుగు.

ప్రవరుని యాచార మెక్కడ, నిగమశర్మ వయ్యార మెక్కడ! వరణాతరంగిణీ శీతలజలంబుల నఘమర్షణ స్నానమునకు, అంగమర్దనముతోడి వేన్నీళ్ల యభ్యంజనమునకు సంబంధ మెయ్యది? సాంధ్యకృత్యములు, సావిత్రీజపములు, సూర్యనమస్కారములు సంకుమదపంకమునకు, కపురంపు విడ్యమునకు, భూషణపంక్తులకు సాటి యగునే? ఫలసమిత్కుశకుసుమములు, మడుగుధోవతులు ధరించి బ్రహ్మచారులు వెంటరా నింటికి పంచమహాయజ్ఞములకునై ప్రయాణమునకు, సఖులు, పరిహాసకులు వెంటరా యువతిభుక్త పరిధానయుక్తుడై నగరఘంటాపథంబున నగుచు దిరుగుటకు పొత్తు పొసంగునే?

ప్రవరుడును సాధారణమైన యందగాడుకాడు. నేరచేటి యసల్ దెచ్చి నీరజాప్తు సానబట్టిన రాపాడి చల్లి మెదిపి పదనుసుధ నిడి చేసినట్లున్నాడు. లేకున్న అట్టి మేనికాంతి గలుగునే?

వదనప్రభూతలావణ్యాంబుసంభూత కమలంబులన వాని కన్ను లమరు. నిక్కి వీనులతోడ నెక్కసక్కెములాడు కరణి నున్నవి వాని ఘనభుజములు. సంకల్పసంభవాస్థాన పీఠికవోలె వెడదయై కనుపట్టు వాని యురము. ప్రతిఘటించు చిగుళ్లపై నెఱ్రవారిన రీతి నున్నవి వాని మృదుపదములు. పెక్కేల? వాని యనుకృతియు త్రిజగన్మోహనము. కాని వాని చక్కదనము వైరాగ్యమున జేసి కొంతుసేయు జారకామినులకు పూచిన సంపంగిపొలుపు మధుకరాంగనలకు బోలె భోగబాహ్యమయ్యెను.

కనుకనే—

చిన్ని వెన్నెలకందు వెన్నుదన్ని సుధాబ్ధి బొడమిన చెలువ తోబుట్టు గలిగి, రహివుట్ట జంత్రగాత్రముల రాల్ గరగించు విమలగాంధర్వంబు విద్య గలిగి, ననవిల్తు శాస్త్రంపు మినుకు లావర్తించు పని వెన్నతోడ బెట్టినది గల్గి, హయమేధ రాజసూయము లనఁ బేర్వడ్డ సవనతంత్రంబు లుంకువలు గలిగి, కనకనగ సీమ కల్పవృక్షముల నీడ బచ్చరాచట్టుగమి రచ్చపట్టు గలిగి, పద్మసంభవ వైకుంఠభర్గసభలు సాముగరిడీలు గలిగి, ఘృతాచీ తిలోత్తమాహరిణీహేమారంభాశశిరేఖలకు ప్రాణసఖియైన వరూథిని,

బహురత్నద్యుతి మేదురోదరదరీ భాగంబులన్ బొల్చు నమ్మిహికాహార్యమునన్ నభోవాహినీలహరీ శీతలగంధవాహపరిఖేలన్మంజరీ సౌరభ గ్రహణోంగిందిర తుందిలంబులగు తత్కాంతార మధ్యంబున,

ఇమ్మన్మథ మన్మథుండగు తన్ను చూచి, ఝుళంఝుళత్కటక సూచిత వేగపదారవిందయై లేచి, కుచంబులున్ తురుము లేనడు మల్లలనాడ, అయ్యెడన్ బూచిన యొక్క పోకనును బోదియ జేరి, విలోకనప్రభావీచికలన్ తదీయ పదవీకలశాంబుధి వెల్లి గొల్పుచున్, తనంత దా వలచి,

"నిక్కము దాపనేల ధర
జీవరనందన! యింక నీపయిన్
జిక్కె మనంబు నాకు, నను
జిత్తజుబారికి నప్పగించెదో?
చొక్కి మరందమద్యముల
చూరల బారలువారు తేంట్లు
సొం పెక్కినయట్టి పూవుబోద
రిండ్లను కౌగిట నాదరించెదో?"

అని ప్రశ్నించి, "ఆనందో బ్రహ్మ" యటన్న ప్రాజ్ఞుడవు "ఎందే డెందము కందళించు రహిచే నేకాగ్రతన్ నిర్వృతిన్ జెందున్ కుంభగత ప్రదీపకళికాశ్రీ దోప, ఎందెందు బోకెందే నింద్రియముల్ సుఖంబు గను నా యింపే పరబ్రహ్మము" అను వ్యాఖ్యాసహితముగ దెల్పి,

అంతన్ బోక, వెతలన్ బెట్టకు మింక నన్ననుచు, నీవీబంధ మూడన్, రయోద్ధతి నూర్పుల్ నిగుడన్, వడిన్ విరులు చిందన్, కొప్పు వీడన్, తనూలత తోడ్తో పులకింపగా, అనునయాలాపాతిదీనాస్యయై రతి సంరంభము మీర,

ప్రాంచద్భూషణ బాహుమూలరుచితో పాలిండ్లు పొంగార, పైయంచుల్ మోవగ కౌగలించి, అధరం బాసింప,

"హా! శ్రీ హరి!!" అంచున్ బ్రాహ్మణుడొరమోమిడి, త దీ యాం స ద్వ యం బంటి పొమ్మంచున్ ద్రోచెను. త్రోచుటయగాదు —

అయ్యచ్చరసుబ్బెత "పాటున కింతు లోర్తురె? కృపారహితాత్మక! నీవు త్రోయ, ఇచ్చోట భవన్నఖాంకురము సోకె. కనుంగొను" మనుచు "పవనపర్ణాంబు భక్షులై అవసి ఇనుపకచ్చడాల్ గట్టుకొను మునిముచ్చులెల్ల తామరసనేత్రలిండ్ల బందాలుగారె" అని పురాణపురుషుల యుదాహృతుల నిచ్చి, "వారికంటెను నీమహత్వంబు ఘనమె" అని దూరి, కలస్వనంబుతో వేదనసెపం బిడి యేడ్చి, ఎన్ని నర్మగర్భోక్తులం నక్కటక్కులు వింతనయగారములు బహు నాటకములు ప్రదర్శించినను, అస్ఖలితమానసుండై, ఆమె తన్నంటినందుకు ప్రాయశ్చిత్తముగ అవ్వనజగంధి మేనిజవ్వాజి పస గదంబించు నొడలు గడిగికొని వార్చెనట.

కలంచునే సతుల మాయల్ ధీరచిత్తంబులన్! ఔ నెట్టి ధైర్యము!! ఎట్టి నిగ్రహము!!! సాటిలేని మేటి యాదర్శవ్యక్తి.

"తదవధికుశలీ పురాణశాస్త్ర
స్మృతిశతచారు విచారజో వివేకః
యదవధి నపదం దధాతి చిత్తే
హరిణకిశోరదృశో ర్దృశో ర్విలాసః."

అను అనుభవసిద్ధాంతమున కపవాద మీపూరుషుడు. సారంగధరు డొండొకరుండుండనోపుగాని అతడింకను అనాస్వాదిత విషయసుఖుడు. శైశవ

క్రీడాపరాయణుడు. "తేజవరాలు చెక్కిగిటిన వసవల్చు బాలకుడు డెందమునన్ కలగంగ నేర్చునే?" అది యటుండుగాక.

"జ్ఞాతాస్వాదో వివృతజఘనాం కో విహాతుం సమర్థః" అని కాళిదాసుని సవాలు. దానికి సమాధానముగా శాణోపలనిఘృష్టభర్మశలాకనా నొప్పు ప్రవరుని నిర్మించినా డాంధ్రకవితాపితామహుడు. ఔనా పెద్దనా, నీవు పెద్దన్నవే. నీకును, నీ ప్రవరునికిని జోహారులివే.

నిగమశర్మ యందమా—మనసు తార్తీయ పురుషార్థమునకె తార్చినవాడు.

ఉష్ణాని హోమాగ్ని నూదనొల్లడు గాని, విరహజ్వరార్తుడై వెచ్చనూర్చును. సంధ్యకు ప్రార్థనాంజలి ఘటింపడుగాని, ఎరగు నీర్ష్యాకషాయితల కర్థి. ఆగమవాదంబు తొ గాదనడుగాని, విటవాదములు తీర్చు వేగి లేచి. కంబుభృత్పాదోదకంబు గ్రోలడుగాని, యకావతాధరసీధు వాని చొక్కు. పుణ్యచిహ్నంబులపఘనంబుల ఘటింప సిగ్గుపడుగాని, కరనఖశిఖరలిఖిత జాతనూతనక్షతాంకముల్ సమ్మతించును.

ఇవ్విధమున వైదికాచారదూరప్రవర్తనముల దుర్వ్యవహారహారియై, గడిదేరి, గురుజనము శిక్షింపగా సడిక్రోరిచి, గడుసువడి, వంకరపరకచాటును మాని, తాతముత్తాత తండ్రులు చీమవలె గూడబెట్టి యార్జితముసేసిన విత్తమును వీసరవోవజేసెను. విత్తమెల్ల వెచ్చించినపిదప—

దినవెచ్చమునకునై తన మేనగల సొమ్ము కొదుకక బచ్చింట కుదువవైచు. ఇందు గీచిన రీతి ఇంచుకించుక చేరి గిలుపాడు తల్లిపైగల పసిండి. తండ్రికి నిడ్డ పత్రములు దొంగిలిపోయి, పోయినంతకు నమ్మ పొరయు విత్తము. మిండవడ్డికి నోర్చి, మృత్యురూపములైన సాహులచే ఋణగ్రాహియగును. భూములన్నింటెని జనవరుల కమ్మజూపును. భూపాలుడీవచ్చినన్ సాలగ్రామమునైన నైకొని ప్రవరుడు గాడి [illegible] పొంగుపట్టుల నప్పులు పొడిచి పొడిచి, దొరతనంబున చుట్టాల దరిసి తిరిసి, నలగి, తన చెలులిండ్లయం దదవుద్రావుడు త్రావుచు, ఇంటి కెన్నడున్ జనకయుండెను.

ఇట్టి వెలిచవులు మరగినవానికి,

"భిక్షో మాంసనిషేవణం కిముచితం?
కిం తేన మద్యం వినా?
మద్యంచాపి తవ ప్రియం? ప్రియమహో
వారాంగనాభిస్సహ
వారస్త్రీరతయే కుతస్తవ ధనం?
ద్యూతేన చౌర్యేణవా
చౌర్యద్యూత పరిగ్రహోస్తి భవతో?
భ్రష్టస్య కావా గతిః"

అని అన్నట్టు మిగిలిన వ్యసనములు అలవ:కుండునా?

ఇతడును అనృత దురోదర చౌర్యార్జితంబులగు విత్తములను చెనటిపిపాళివెచ్చముల జేర్చుచు తొల్లింటి వైభవంబు లడగ, మితిగడచిన ఋణదాతలు వెతవెట్టగ, నూరు చొరక, వెలిదిరుగుచు, వలువకు కూటికి నీచుల వేడన్ బోడచొరవ చొచ్చుచు, కొడెల్ల కలకల నవ్వ, పూవు లమ్మిన యంగళ్లనె కట్టెలు మోసెను.

ఒకనాడు దుశ్శీలరతుని యక్కయోర్తు ఆ శుంఠనిన్ గెరలి పలికి, అలుక మగిడించి, నయంబు ప్రియంబున నాదరించి బుద్ధులు గరపిన—

రాజాలయమునకు రాకపోకలు సేయు. మాసిన చదువులు మరల సదువు. ఇన్నాళ్ళ నెచ్చెలు లెదురైన తలవంచు. కులవధూరత్నంబు కుస్తరించు. ఆచార్యజనము ప్రత్యహము సంభావించు. అర్హావళికి నుపహార మిచ్చు. అర్చించు కుతపవేళాగతాతిథికోటి. పసిసేదు. దర్శించు వైరుపచ్చ. తండ్రియుద్ధమనీయంబు తాన యుదుకు. అత్తికాభర్తతో నవ్వ

నల్పసరణి. గ్రామకార్యంబు దీర్చ నంగడికి వచ్చి. కాని—

“పుడుతావచ్చినబుద్ధి పూరిమేసినాపోదు;
చెప్పినబుద్ధి, కట్టిన సద్ది ఎన్నాళ్లుండును!”

చాలదినములనుండి మైలబడిన బదుగుగావున, తేనెబూసిన కత్తి యాధాత్రీసురుం డన్నపానకాంక్షచే అక్కసద్బుద్ధి నాదరించినట్లు చూపట్టెను. కాని సైజ మెట్లు దాగును?

ఒకనాడు రాత్రి లు, అత్తికామం డనములు, నిజయువతిదాల్చు సొమ్ములు నన్నియు హరించి, యొక్కరుడ పేరడవిత్రోవ నూడని బారెను. పారి చోరులచే కొల్లగొట్టబడి, ఆయుర్మహిమచే నొక కాపుసేవల స్వస్థుడయ్యెను

అంత అచ్చరతేమగాదు—ఆ కాపు వికారపు కోడలు తనపై మరులు వెల్లడింప, మతి బాపమనక, ప్రాణచ్యుతికరమనక, కృతఘ్నుండై ఎడరుసూచి యా పెను లేవదీసికొనిపోయి యాపాపజాతి, ఎన్ని జన్మంబులేనియు జన్నపిదపగాని ప్రాపింపరాని ధరానిలింప జాతి గడెలోనదొరగి, యానాతిం గూడి, కల్లు పెల్లాని, పొత్తున సామిదప్తాన్నకబళంపు చవులు గుడిచి, ఆకె పరలోకంబు ప్రాప్తించుడు, అంతట బోక, పరమ పావనవంశము వీటబుచ్చి ఒక్క ప్లవంగ పల్లవపాణిం గూడి, యాయమ నిల్లనిరూపు విద్యుల్లతికాధికాభినయధూర్వహమాట యెరుంగక చొక్కి భ్రష్టుండై నష్టుండయ్యెను.

విధి యట్టిద గదా?

వాతాంబుపర్ణాశనాః
తేపి స్త్రీముఖపంకజం సులలితం
దృష్ట్వైవ మోహం గతాః
శాల్యన్నం సఘృతం పయోదధియుతం
యే భుంజతే మానవాః
తేషా మింద్రియనిగ్రహో యదిభవేత్
వింధ్యః ప్లవే త్సాగరే”

అని యనుభవసిద్ధాంతము. “బలవా నింద్రియ గ్రామో విద్వాంసమపి కర్షతి.” దీనికి “కర్షతి కర్షతి కర్షత్యేవ” అని వివరణము.

ఇంద్రియలోలులైనవారికి ప్రతిబింబముగ రామకృష్ణకవి నిగమశర్మను నిర్మించినాడు. కావ్యము ప్రపంచమునకు ప్రతిబింబముగదా. మంచి చేతి మెలకువ గల చిత్రకారుని పగిది మొక్కవోని కౌశలంబున నిగమశర్మను తీర్చి అట్టి పాపిని పునీతుని చేసిన కీర్తి యా నృసింహమూర్తికి తార్చి మంచి నీతిని మనకు కూర్చినాడు.

ప్రవరుని పాత్ర లోకమున కాదర్శము; నిగమ పాత్ర ప్రతిబింబము. ఇరువురు కవివరులును తమ దృక్పథముల మేరకు అనన్యసామాన్య కవితాకౌశలము ప్రదర్శించి, తమ కీర్తిని చిరస్థాయిగా నొనర్చి, మనల ననుగ్రహించినారు.

# చైత్రపూర్ణిమ



కథకుడు :

**'అమరేంద్ర'**

అది వాళ్ల జీవితంలో తొలివసంతం. శివరావుకు సృష్టి అంతా ఒక్క గిరిజాకుమారికోసమే అనిపిస్తోంది. ఈ ప్రపంచంలోని అందానికీ, యౌవనానికీ, లాలిత్యానికీ గిరిజయే మూర్తీభావ మనుకుంటున్నాడు. అప్పటికి గిరిజచూపులకుకూడా సృష్టికంతకూ శివరావే కేంద్రమయినట్లూ, అతనికంటే కోరదగిన దేదీ ప్రపంచంలో లేనట్లూ కనిపిస్తోంది. అతని దృష్టిలో గిరిజాకుమారి ఏకైకమైన ఆదర్శసుందరి. ఆమెదృష్టిలో శివరావు ఏకైకమైన ఆదర్శపురుషుడు. వారి కింకో ప్రపంచమే లేదు. తమరిద్దరే ఈ అనంతమైన సృష్టిలో రెక్కలుకట్టుకుని రివ్వన ఎగిరిపోతున్నట్లూ, తమ ఇరువురికోసమే ఈ వసంతం, ఈ పువ్వులు, ఈ తుమ్మెదలు, ఈ కోకిలలు—తమ ఇరువురికోసమే లోకంలో సుఖమూ, సౌందర్యమూ రాసులు పేరుకొనివున్నట్లూ !

వాళ్లిద్దరూ ఒకరికోసం ఒకరు నిరాశతో ఊస్సులు విడిచే ప్రేమికులు కారు. విధి వారిరువురినీ భార్యాభర్తలుగా కళ్యాణమంటపంలో నిలబెట్టి ఇప్పటికి ఏడాది అయింది. అంతకుమునుపు ఒకరిమీద ఒకరి కెంత మక్కువవున్నా, గౌరవమున్నా పెళ్లి వాటన్నిటికీ ఫుల్‌స్టాప్ పెడుతుందని చాలామంది అంటారు. గిరిజను ఏరి కోరి శివరావు పెళ్లాడాడు. పెళ్లి అయినదగ్గరనుంచీ ఆమెమీద గౌరవం ఎక్కువయింది. తన సుఖదుఃఖాల్లో తోడునీడగా నిలిచే సహచరిగా గిరిజాకుమారి లభించటం అతని అదృష్టమని భావిస్తున్నాడు. గిరిజకుకూడా శివరావువంటివాడు భర్తఅయే అదృష్టం తనకే దక్కిందని లోలోపల కొంత గర్వం లేకపోలేదు. కాని ఆమె శివరావులాగా ఆ సంగతిని గురించి ఎవరిముందరా ఉపన్యాసాలీయలేదు.

గిరిజ కాపురానికి వచ్చి నాలుగునెలలే అయింది. ఈపాటికి శివరావుకు ఆమెమీ దున్న గౌరవం ఇగిరిపోవలసిందే. కాని కలిసినతరువాత గిరిజలో దాగివున్న గొప్పగుణాలన్నీ ఒక్కొక్కటే శివరావును ముగ్ధుణ్ని చేయసాగినయ్. ఇంతవరకూ గిరిజమీద అతని అభిప్రాయాలకు ఆధారంలేదు. ఆమెగొప్పతనమంతా అతని ఊహల్లో పుట్టి పెరిగింది. కాని క్రమంగా తెలుసుకోగలిగాడు తన ఊహల కందని సద్గుణాలు గిరిజలో దాగివున్నవని.

అది చైత్రపూర్ణిమ. వెన్నెల వేయిరేకులూ విప్పిన తెల్లని పద్మంలాగా ఆకసమంతా అలుము

కున్నది. ఆ వెన్నెల ధగధగలో ఏదో చెప్పలేని చల్లదనమున్నది. మల్లెపూలు జడలోంచి తీసి దండలు మంచులో వేస్తూ గిరిజ వెన్నెలచలువలో విప్పారిన ముఖంతో పచార్లుచేస్తోంది. ఆ వెన్నెట్లో ఆమెవన్నె కళ్లు మిరుమిట్లు గొలుపుతున్నది. విశాలమైన ఆమె నుదుట కుంకుమరేక అంత అందమైన ముఖాన్ని అలంకరించానన్న గర్వంతో తళుక్కుమన్నది. ఆమె సుకుమారమైన శరీరం నొచ్చుతుందేమోనని కట్టుకున్న నల్ల జరీచీరె సంకోచపడుతున్నది. ఆమె మౌనంగా అటూ ఇటూ పచార్లుచేస్తోంది. లక్షల నక్షత్రాలతో అలంకరించుకున్న విభావరికి, ఆ శ్రేష్ఠ అలంకారాలు లేకపోయినా ఇంత అందంగావున్న గిరిజాకుమారిని చూడగానే అసూయతో కన్నుకుట్టింది.

గిరిజ మేడమీదికి రావటం శివరావు గమనించాడు. అప్పటి కేదో పద్యాలపుస్తకం చదువుతూ ఆమెను పలకరించలేదు. గిరిజకూడా అతన్ని పలకరించకుండా దూరంగా మసకగా కనిపిస్తున్న చెట్ల గుబుర్లకేసీ, దగ్గరేవున్న చెరువులో వికసించిన తెల్ల కలువలకేసీ చూస్తూ గోడకానుకుని నిలబడింది. కొంతసేపయినాక చదువు ఆపివేసి శివరావు కుర్చీలోంచి లేచివచ్చి గిరిజప్రక్కనే నిలబడి "ఏమిటి అంత తీవ్రంగా ఆలోచిస్తున్నావు గిరిజా?" అన్నాడు.

"ఆఁ, ఏమీ లేదు" అని తీయని స్వరంతో మారుపలికింది.

"గిరిజా, నా అంత అదృష్టవంతుడూ, నాకంటె దురదృష్టవంతుడూ ఈ లోకంలో మరొకడు లేడు."

"అదేమిటి, వింత ధోరణిలో మాట్లాడుతున్నారు?"

"నా అదృష్టానికి కారణం చెప్పమంటావా?" అని గిరిజముఖంలోకి తొంగిచూచాడు. ఆమెముఖంలోనూ, కళ్లలోనూ లేతసిగ్గు తెరలుతెరలుగా ఆవరించింది. ఆమె తలవంచుకున్నది. శివరావు "గిరిజవంటి ఇల్లాలు దొరకటం గొప్ప అదృష్టం. ఈ అదృష్టం మరి ఎవ్వరి కున్నది? ఇక నా దురదృష్టానికి కారణమడుగుతావా? మా తాతగారు పల్లకిలెక్కి పాదంకిందమోపి ఎరుగని జమీందారు. మా నాన్న

ట ట ప్ప

గని విలాసపురుషుడు. నేనో, కుటుంబాన్ని పోషించుకోవటంకోసం పొట్ట చేతపుచ్చుకొని లోకంలో చెమట ఓడ్చవలసిన నిర్భాగ్యుణ్ణి. అయినా గిరిజా, నీవంటి ఇల్లాలు నా నిర్భాగ్యంలో సగభాగం భరించేందుకు నిలబడిఉన్నప్పుడు ఇక నాకేం భయం? ఎంతకష్టం వచ్చినా చిరునవ్వుతో ఎదుర్కొంటాను" అని ఒక్కగుక్కలో అన్నాడు. అతను ఎంత మనస్ఫూర్తియైన మాటలు చెప్పినా అవన్నీ ఏదో పుస్తకంలోంచి అప్పజెప్పుతున్నట్లుంటుంది. ఆసంగతి గిరిజకు తెలుసు. అతను మనసారా నమ్మితేగాని మాట్లాడ డన్న విషయంకూడా ఆమెకు తెలుసు. భర్తకు ఏమి సమాధానం చెప్పాలో తెలియటంలేదు. "నేను హిందూవనితను. మీ ధర్మపత్నిని" అని ఎంతో ఒయ్యారంగా బదులు చెప్పింది. అది విని శివరావు ఉప్పొంగిపోయి గిరిజభుజాలను తన చేతులలో నిమురుతూ "అవును, గిరిజా, ఎంత చక్కగా చెప్పావు! నువ్వు నాధర్మపత్నివి. అంతేకాదు. నువ్విప్పుడు వీరపత్నివి కాబోతున్నావు. పద్మవ్యూహంలో చొరబడబోయే అభిమన్యుడిని సాగనంపిన ఉత్తరకంటే గొప్ప వీరపత్నివి"

తన పురుషుడు తనను కొనియాడటం విని ఏ స్త్రీ సంబరపడకుండా ఉండగలదు?

"అయితే గిరిజా, నన్ను వెళ్లమని అనుమతిస్తావా?"

"సాహసించినవారినే విజయలక్ష్మి వరిస్తుంది!"

"ఎందరు నీకు పిరికిపాలు పోసినా బెదరకూడదు గిరిజా. ఎవ రేమన్నా సరే, నువ్వు నీచేత్తో నా వీపు తట్టి 'మీ కేం భయం లేదు. సుఖంగా వెళ్లండి. శుభంగా తిరిగిరండి' అని ధైర్యంగా సాగనంపాలి. కాని—"

గిరిజకళ్లలో నీళ్లు తిరిగినయ్. శివరావు గిరిజ తలను చేతులతో నిమురుతూ—"మళ్లీ పిరికిదాని వాత్తు

న్నావా గిరిజా? నన్ను ప్రోత్సహించేవాళ్లింకెవరున్నారు చెప్పు? విధి మనిద్దర్నీ బలమైన బంధంలో బిగించింది. ఏ దేశంలో ఎక్కడ వున్నా సరే నిన్ను మరిచిపోను. యుద్ధమైపోయి ఇంటికి తిరిగివచ్చేదాకా నిన్ను తలచుకుంటూ దినాలు గడుపుతాను."

"మీనోటివాక్యాన దైవం చల్లటిచూపు చూసి మీరు సుఖంగా ఇంటికి తిరిగిరావాలనే నా ఆరాటం. అందుకోసం దినదినమూ దేవుణ్ణి పాదాలుపుచ్చుకుని వేడుకుంటాను. మిమ్మల్నొక్క వరమడుగుతున్నాను."

"తప్పకుండా అడుగు గిరిజా. అది ఎంత కష్టమైనదైనా నెరవేరుస్తాను."

"ఈ దీనురాలిని మరిచిపోకుండా వుంటారా?"

"ఎంత వెర్రిదానివి గిరిజా? నిన్ను మరిచిపోతే నన్ను నేనే మరిచిపోతాను."

శివరావు వైమానికుడుగా యుద్ధంలో చేరి ఊరు విడిచి వెళ్లేప్పుడు బంధువులంతా బావురుమన్నారు. గిరిజాకుమారి తొణుకూ బెణుకూ లేకుండా భర్త నుదుట కుంకుమ పెట్టింది. మెళ్లో మల్లెపూలదండ వేసి "సుఖంగా వెళ్లిరండి" అని సాగనంపింది. శివరావు ఎంతో నిబ్బరంగా, కనపడినంతసేపూ గిరిజకేసి తిరిగి తిరిగి చూస్తూ వెళ్లిపోయాడు. బండి కనుచూపుమేర దాటిపోగానే గిరిజ వచ్చి దేవతామందిరం తలుపులు బిగించుకుని "తండ్రీ, చల్లటిచూపు చూసి వారిని ఏ ఆపదా రాకుండా కాపాడు. నాకుంకుమ-" అని మనసులో పదేపదే అనుకుంటూంది. బైటనుంచి ఎందరు తలుపుకొట్టినా తీయలేదు. లోపలినుంచి భోరుభోరున ఏడుపు పొర్లుకొస్తోంది. "తండ్రీ, నీ చలవకంటె మాకింక దిక్కేమున్నది?" అని మాటిమాటికీ మనసులో అనుకుంటూ గిరిజ నేలమీద సాష్టాంగపడింది.

* * *

ఆరు సంవత్సరాలు ఆరు యుగాలుగా గడిచినయ్. ఎంత ఆందోళన, ఎంత ఆరాటం, ఎంత ఆశ, ఎంత దుఃఖం? పదిహేనుదినాలకోసారి శివరావు దగ్గరనుంచి కులాసాగా ఉన్నట్లు ఉత్తరం వచ్చేది. ఎక్కడ ఉన్నాడో తెలియకపోయినా ఎక్కడో ఒకచోట చల్లగా వున్నందుకు గిరిజ వెయ్యిదేవుళ్లకు మొక్కుకొనేది. మళ్లీ ఉత్తరం వచ్చేదాకా మితిలేని ఆందోళన. ఈసారి ఏమని వింటానో, ఈమారు ఎటువంటి కబురు చెవినిపడుతుందో అని మనసులో మితిలేని బాధ పడేది గిరిజ. ఉత్తరం రాగానే బరువంతా దింపినట్లయిపోయేది. అమ్మయ్యా అని నిట్టూర్పు విడిచేది. ఆ ఉత్తరం పుచ్చుకు దేవతామందిరంలో గంటల తరబడి కదలకుండా కళ్లు మూసుకుని జారగిలపడివుండేది.

ఏపనిలో వున్నాసరే విమానంమోత వినగానే గబగబా డాబామీదికి పరుగెత్తుకొచ్చి అది మబ్బుల్లో నలుసులాగా కలిసిపోయేదాకా అదేపనిగా చూస్తూ నిలబడేది.

ఎవరైనా బంధువులు వచ్చి "ఎల్లా వెళ్లనిచ్చావు గిరిజా? ఏమంత అవసరమొచ్చింది చెప్పు? నారుపోసినవాడు నీరుపోయడా?" అంటూ పలకరించేవారు. "భయమేమీ లేదు. సుఖంగా తిరిగివస్తారు" అని నిబ్బరంగా గిరిజ వాళ్లతో పైకి అనేది. ఆ సమయంలో ఆమెమనసెంత గజగజ వణికిపోతుందో, చెదరిపోతున్న ధైర్యం చిక్కబట్టుకునేందుకు మనసుతో భగవంతుని పాదాలను ఎంత గట్టిగా చుట్టివేస్తుందో ఎవరికి తెలుసు?

యుద్ధం ముగిసే సూచనలు కనపడుతున్నయ్. ఈ క్షణందాకా భర్త క్షేమంగా వున్నట్లు ఉత్తరం వస్తోంది. సంధి అయిపోయి ఇంకో అయిదారునెలలలో శివరావు ఇంటికి వచ్చేస్తాడు. ఆనాడు గిరిజ ఎటువంటి స్వాగత మిస్తుందో ఎవరు చెప్పగలరు? కాలం గడుస్తున్నకొద్దీ ఆమెమనసులో ఆశలు నక్షత్రాలకంటె విరివిగా పెరిగిపోతున్నయ్.

* * *

ఆ రోజు రానేవచ్చింది. శివరావు వస్తున్నానని టెలిగ్రాం యిచ్చాడు. గిరిజ స్టేషను దగ్గిరికే వచ్చి

తనకు స్వాగతమిస్తుందనీ, ఆరేళ్ల తరువాత మళ్లీ ఆ ముద్దు లొలికే ముఖాన్ని కళ్లారా చూసే భాగ్యం లభిస్తుందనీ, ఇంకా ఎన్నో కలలు కంటూ శివరావు రైలు దిగాడు. స్టేషను దగ్గరికి ఊరివాళ్లంతా ఎదురుగా వచ్చి పూలదండలు వేశారు. కాని గిరిజ రాలేదు. శివరావు మనసు చివుక్కుమన్నది. ఈ శుభసమయాన్ని గిరిజ ఎందుకు పాటించలేదు ? తనకు ఎదురువచ్చి కోమల బాహువులతో తన కంఠాన్ని ఎందుకు చుట్టివేయలేదు ? మనసు పరిపరివిధాల పరుగులుతీస్తోంది. ఇంటి దగ్గరనుంచి బండీ తోలుకువచ్చిన నౌకరు కాకీబట్టలలో వున్న తనను చూసి బెదురుతున్నాడు. తనకు వా పేరు గుర్తుంది. వాడు తమదగ్గర తరతరాలుగా వున్న నౌకరు. "రాముస్వామీ! ఏం మరిచిపోయావా ?" అని శివరావు పలకరించాడు.

"లేదు బాబయ్యా, మీరు చల్లగా ఇంటికి తిరిగి వచ్చారన్న సంబరంలో నానోట మాట రాటం లేదు బాబయ్యా."

"అంతా బాగున్నారా ? అమ్మగారు స్టేషనుకు వస్తానన్లేదూ ?"

"అమ్మగారి వొంట్లో బొత్తిగా బాగులేదు బాబుగారూ" అని ముఖం తిప్పివేసుకొని ఎద్దుల్ని తొందరగా అదిలించసాగాడు. వొంట్లో బాగాలేదా? ఏమి జబ్బు? గిరిజ తనను ఆహ్వానిస్తుందని ఎంతగా ఆశపడ్డాడు? ఆ సన్నాహాన్ని గురించి ఎన్ని కలలు కన్నాడు? అవన్నీ చివరకు గాలిమేడలై కూలిపోయినయ్యా?

బండి ఇంటిముందు ఆగింది. గభాలున బండీ దిగాడు శివరావు. అక్కడికైనా గిరిజ ఎదురువస్తుందేమోనన్న ఆశతో. గిరిజతల్లి ఎదురుగావచ్చింది. గిరిజ చెల్లెలు ఇందిర-పన్నెండేళ్ల పిల్ల వచ్చి బావగారి మెళ్లో పూలమాల వేసింది. "మరిచిపోయినట్లున్నావ్ బావా? అవున్లే, మేం గుర్తుంటామా" అని మరదలి సరస మాడింది. ఇంతలో అత్తగారు లోపలినుంచి కాఫీపట్టుకు వచ్చింది. కాఫీకప్పు చేత్తో పుచ్చుకున్నా డన్న మాటేకాని ఒక్కగుక్కయినా లోపలికి పోలేదు. గిరిజ ఎక్కడుంది ఇందూ?" అని అడిగాడు. ఇందిర "ముందు అక్కయ్యను చూడటానికి వీలులేదు. ఎంతో బడలికతో వచ్చావు. ముందు స్నానానికిలే. భోజనం చెయ్యి. ఆ తరువాత నిన్ను అక్కను చూడనిస్తా" నంటూ బావను చెయ్యిపుచ్చుకొని ఇంట్లోకి లాక్కుపోయింది. తనగదిలో నక్కివుందేమో గిరిజ అనుకున్నాడు. అక్కడా లేదు. తన చేతిమీదుగా పెట్టాలని వంట చేస్తోందేమో అనుకున్నాడు. అక్కడా లేదు. ఏమయిపోయింది గిరిజ? ఎక్కడదాక్కున్నది?

ఏమీ పాలుపోక శివరావు గదిలో పడకకుర్చీలో పడుకుని తాంబూలం వేసుకుంటున్నాడు. ఇంతలో ఇందిర చెయ్యి పుచ్చుకుని నెమ్మదిగా దోవ చూపిస్తూ ఎవరినో నడిపించుకువచ్చింది. ఆమనిషి వచ్చి చేతులతో శివరావుపాదాలను చుట్టేసి "ఎప్పుడు వచ్చారు?" అని అడిగింది. ఆమనిషి కళ్లలోంచి నీటి చుక్కలు శివరావుపాదాలమీద రాలినయ్. అతని వొళ్లు జలదరించింది. ఎవ రీ నిర్భాగ్యజీవి ? తన పాదాలను విడవకుండా చుట్టుకొంటోంది. ఒళ్లంతా మశూచిమచ్చలతో భయంవేస్తోంది. ముఖమంతా వికృతంగా గుంటలుపడిపోయింది. కాయలు కాసిన తెల్లటిగుడ్లు ఆ భయంకరమైన ముఖంలో కొట్టవచ్చినట్లు నిలబడివున్నయ్. ఎవ రీ కురూపి? ఎవ రీ అభాగ్యురాలు?

ఇందిర "బావా" అని పిలిచింది. "అక్క వచ్చింది ఒకసారి చూడు." అంది. శివరావు కళ్లుగట్టిగా మూసుకుని మాటాడలేదు. వొళ్లంతా గొంగళి పురుగులు పాకినట్లయిపోతోంది. ఆ చేతుల నొక్కు విదిలింపు విదిలించి అక్కడినుంచి దూరంగా పారిపోవాలనిపిస్తోంది. ఇక ఎన్నటికీ ఈముఖం కేసి చూడకుండా దూరంగా వెళ్లిపోవాలనిపించింది. గుండెలమీద వెయ్యికుంపట్లు పెట్టినట్లుంది. "పద, ఇందూ, పదమ్మా, వారు కాసేపు పడుకుంటారు. మనం పోదాం పద." ఆ స్వరం ఎంతో పరిచితంగా

అతని మనసుకు తాకింది. ఇంత అందవికారమైన రూపంలో అంత మధురమైన స్వరం ఇంకా ఎక్కడ దాగివుందో? ఈ ఒక్క స్వరాన్ని మాత్రం మిగిల్చి స్వప్నసుందరియైన ఆ గిరిజ కనబడకుండా మాయమై పోయిందా? ఆ మధురమూర్తి స్మృతిని చెరిగి పోకుండా చేసేందుకు ఈ స్వర మొక్కటి చాలుతుందా?

చెల్లెలిచేయి పుచ్చుకుని గిరిజ నోవతడువు కుంటూ గదిలోంచి వెళ్లిపోవటం శివరావు చూడలేదు. మునుపు సరోవరంలో ఠీవిగా సాగే రాజహంసలా నడిచే గిరిజ ఇప్పుడు తూలుతూ, తడువుకుంటూ అవ స్వారాలులాగా నడవటం చూస్తే అతని గుండె చెరువై పోయేది. ఆ వికృతమైన రూపం మళ్లీ కంటబడుతుం దేమోనని బెదురుతూ శివరావు కళ్లు తెరిచాడు. గది అంతా శూన్యంగా బిక్కుబిక్కుమంటోంది. అతని లోపలనుంచి పట్టరానంత దుఃఖం ఉబికివస్తోంది. ఎంత అన్యాయం చేసింది విధి? గిరిజ మరణించినా అంత దుఃఖం కలిగేది కాదు. గిరిజరూపమంతా దొంగిలించి వికృతమైన కట్టైను మిగిల్చిపోయింది. ఎందుకో తన మీద విధికి అంత కసి? ఆ కసి తనమీదనే తీర్చు కుంటే ఎంత బాగుండేది? తను యుద్ధరంగంలో ప్రాణం విడిస్తే ఇంతకంటె చక్కగా వుండేది.

ఇందు కాఫీ పట్టుకువచ్చింది. శివరావుముఖం కేసి చూసి చిన్నపిల్ల అయినప్పటికీ జాలిపడి "బావా, ఏడవబోకు. నువ్వు చల్లగా యింటికి తిరిగివచ్చావు. అదే మాకు పదివేలు!"

"అల్లా గనబోకు ఇందూ; నా కోపం వస్తోంది. ఎందుకు ఇంటికి తిరిగివచ్చానా అని విచారిస్తున్నాను. ఏ బాంబుదెబ్బకో నా ప్రాణం ఎగిరి పోతేనే ఎంతో హాయిగా వుండేది. ఇంక ఆముఖాన్ని నేను చూడలేను. ఇందూ!" అని వెక్కి వెక్కి ఏడ్వసాగాడు.

తలుపువెనకనుంచి అత్తగా రందుకొని "మీరే అంత అధైర్యపడితే ఎల్లా చెప్పండి? ఏనాటికి ఏది అనుభవమో ఏం చెప్పగలం? దాని మనస్సు ఎంత పోతోందో ఆపరమాత్ముడి కెరుక" మందలింపుతో కూడిన ఓదార్పుమాటలన్నది. శివరావుతల గిర్రున తిరిగిపోతోంది. మాటా మంతీ లేకుండా శిలలాగా పడకకుర్చీలో పడివున్నాడు.

గిరిజవికృతరూపం ఎక్కడ కంటబడుతుందో అని శివరావు తప్పించుకుని తిరుగుతున్నాడు. ఈసంగతి మొదటే గిరిజ వూహించగలిగింది. మునుపు తన రూపాన్ని చూసి ముగ్ధుడైపోయిన శివరావు ఇప్పటి తన మచ్చలముఖాన్ని చూసి మూర్ఛపోతాడనీ, తనను చూసి భయంతో కళ్లు మూసుకుంటాడనీ, ఏవగింపుతో తన ముఖం చూడకుండా దూరదూరంగా వుంటాడనీ గిరిజ ముందుగానే వూహించ గలిగింది. తనను కలుసుకోవాలని ఎంతో ఆశతో దూరదేశాల నుంచి సురక్షితంగా ఎగిరివచ్చిన శివరావుకు తన ముఖం చూపకుండా వుండాలని గిరిజ ఎంతో ప్రయత్నించింది. తన ముఖం చూడగానే అతని మనసు ఎంత బెదిరిపోయి నీరైపోతుందో ఆమెకు ముందే తెలిసింది. అందుకనే అమ్మవారు పోసినదగ్గరనుంచీ ఆమె పెదవులమీద ఒక్కటే ప్రార్థన. ఆయన రాక ముందే నన్నీ లోకంలోంచి తొలగించు భగవంతుడా అని ఒక్కవరసన పరితపించింది. శివరావుసుఖానికి తన పాడుబ్రతుకు ఎక్కడ అడ్డంవస్తుందో అని లోలోపల కుమిలిపోయింది. "ఆయన ఇంటికి క్షేమంగా రావటమే నాకు పదివేలు. నా ప్రార్థనలన్నీ ఫలించినయ్. దైవం చల్లటిచూపు చూశాడు. కాని నా కింకో ప్రార్థన మిగిలివున్నది. ఆయన యింటికి వచ్చేసరికి నన్నీ లోకంలో లేకుండా చేసి దైవం రక్షించాలి. నా కోసం ఆయన యెంత దుఃఖించినా అప్పటి దుఃఖానికీ, ఇప్పుడు అనుక్షణమూ శల్యంలాగా గుచ్చుకుంటున్న నాపాడురూపాన్ని చూసి క్షోభపడే శోకానికీ ఎంతో భేదమున్నది. నేను చచ్చిపోతే నాస్మృతి వారి కన్నీళ్లలో కలిసిపోయి వారి మనసులో కలకాలమూ నిలిచిపోయేది. ఇప్పుడో? నాతలంపే వారి మనస్సులో చిచ్చు రగిలిస్తుంది. నన్ను ఒక భూతంగా,

పిశాచంగా నాను చూచి బెదిరిపోయి దూరంగా తొలగి పోతారు. నేను ఏం తప్పుచేశాను తండ్రీ? ఎందుకు నా కీఘోరమైన శిక్ష విధించావు? నేను తెలియక నీ కేమైనా అపరాధం చేసినా, దానికి ఇంత కఠినశిక్ష విధించాలా తండ్రీ? వారి మనసును బాధపెడుతూ ఈ పాడుబ్రతుకు నా కెందుకు చెప్పూ?"

మునుపు గిరిజ కనబడకపోతే శివరావుకు క్షణం కూడా యుగంగా వుండేది. ఇప్పుడు నెలలతరబడిగా ఆమెను చూడకుండా వుండగలుగుతున్నాడు. ఒక్క ఇంటిపట్టున ఉన్నప్పటికీ ఆ భార్యాభర్తలు ఒకరి కొకరు కనబడి నెలలు గడిచింది. ఇందిర ఇంట్లో అక్కగారికి ఉపచారం చేస్తున్నది. గిరిజతల్లి కూతురుకు వచ్చిన విపత్తును తలుచుకుని కుమిలిపోతూ కాలం వెళ్లదీస్తున్నది.

వచ్చిన తరువాత యిన్నాళ్లకు శివరావు యింట్లోంచి బైటికి కదిలాడు. మునుపటి స్నేహితులందరికీ ముఖం చూపించివద్దామని బయలుదేరాడు. మొదటగా చిన్ననాటి స్నేహితుడు శ్రీధరదగ్గరికి వెళ్లాడు. శ్రీధరదీ, శివరావుదీ ఒక్కటే ప్రాణం. శ్రీధర శివరావు తనను మరచిపోయాడేమో ననుకున్నాడు ఇంత దాకా కనబడకపోవటం చూసి. శివరావుకు ఎదురుగా శ్రీధర స్టేషనుదగ్గరికి వెళ్లాడు. కాని ఆ నాడు శివరావుకు మనసు మనసులో లేదు. ఎవరినీ చూడలేదు. ఎవరినీ పలకరించలేదు. అది చూసి "అప్పుడే నన్ను మరిచిపోయాడు. కళ్లు నెత్తిమీది కెక్కినయ్" అని అతనిమీద శ్రీధరకు కోపంవచ్చింది. ఇవాళ శివరావు తనంతట తానే వచ్చి తలుపు కొట్టేసరికి శ్రీధరకు పట్టరాని సంతోషం వచ్చింది. "ఏరోయ్. ఇంకా మేం గుర్తున్నామన్నమాట." అని శ్రీధర పరిహాసం చేశాడు. శివరావు "అదేమిట్రా అన్నాయ్. నువ్వు కూడా అల్లా అంటావేం?" అని బదులుచెప్పాడు. శ్రీధర "ఉమా, ఓ ఉమా, ఏం చేస్తున్నావ్? మీ మరది వచ్చాడు. దబ్బున కాఫీ పట్టుకురా" అని కేక వేశాడు. ఉమ కాఫీ పట్టుకువచ్చింది. శివరావు ఆమెను చూసి బేజారయిపోయాడు. "ఈమె శ్రీధర భార్యేనా? ఈమెకోసమేనా అతను కులంకూడా పోగొట్టుకున్నది? ఈమెఅందాన్నేనా లోకులు వేనోళ్ల పొగుడుతూవుంటేవాళ్లు?" బెదురుతూవున్న శివరావుముందు కాఫీకప్పు పెట్టి "మరదిగారు మరచిపోయినట్లున్నారే?" అని పలకరించింది. శివరావుకు ఆమెరూపాన్ని చూడగానే గొంగళిపురుగులు పాకినట్లయింది. "ఎందుకు మరచిపోతాను వొదినా." అని నవ్వుతూ బదులుచెప్పాడు. అంతటితో ఊరుకోక "మా చెల్లెలు కులాసాగా వుందా"అని కుశల ప్రశ్న వేసింది. శివరావు తలకిందులైపోయాడు. ఏమీ తోచక అవునన్నట్లు తలవూపాడు. ఉమ వెళ్లిపోయింది యింట్లోకి. శ్రీధర అందుకుని ఒక్క గుక్కలో ఆ వూరు మకాంచితో పడ్డ అగచాట్లన్నీ చెప్పుకుపోయాడు. ప్రాణాలు గుప్పెట్లో పెట్టుకొని బతికామన్నాడు. ఆవూరిలో గిరిజకూ, ఉమకూ ఇద్దరికే మరీ ఒత్తుగా పోతపోసిందన్నాడు. గిరిజగుణగణాలను పొగడుతూ చిత్రకారుడైన శ్రీధర ఒక్కసారిగా కవి అయిపోయాడు. శివరావు యుద్ధంలో వున్నన్ని రోజులూ ఆమె చూపిన ధైర్యమూ, అతని క్షేమంకోసం ఆమెతహతహ, అతను సుఖంగా తిరిగి రావాలని ఆమె చేసిన పూజలూ అన్నీ వర్ణించి శివరావుముఖంకేసి చూశాడు. ఇవన్నీ వింటున్న శివరావుకళ్లలో నీళ్లు గిర్రున తిరిగినయ్. "మళ్లీ వస్తానన్నయ్యా" అంటూ లేచి ఇంటిదోవ పట్టాడు.

నడుస్తున్నంతసేపూ అతని మనసులో ఒక్కటే ఆలోచన. "నాప్రాణంకోసం గిరిజ యింత పరితాప పడింది. నా కష్టంలో తను భాగం పంచుకుని ధైర్యంగా నిలబడింది. ఇప్పుడామెకు కష్టం వచ్చినప్పుడు నేనేం చేస్తున్నాను? పరాయివాడిలాగా గిరిజనుచీదరించుకొని దూరదూరంగా తిరుగుతున్నాను. గిరిజ నాకోసం పడ్డ పరితాపంలో వెయ్యోవంతు నేను ఆమెకోసం పడటం లేదు. కృతజ్ఞతఅయినా చూపటంలేదు. నేను ఆపదలో చొరబడేసమయాన

ఆమె నాకు చేయూత ఇచ్చి ముందుకు పంపింది. ఇప్పుడామె అంగవైకల్యంతో అలమటిస్తున్నప్పుడు ఆదుఃఖంతో నాకేమీ పనిలేనట్లు దూరంగా తిరుగుతున్నాను. ఆనాడు గిరిజ నన్నొక వర మడిగింది. ఈదీనురాలిని ఎన్నడూ మరచిపోరుగదా? అని. ఇప్పుడు నిజంగా నేను మరిచిపోలేదా? గిరిజకు కలిగిన దుఃఖంలో లేశమైనా నేను పంచుకొన్నానా?"

ఇంటికి వచ్చాడు. వాకిట్లో అడుగుపెట్టాడు. అంతవరకూ కుర్చీలో కూర్చొని సావిట్లో గిరిజా, ఇందిరా ఏవో కబుర్లాడుకుంటున్నారు. శివరావు అడుగుల అలికిడి వినబడగానే "అరుగో. మీబావ వస్తున్నట్లున్నారు. ఇందూ, పద పద. నన్నిక్కడినుంచి తీసుకుపో. నీకు పుణ్యముంటుంది. వారికంట బడకుండా నన్ను నా గదిలోకి తీసుకుపో." అని గిరిజ చెల్లెలిని తొందర పెట్టటం వినబడింది. ఆ మాటలు శివరావుకు చురుక్కున తగిలినయ్. గిరిజ లేచి ఇందుచెయ్యి పట్టుకోబోతుండగానే శివరావు లోపలికి అడుగుపెట్టాడు. గిరిజగుండె దడదడలాడుతోంది. ఇందు తొందరతొందరగా అక్కగారిని నడిపించుకుపోబోతోంది. ఇక ఆగలేక శివరావు అన్నాడు: "కూర్చో గిరిజా, కూర్చో. నన్ను చూసి ఎందు కంత భయపడుతావు? ఇందూ! మీ అక్కకు నీవు చెప్పు నేను మునుపటి బావనేనని." గిరిజ సిగ్గుతో తలవంచుకుని నిలబడింది. ఆ క్షణంలో తనకాళ్ళ కింద నేల నోరు తెరచి తనను మింగివేస్తే ఎంత బాగుంటుంది అనిపించింది గిరిజకు. "కూర్చో అక్కా" అంటూ ఇందు చెయ్యి పుచ్చుకుని గిరిజను కుర్చీదగ్గరికి గుంజింది. "వద్దమ్మా వద్దు. నా పాడుముఖాన్నిక వారికి చూపలేను. నన్నిక్కడినుంచి తీసుకుపో." అంది గిరిజ. ఈ మాటల్లో ఎంత క్షోభ, ఎంత వేదన సలసల కాగుతున్నయ్యో శివరావుకు అవగతమయింది. తను రెండడుగులు ముందుకువేసి గిరిజచేతులు పుచ్చుకుని కూర్చోమని కుర్చీ అందించాడు. గిరిజచేతులకు శివరావుచేతులు తాకగానే గడిచిపోయిన కాలంలోని సుఖమంతా ఒక్కసారి వచ్చి పలకరించినట్లయింది. గిరిజ వణికిపోతోంది సంతోషంతో. ఆమెమనసు చూపులేని గుడ్లను బద్దలుకొట్టుకుంటూ పరిగెత్తుకువచ్చి శివరావుశరీరాన్ని ఒక్కసారి చూడాలని తహతహలాడిపోతోంది. ఆమె తనను తాను సంబాళించుకోలేక తన వేళ్లతో శివరావువొంటినంతా ఒక్కమారు నిమిరింది. ఆస్పర్శే గిరిజమనసుకు దృష్టికాబోలు! యుద్ధంలో ఎన్నోపాట్లు పడి చివరికి సుఖంగా ఇల్లుచేరిన శివరావును కళ్లారా చూసుకునే భాగ్యం లేదని కుమిలిపోతున్న ఆమెప్రాణానికి ఆస్పర్శ ఎంత ఓదార్పు నిచ్చిందో! వెంటనే గిరిజ తన్ను తాను నిందించుకుంటూ "ఛీ! ఎంత సిగ్గులేనిదాన్ని. ఈ పాడుచేతులతో మిమ్మల్ని తాకటానికి వెరవని మూర్ఖురాలిని. నన్ను క్షమించండి. నన్నిక్కడినుంచి తీసుకుపోవే, ఇందూ. వారికి నా పాడుముఖం చూపించటమే కాక నాపాపిష్టిచేతులతో వారిని తాకేనే—" అని గద్గదికంతో అరిచింది. శివరావు గిరిజను తన చేతుల్లోకి తీసుకుని నిమురుతూ "ఎందుకు గిరిజా, నిన్ను నువ్వు నిందించుకుంటావు? ఇందులో నీతప్పేముంది? నీచేతులారా చేసిం దేముంది?" అని ఓదార్చాడు. గిరిజమనసుకు ఈమాటలు పన్నీటిజల్లులాగా సోకినయ్. "నాతప్పేమీ లేకుండానే దైవం నన్నిట్లా శిక్షించాడా? ఎంత అపరాధం చేసివుండకపోతే యింత కఠినశిక్ష వేస్తాడు?" అని గిరిజ తన వేదనను వెల్లడించింది. శివరావు గిరిజచేతులు తన చేతుల్లోకి తీసుకుని "నువ్వేం తప్పుచేశావ్ గిరిజా? తప్పంతా నాదికాదూ? నన్ను యుద్ధంలోకి ధైర్యంతో సాగనంపటం నీతప్పా? నేను వెళ్లిన దగ్గరనుంచీ నాప్రాణంకోసం ఒక్క వరసన ఆందోళనపడటం నీతప్పా? నేను సుఖంగా తిరిగిరావటంకోసం పూజలుచేయటం నీతప్పా? కాదు. తప్పంతా నాదే—"

"అదేమిటి, మీతప్పేమున్నది?"

"ఔను గిరిజా, తప్పంతా నాదే. ఇంకొకరిముందు చెప్పుకోటానికి సిగ్గుపడేవాడిని. కాని నీముందు నాకు జంకులేదు. నాక్షేమంకోసం నువ్వెంత వ్యథపడ్డావో, ఎంత ఆందోళనపడ్డావో నాకు తెలుసు. కాని నే నెంత నీచుణ్ణనుకున్నావ్! ఇల్లువదలిన తరు

వాత నీక్షేమంకోసం అందులో నెయ్యోవ్యవంతైనా ఆందోళనపడలేదు. అంతే కాదు. నీ కింత ఆపద వచ్చిందని విన్నాకకూడా యిన్నాళ్లవరకూ నిన్ను చీదరించుకుంటూ దూరంగా తిరిగాను. తలుచుకుంటే నాతల నరకినట్లవుతుంది. నీకు వచ్చిన ఆపదే నాకు వస్తే ఏమయ్యేది? నువ్వు నన్ను ఈవిధంగానే చూచేదానివా? నువ్వు నేనంటే ఈమాదిరిగానే చీదరించుకునేదానివా? చెప్పు గిరిజా. అదే మీకూ మాకూ తేడా."

ఏం చెప్పాలో గిరిజకు తోచటంలేదు. శివరావుమాటలు గిరిజమనసుకు ఎంత చల్లగా తాకి ఓదార్చినవో ఆమెకు తెలుసు. ఏదో తెలియని సంతోషం ఆమెముచ్చల ముఖంమీదా, కాయలుకాసిన కళ్లల్లోనూ రెక్కలు విప్పతోంది. అది చూడగానే శివరావు మనసుకు పూర్వపు గిరిజరూపం ఒక్కసారిగా కళ్లకు కట్టింది. ఆ గిరిజ యేమైపోయింది? శివరావును పరీక్ష చేసేందుకు అపురూపసుందరియైన గిరిజయే యీ అందవికారమైన వేషంతో వచ్చిందా?

"బావా, స్నానానికి లేస్తావా?" అని ఇందిర తలుపువెనకనుంచి పిలిచింది. శివరావు లేచి బయలుదేరాడు. అతనివెనకాలేగిరిజతనంతటతానేనడచివెళ్లింది గదిబయటికి. అక్కముఖంకేసి చూసి ఇందిర పొంగిపోయింది. గిరిజకళ్లలో మును పొక విపరీతమైన వెలుగుండేది. ఇప్పుడు ఆవెలుగు ఆరిపోయింది. కళ్లలో ఆరిపోయిన ఆ కాంతి ఇప్పుడు గిరిజముఖమంతా నిండి ధగధగమన్నది. "ఇందూ, సబ్బూ తుండుగుడ్డా నా చేతి కివ్వవే" అంది గిరిజ. వాటిని అక్కగారికి అందిస్తూ ఇందిర "అక్కా, దోవజాగర్త. తూలిపోతావు" అంది. గిరిజ మారుపలకకుండా కళ్లున్నవారిమాదిరిగానే గబగబా నడిచి భర్తవెంట నీళ్లగదిలోకి వెళ్లింది. విస్తుపోతూ ఇందిర నిలబడిపోయింది.

శివరావు నిద్రలేచేసరికి ముఖంపుడకా, నీళ్లూ ఎదురుగావుండేవి. కిందికి దిగివచ్చేసరికి గదిఅంతా శుభ్రంగా కనబడేది. టేబిలుమీద గుడ్డ ముడతలు లేకుండా పరచివుండేది. ఫ్లవర్ పాట్ లో తెల్లవారేటప్పటికి దొడ్లోపూసిన రంగురంగుల పూలన్నీ తేలుతూ ఇంపుగా కనబడేవి. ఈపనులన్నీ ఎవరు చేస్తున్నారా అని ఆశ్చర్యపడేవాడు. గిరిజ చెల్లెలి చేత ఇవన్నీ చేయిస్తోందేమో ననుకున్నాడు. అప్పుడు గిరిజ చుక్కైనా తొణకకుండా కాఫీ పట్టుకొచ్చింది. శివరావు చకితుడైపోయాడు. గిరిజచేతులోంచి కప్పు అందుకొని "గిరిజా, నీకు దేవతలేమైనా దివ్యదృష్టి యిచ్చారా? చెప్పు. ఎల్లా చేస్తున్నావ్ ఈపనులన్నీ" అని అడిగాడు. గిరిజ సిగ్గుపడుతూ తల వంచుకొని "ఏమో నాకు తెలియదు." అంది.

గడచిపోయిన జీవితాన్ని తలచుకుంటూ ఆ చల్లటివెన్నెలలో శివరావు కళ్లుమూసుకుని పడుకున్నాడు. మేడమెట్లమీద ఎవరో ఎక్కివస్తున్నట్లు చప్పుడయింది. కొంతసేపటికి గిరిజ పైకిరావటం చూశాడు. ఇంత నిదానంగా, జారుడుగా వున్న మెట్లు ఎల్లా ఎక్కివచ్చిందో అని ఆశ్చర్యపోయాడు. ఇంతరాత్రిఅయినా ఇంకా ఎందుకు మేలుకొనివున్నదో, ఇప్పుడిక్కడికి ఎందుకు వచ్చిందో అనుకుంటూ ఏం చేస్తుందో చూదామని నిద్రపోతున్నవాడిలాగా కదలకుండా పడుకున్నాడు. సగం మూసి తెరుస్తున్న కళ్లతో గిరిజను చూస్తూ నివ్వెరపోయాడు. గిరిజ మెల్లగా వచ్చింది. ఒకమాటు చేతులు పైకెత్తిఆకాశంలోకి కనబడని కళ్లతో చూస్తూ దణ్ణంపెట్టింది. తరువాత శివరావుమంచంచుట్టూ మూడుమాట్లు తిరిగింది. ఎవరైనా చూస్తున్నారేమోనని అటూయిటూ చూసింది. అతడి రెండుపాదాలనూ కళ్లకద్దుకుని చేతులతో పాదధూళి తీసుకుని నుదుట బొట్టుపెట్టుకుంది. చివాలున లేచి శివరావు గిరిజచేయి పుచ్చుకొని "అమ్మదొంగా. ఇన్నాళ్లకు దొరికావూ! ఎన్నాళ్లనుంచీ చేస్తున్నా వీదొంగతనం?" అన్నాడు. గిరిజ దొరికిపోయిన దొంగలాగా బెదురుతూ, ఏమీ మాట్లాడకుండా నిలబడిపోయింది. శివరావు కూర్చోమని గిరిజను మంచంమీద కూచోపెట్టాడు. వణుకుతూ గిరిజ కూర్చున్నది. శివరావు

గిరిజతలను తన గుండెలకు చేర్చుకొని "గిరిజా, ఆనాడు నువ్వు నన్ను ఏంవరం అడిగావో గుర్తున్నదా? ఆనాడు చైత్రపూర్ణిమ. అప్పుడు వెన్నెట్లో నీకళ్లు అగాధమైన సముద్రాల్లాగా మెరిసినయ్. గిరిజా, ఇప్పుడుకూడా అదే చంద్రుడు. అదే వెన్నెల. అవే హృదయాలు మళ్లీ అదే చోట కలుసుకున్నయ్."

"కాని—" అని గిరిజ చెక్కిళ్లమీదుగా జారుతున్న కన్నీళ్ల నద్దుకుంది. శివరావు మళ్లీ చెప్పుకుపోతున్నాడు: "ఆనాడు నువ్వు నన్నడిగినదే ఈనాడు నేను నిన్నడుగుతున్నాను. అప్పుడు గిరిజ నా భార్య అవటం గొప్ప అదృష్ట మన్నాను. ఇప్పుడూ అదే మళ్లీ అంటున్నాను. ఆనాడు నా కష్టమంతా నువ్వు మోశావు. భార్యకు సహజంగా వుండే భీతిని దూరంగా తోసి నన్ను ధైర్యంగా సాగనంపావు. నేను వచ్చేదాకా నా కోసం విపరీతమైన పరితాపపడ్డావు. ఈనాడు నాకు నీ దుఃఖంలో సగభాగం యిమ్మని వేడుకుంటున్నాను. ఔను గిరిజా. మనమిద్దరం పెళ్లిపందిరిలో కలిసిననాడే మన సుఖదుఃఖాలు ఒకటిగా పెనవేసుకుపోయినయ్. అప్పటినుంచీ నాసుఖమే నీసుఖం, నీ దుఃఖమే నా దుఃఖం."

గిరిజ అందుకొని "కాని, కాలం ఆ గిరిజ నెత్తుకుపోయింది. ఆ గిరిజను దొంగిలించి ఒక వికృతమైన కట్టెను మిగిల్చిపోయింది. నన్ను తాకేటందుకు మీ రెంత రోతపడుతున్నారో. నా ముఖం చూసినప్పుడల్లా మీ మన సెంత చీదరించుకుంటోందో. అందుకే మీరు తిరిగి సుఖంగా ఇల్లు చేరకమునుపే న న్నీ లోకం నుంచి దూరంగా తీసుకుపొమ్మని దైవాన్ని ఎంతో వేడుకున్నాను. నా మొర ఆలకించక ఇక్కడే పడేసి వుంచాడు."

"గిరిజా, మొదట నేనూ అల్లాగే బాధపడ్డాను. కలకలలాడే గిరిజను చూసిన కళ్లను అమాంతంగా పొడిచివేసుకుందామనుకున్నాను. అసలు తిరిగిరాకుండా యుద్ధంలోనే ప్రాణం విడిచివుంటే ఎంత బాగుండేదో అనిపించింది. కాని మనిద్దరినీ దైవం ఎందుకు బతికించాడో. ఆయనఉద్దేశమేమిటో?"

గిరిజ "నన్నెందుకు బతికించావు తండ్రీ" అని వెక్కి వెక్కి ఏడ్వసాగింది. ఏమని ఓదార్చాలో శివరావుకు తెలియలేదు. ఎంతోసేపు ఇద్దరూ మౌనంగా కూర్చున్నారు. దూరంగా మామిడితోపులో నిద్రరాని కోకిల లొకదాని నొకటి కవ్వించుకుంటూ కూస్తున్నయ్. ఎవరో చల్లగా దీవిస్తున్నట్లుగా తెల్లని వెన్నెల అన్నిటినీ పులకింపజేస్తున్నది.

చివరికి శివరావు అందుకున్నాడు. "గిరిజా, మనం ఇంకా నాలుగుకాలాలపాటు భార్యాభర్తలుగా బ్రతకటమే ఆయనఉద్దేశం. సుఖంలోనూ, దుఃఖంలోనూ, ఎండవానల్లోనూ ఒకరినొకరం విడవరాదని ఆయనసంకల్పం."

"కాని ఈ కురూపి గిరిజతోనే బ్రతుకంతా వెళ్లదీస్తారా? అంత కఠినశిక్ష మీ కెందుకు? ఇంకెవరినైనా పెళ్లాడి సుఖపడండి. మీసుఖంకంటె నాకొక్క వలసిందేముంది? మీ ఇద్దరికీ సేవజేస్తూ దాసిగా మీ పాదాలముందు నన్ను బతకనివ్వండి."

"గిరిజా! నిజంగా నీకు కావలసింది నాసుఖమేనా?"

"ముమ్మాటికీ మీ సుఖమే"

"అయితే, నీకు పుణ్యముంటుంది. నాసుఖమే నువ్వు కోరుకునేట్లయితే ఈమాట మళ్లీ యెప్పుడూ నాముందు ఎత్తబోకు. ఎత్తనని నాచేతులో చెయ్యి వేసి చెప్పు."

వణుకుతున్న చేతిని అతని చెయ్యిమీద ఆన్చి గిరిజ అన్నది: "ఎత్తను. ఎన్నడూ ఎత్తను."

ఆమె వొంగిన ముఖంనుంచి కన్నీరు ఆచేతుల మీద చిందింది.

కొంచెంసేపయినాక మునుపటిలాగా శివరావు "గిరిజా, నాఅంత అదృష్టవంతు డింకోడులేడు." అన్నాడు. గిరిజ తలవంచుకుని "కాని మీ గిరిజ

..మరి అతను ఇదివరకే
లైఫ్‌బాయ్ అభ్యాసము
నేర్చుకున్నాడు!



ఆటవస్తువులతో ఆడుకొంటూ అతడు తన బుద్ధిని చేతిని కలిపి ఉపయోగించుట అభ్యాసము చేసుకుంటున్నాడు. అతను తన తల్లివద్ద నేర్చుకున్న లైఫ్‌బాయి అభ్యాసము అతనిని ఇప్పుడు ఆడుకుంటున్న సమయంలోకూడా కాపాడుచున్న విషయము వాని తల్లికి తెలుసును—అది వాని యింట్లోను ఆటవస్తువులలోను ఉండే "మురికివలని అపాయము" నుండి అతనిని రక్షించే లెఫ్‌బాయి సబ్బును ప్రతిదినము వాడటమే.




లైఫ్‌బాయ్ మంచి సబ్బుల్లోకే ఉత్తమమైనది
ఇది మంచి అలవాటు

L. 80-23 TL

LEVER BROTHERS (INDIA) LIMITED

లోకప్రసిద్ధిపొందిన

# పి. వి. రాజన్ అండ్ కంపెనివారి




శ్రేష్ఠమైన మదరాసు నశ్యం
R. S. సుగంధ ముక్కుపొడి.

అన్నిటిలో సాటిలేనిది.

ధర వివరములకు వ్రాయుడు.

తయారుచేయువారు :—

**పి. వి. రాజన్ & కంపెని,**

అర్కోణం, Arkonam, N. A. Dt.



# డోంగ్రేగారి

బాలామృతము

బలహీనమైన బిడ్డలకు
పుష్టియున్ను, బలమున్ను
ఆరోగ్యము నిచ్చును




మైసూరు ప్రభుత్వం పరిశ్రమ

ఎన్నటికీ తిరిగిరాకుండా మాయమై పోయిందన్న సంగతి మరచిపోయారా? ఈ కురూపి గిరిజనే మీరు గొప్ప అదృష్టంగా భావిస్తున్నారంటే అంతా నవ్వుతారు."

"ఎందుకు నవ్వుతారు, గిరిజా! నవ్వనీ. వాళ్లకేం తెలుసు? నాగిరిజను కోల్పోయానేమోనని ముందు నేను భయపడ్డాను. కాని చివరికి కనుక్కున్నాను. ఆ గిరిజ నాదగ్గరికి మరొక వేషం వేసుకువచ్చిందని తెలుసుకున్నాను. అందుకే నాఅంత అదృష్టవంతు డెవడూ లేడని మళ్లీ అంటున్నాను."

"అయితే ఈ కురూపిలో మీకు మునుపటి గిరిజ దొరుకుతుందనే ఆశ వుందా?"

"తప్పక దొరుకుతుంది. ఆగిరిజలో కొట్టుకున్న గుండే కాదా ఈగిరిజలో కొట్టుకుంటున్నది? గిరిజా, ఈరూప మొక మాయతెర. ఆతెర తీసిచూసిన వాడికి అంతటా ఒకటే అందమైన ఆత్మ వెలుగుతూ కనబడుతుంది. ఇవాళ నీలో నాకు ఆ వెలుగు దొరికింది. గిరిజా, నీలో ఇదివరకు నేను కనుగొనని అందం ఇప్పుడు కనుగొన్నాను. ఇకముందు కనుగొంటాను. నిజం. గిరిజా, నీ కురూప మొక మారువేషం. ఆ వేషంలో నిన్ను కనుక్కోగలనా, లేనా అని దైవం నన్ను పరీక్షచేశాడు. నేనే గెలుపొందాను!!" గిరిజ అతని కాళ్లను చుట్టుకుని విడవలేదు.

కొసరికొసరి కోకిల కూసింది!



# సుమిత్రాదేవి లేఖలు. ౨

## విషాదగాథ

= శ్రీ రాళ్లపల్లి గోపాలకృష్ణమాచార్యులు =

భర్త నెడఁబాసి పుట్టినింటిలో వియోగదుఃఖభార మనుభవించు కాలములో, ౧౯౪౧-వ సంవత్సరపు ఏప్రెలుమాసమున, కీ. శే. సుమిత్రాదేవి తన భర్తకు వ్రాసిన విన్నప మొకటి గతసంచికలో పాఠక మహాశయులు చదివియున్నారు. ఈ క్రింది లేఖ ౧౯౩౯-వ సంవత్సరమున నవంబరు నెలలో ఆ సువాసిని నాకు వ్రాసినది.

అన్యోన్యానురూపులగు ని తరుణదంపతులకు నిష్కారణముగా, అథవా అనవసరముగా కలిగిన వియోగక్లేశమును గాంచి పరితపించి, వారికి సామరస్యమును గల్గించు యత్నించినవారిలో నే నొకఁడను. నిరుపమానమగు పతిభక్తి కల్గి, భర్తృప్రేమకై ప్రాణము నైన ధారపోయుటకు సిద్ధముగ నున్న శీలవతి సుమిత్రాదేవి. కాని, ఆమకుఁ గల నిర్మలభక్తికి, అనాఘ్రాణాను రాగమునకు, నిష్కళంకశీలమునకు తగిన ప్రాపంచిక ఫల మామెకు లభింపలేదు. కాక, ఆ లేతవయస్సులో (పదునెనిమిదిసంవత్సరాలుమాత్రమే!) ఆమె సంపాదించియున్న రసజ్ఞత సాటిలేనిది; పూర్వజన్మవాసనాబల మనిపించునట్టిది. కాని, ఆమెకు దాంపత్యసౌఖ్యములో రసము లభించినది కాదు. ఇఁక, ఆమెభర్త యన్ననో, తరుణుఁడు; విద్యావంతుఁడు; చక్కని నియమముల నలవరచుకొన్న శీలవంతుఁడు. మఱి, ఈ వైపరీత్యమేమి అందురేమో? అదే సృష్టిలోని వైచిత్ర్యము! ఇదమిత్థమని కారణములను నిరూపించుట చాల కష్టము. పరస్పరహృదయముల నర్థము చేసుకొనఁజాలనివా రీదంపతు లనవచ్చును. ఒకవేళ, అర్థము చేసుకొనఁగల్గియుండినను, సామరస్యమును సంపాదించుకొను శక్తిని వారికి భగవంతుఁడు ప్రసాదించియుండలే దనవచ్చును.

ఏమైన నేమి?

"సా కిం న రమ్యా, సచ కిం న రంతా,
బలీయసీ కేవల మీశ్వరాజ్ఞా."

అను సుభాషితమునకు దృష్టాంత మనఁదగినది వారి దాంపత్యపు కథ. వారి జాతకములందలి గ్రహయోగము లట్టివి. అవకాశ మున్నచో, ఎప్పుడైన పాఠక మహాశయుల కాజాతకముల పరిచయ మిచ్చుకోరిక కలదు.

అది యట్లుండె. ౧౯౩౮-వ సంవత్సరమున ఈ సువాసిని ఆకస్మికముగ పతియనుగ్రహమునకు పాత్రురాలై చాలుతో నున్నప్పుడు, ఆమెహృదయము మరింత దుర్బలమై, ప్రణయతిరస్కారమున కోర్వలేక, 'హిస్టీరియా' (ఉన్మాదావస్థ)పాలయి, పెక్కుబాధ లనుభవించినది. ప్రథమసంతానమును కన్నయనంతరముకూడ పరిస్థితులు మారలేదు. ఆ మరు సంవత్సరమున (౧౯౩౯) ఒకప్పుడు కొన్ని నాళ్లు భర్తగృహమునం దుండి, ఫలము విషమించుటచే నామె మరల పుట్టినిల్లు చేరవలసివచ్చినది. తరువాత నాలుగు నెలలకు ఆమె నా కీలేఖ వ్రాయుట!

భర్తకు వ్రాయు జాబులలో తెలుఁగుపద్యముల నంత విరివిగా వ్రాసిన ఆ సీమంతిని ఈ లేఖలో ఒకటియైన తెలుఁగుపద్యము నుపయోగించలేదు.

నానా గ్రంథములనుండి సంస్కృత సుభాషితముల నెత్తి సందర్భశుద్ధితో వాడినది. ఆమెరసజ్ఞత కీలేఖ మంచి తార్కాణ.

"యాతగిరి

౨౮-౧౧-౩౮

శ్రీమాన్ పిన్నయ్యగారికి—

ప్రణామపూర్వకముగా విన్నపములు.

నేను ఈ ఊరికి జులై ౨౪-వ తేదీన వచ్చితిని. ఇటకు వచ్చునపుడు ఉరవకొండకు[౧] వచ్చిపోవలయు నని తలంచియుంటిమి. కాని, కార్యావసరమువలన వీలుపడలేదు. ఇటీవల తమ కుశలము తెలియకపోవు టచే చాల యోచనగ నున్నది. శ్రీమతి సౌ॥ అత్తగారి[౨] ఆరోగ్య మెట్లున్నది? చిరంజీవులందరు సేమమే గదా? అప్పుడప్పుడు మీ క్షేమసమాచారము తెలుపు చుండిన ఆనందింతును.

ప్రకృతము తండ్రిగా రూరలేరు. ఇటీవల కమలాపురము[౩] నుండి సమాచారమేమియు తెలియ లేదు. మీ కేమయిన తెలిసియుండిన, మీ కుమారుల యోగక్షేమము తెలుపగోరుచున్నాను. వారియొక్క ఆజ్ఞానుసారముగనే నేను ఈయూరికి వచ్చితి నని తలంచుకొనుచున్నాను. శ్రీ కృష్ణశర్మగారు[౪] అప్పు డచ్చటనే యుండిరి. వారి అభిప్రాయమును, భర్తగారి దృఢాభిప్రాయమును బట్టియే నన్ను తండ్రిగా రూరేగింపుచేసుకొనివచ్చిరి. బాగుగా జీవించి అన్నియు భుజించుచు ఆరోగ్యముగ నున్నాను.

"పాపీ చిరాయుః."

ఎంతైనను, పురుషులు స్వార్థపరులు: తమ యిచ్చవచ్చినట్లు చేయుటకు స్వతంత్రులు. ముఖ్యము-

"స్వయం ప్రజ్ఞాపరిభవో భవతీతి వినిశ్చయః."

అను నార్యోక్తిని మఱచిపోకున్నను, "నా ఇల్లు" అను నుద్దేశముతో పోయితిని. పోయినందుకు దాసి కావలసినదే. ముఖ్యము, వా సంతోషకరముగ నుండుటయే నాకు పదివేలు. నేను వారి ఇంట నుండగా, వారికి కంటినెరసువలె బాధపెట్టుచుంటిని. నన్ను పోషించు భారము నా తండ్రిదే యని వారి తలం పున్నట్టు నాకు స్పష్టమగుచున్నది. ఈ యుద్దేశము లేకయున్నచో, పలుమారు వచ్చినదారినే పంపుచుండిరా? ఎంతటి శక్తిలేనివాడైనను, తన యిల్లాలిని పోషించు భారము తనదే యని తలంచుకొని తన కడప దాటనీయడు.

"ఆత్మాహి దారా స్సర్వేషాం
దారసంగ్రహవర్తినాం."

అని తలంచుకొనును. అయితే, భర్తగారికి మాత్రము ఈ తలంపు లేకయుండుట నా దురదృష్టమని వేరుగ తెలుపవలసిన యవసరము లేదు.

"భర్తవ్యా రక్షితవ్యా చ
పత్నీహి పతినా సదా."

అను నార్యోక్తినైన అనుసరించకయుండుట కన్న వేరు దుఃఖ మేమున్నది? ఎప్పుడు పోయినను వెడలిపొమ్మనియే వెడలగొట్టుచుందురు. కాని ఒక ఆరునెలలయినను తమ యింట బెట్టుకొన్న పాపమున బోలేదు.

౧. ఈ లేఖను వ్రాసిన కాలములో వృత్తికారణమున నేను ఉరవకొండ యను గ్రామములో నుంటిని.

౨. శ్రీ. శే. సుమిత్రాదేవిభర్త నాకు వరుసలో అన్నకుమారుఁడు కావలెను. అతఁడు నన్ను పిన్నయ్య అని పిలుచుట వాడుక. ఈ సువాసినిసయితము జాబులలో నన్నట్లే సంబోధించుట. కాని, నా గృహిణిని మాత్ర మామె 'అత్త'యనియే పిలుచుచుండినది.

౩. 'కమలాపురము' ఈ సాధ్వి అత్తగారి యూరు. ప్రశంసాకాలమున నీమెతలితండ్రులు 'యాదగిరి'లో నివసించుచుండిరి. అచటనుండి వ్రాసినదే యీ లేఖ.

౪. శ్రీయుత కృష్ణశర్మ సుమిత్రాదేవిభర్త కాప్తబంధువు; కూర్చుమిత్రము; సుప్రసిద్ధకర్ణాటక గ్రంథకర్త.

"శాశ్వతోయం బ్రహ్మపథః
సద్భి రాచరిత స్సదా
య ద్భార్యాః పరిరక్షంతి
భర్తారో విబలా అపి."

అని ద్రౌపది చెప్పినట్లు, ఇది సనాతన కాలమునుండి వచ్చినదేకాని, నాకొరకు కావించినది కాదు కదా? భర్తగారు ధనికులయ్యు, ధీమంతులయ్యు ఇట్లు చేయుట చూడగా నా దురదృష్టమును సూచించునే కాని, వారిని ఒకమాట అనుటకైనను నోరాడకున్నది. మీ తనయను అవశ్యము పిలుచుకొని పొండని మామ గారికి, వచ్చినపు డంతా, కొంచెమైనను జంకక, చెప్పు టలో అర్థమేమో, ఎంత ఆలోచించినను స్ఫురించ కున్నది.

"కింత్వా మన్యత వైదేహః
పితా మే మిథిలాధిపః,
రామ! జామాతరం ప్రాప్య
స్త్రియం పురుష విగ్రహం?"

అని, ఒకమారు కాకున్నను ఒకమారు, నా జననీజనకులు తలంచుకొనుటలో అతిశయ మేము న్నది? అట్లు వారు తలంచునప్పుడు నాహృదయ మెంత పరితపించు నసునది వారి గమనమునకు రాక యున్నది. ముఖ్యము—

"కాలోహి దురతిక్రమః"

అని అనుకొనవలసినదే! ఏమి తెల్పవలెనన్నను, కల మాడకున్నది. ఈ యూరికి వచ్చిననాటినుండియు జాబువ్రాయు ప్రయత్నములోనే యున్నాను కాని ఇంకను ముగియలేదు. తండ్రిగారు కూడ వ్రాయుటకు నిరుత్సాహము జెంది మానుకొన్నట్లే కానవచ్చు చున్నది.

"నిరుత్సాహస్య దీనస్య
శోకపర్యాకులాత్మనః."

ఈ శ్లోకము తాత్కాలికముగ జ్ఞాపకము వచ్చి నట్లు కానరాలేదు.

పెద్దల కుపదేశింప సమర్థురాలను కాను. నా రోదనము అరణ్య రోదనముగా మారినది.

"జిహ్వాం క్వచి త్సందశతి స్వదంష్ట్రైః,
తద్వేదనాయాం కతమాయ కుప్యసే?"

అనురీతి, నా వేదన ఎవరిముందర మొరలిడు కొనవలయునో తెలియకున్నది.

అథవా, నా జననీజనకు లాలకించిమాత్ర మేమి చేయగలరు? ఎంతటి సిగ్గులేనిదాననైనను, తల్లితండ్రు లతో నాదుఃఖము చెప్పుకొనుటకు మనస్సు వచ్చునా? చెప్పిన నోరు కాలును; చెప్పకున్న హృదయము కాలును! ధర్మరాజు చెప్పినట్లు—

"న తథా బాధ్యతే కృష్ణే,
ప్రకృత్యా నిర్ధనో జనః,
యథా భద్ర! శ్రియం ప్రాప్య."

అనునట్లు నాగతి యైనది. ఇదే గడచిన డిశెంబ రులో సుఖముగ కాలము గడపినందువలన, ఇపు డీ పరిస్థితి దుస్సహముగా నున్నది.

"శోకశ్చ కిల కాలేన
గచ్ఛ తాహ్యపగచ్ఛతి,
మమ చాపశ్యతః కాంతాం
అహన్యహని వర్ధతే."

అని దినదినమునకు పెరుగుచునే యున్నది కాని, కొంచెమైనను సమయునట్లు కానరాలేదు.

"ప్రజ్ఞయా మానసం దుఃఖం
హన్యాత్ శారీరమౌషధైః"

అను నార్యసత్కృతిని ఎన్నిమార్లు స్మరించు కొన్నను, భరింపజాలక, బాధపడుచున్నాను.

"ఆశాహి పరమం దుఃఖం
నైరాశ్యం పరమం సుఖం."

అని తలంచి సుఖమున నుండక, "అందరాని పండున కాసించి అడుసులో దిగబడె"నన్నట్లు, ఈ యాసచే నా ఆత్మీయులకు చిచ్చుపెట్టి, నేను ను

చిచ్చులో పడి, మాడిపోవుచున్నానేకాని, కొంచె మైనను లాభములేదని నాతలంపు.

"దృశ్యమానే భవేత్ ప్రీతిః
సౌహృదం నా స్త్యపశ్యతః."

అను అనుమానము సీతామతల్లికి శ్రీరాములపై ననే కలిగినప్పుడు, నాకు మీకుమారులపై కల్గుటచో నాశ్చర్య మేమున్నది? అదియునుంగాక,

"న మే దుఃఖం ప్రియాదూరే,
న మే దుఃఖం హృతేతిచ,
ఏతదే వానుశోచామి,
వయో౽స్యా హ్యతివర్తతే."

ఈశ్లోకము భర్తగారికి జ్ఞాపకములేకపోయినను, నేనే దీనిని తలంచుకొని, కాలము వ్యర్థపుచ్చుట కిష్టములేకపోయితిని.

"ఆవలించిననోటికి అప్పళించినట్లు"
"వాక్శల్యం మనసో జరా."

అని మనస్సును ఎంతయు నొప్పించిరి. నేను తమ పదార్థమనికాని, కడకు తమ పాదరక్ష యను భావ మైనా వారికి మనస్సునకురాకుండుట చాల శోచ నీయము.

అయితే, మావారలకు సరిగా లేదని యొక నెపము చెప్పెదరు. దానికి నేను ఎన్నియోమార్లు ముఖ్యవిషయము తెల్పితి ననుకొన్నాను.

"మూల మర్థస్య సంరక్ష్య
మేష కార్యవిదాం నయః
మూలేహి సతి సిన్యంతి,
గుణా స్సర్వే ఫలోదయాః."

అని ముమ్మారు విన్నవించుకొంటిని. అయితే, మీరు నన్ను 'నీయందు తప్పులు లేవా?' అని యడుగ వచ్చును. నాయందు తప్పులు లేవని నేను అనుకొన

౫. ఈ దంపతుల వివాహము ౧౯౩౨ లో జరుగుట.

లేదు. సాధ్యమైనంత సవరించుకొన ప్రయత్నపడు చున్నాను. కాని,

"వాక్య మప్రతిరూపంతు
న చిత్రం స్త్రీషు మైథిలి."

అని రామానుజులు చెప్పిన మాట భర్తగారికి ఏందు చేతనో తలంపునకు రాకయున్నది. కుడకు, ఇంతకూడ తెల్పితిని:—

"త్వయి ప్రసన్నే మమ కిం గుణేన?
త్వ య్యప్రసన్నే మమ కిం గుణేన?
రక్తే విరక్తేచ వరే వధూనాం
నిరర్థకః కుంకుమపత్రభంగః."

ఇట్టి వెన్నియో తెలుపుకొంటిని. ఇంకను,

"నాతంత్రీ విద్యతే వీణా
నాచక్రో విద్యతే రథః
నాపతిః సుఖ మేధేత
యాస్యా దపి శతాత్మజా."

మఱియు,

"దీనోవా రాజ్యహీనోవా
యో మే భర్తా స మే గురుః
తం నిత్య మనురక్తాస్మి
యథా సూర్యం సువర్చలా."

అనియు,

"య స్త్వయా సహ స స్వర్గో
నిరయో య స్త్వయావినా
ఇతి జానన్ పరాం ప్రీతిం
గచ్ఛ రామ! మయాసహ."

అని వైదేహి చెప్పినట్లును,

నోటిమాటలాడుటకు వారి స్వగృహములో అనుకూలము లేమిచే, ఎన్నియో విషయములను లిఖిత మూలకముగ తెలిపితిని.

అదియునుగాక, సప్తవర్షములనుండి చూచు చున్న నా విషయములో వారికి ఏ భావ ముత్పన్న మైనదో, దైవ మెరుగు. ముఖ్యము, తెలుపుకొన్నను, ఊరకున్నను, ఫల మొకటియే!

"ప్రసాదో నిష్ఫలో యస్య
క్రోధశ్చాపి నిరర్థకః"

ఇకముందు పదముల వ్రాయుట కిష్టము లేక మానుకొంటిని.

* *

వారి మాటకే వత్తము.

"మితం దదాతిహి పితా
మితం భ్రాతా మితం సుతః
అమితస్యతు దాతారం
భర్తారం కా న పూజయేత్ ?"

అనుటలో సుంతయైనను వింత దోచునా ? వారి మాటప్రకారమే, వారివారిపై భక్తి లేకపోయినను, నా స్వార్థముకొరకైనను భక్తిసలుపుటలో ఆశ్చర్య మేమున్నదో, అరయజాల !

"కర్మణ్యే వాధికారస్తే
మాఫలేషు కదాచన."

అను శ్రీ కృష్ణభగవానుల ఆనతిమెయి, ఆ పరోక్షమందున్న కృష్ణులను పూజించుటకన్న ప్రత్యక్ష కృష్ణులను౬ పూజించుటయే ముఖ్యమనియు, ప్రతిఫలాపేక్షతో కూడిన ప్రేమవలన చిక్కు లనుభవించితి ననియు మీరు తెల్పిన మాట సదా జ్ఞాపకమునకు వచ్చుచున్నది. ప్రత్యక్షదైవమునే ఆరాధించినచో, ఆ భగవంతుని ఆజ్ఞయు, నాహితైషులకు ఆనందమును కలుగునని యెంచి అయిదునెలలుగా, మఱి ఇప్పుడును, అదేప్రకార మున్నానని అనుకొనుచున్నాను. భర్తగారి సేమము తెలియక చాల బాధగానున్నది. కాన, దయచేసి — ఆత్రబుద్ధినిగాన — త్వరగా తెల్పిన, ఆనందింతును.

* * *

భర్తగారి దోషము లెంచుట నా పని కాదు. కాని, వారికేమో నన్ను 'నా' అను ఇష్టము లేకపోయినా, నాకుమాత్రము నా భర్తను 'నా' 'నా' 'నా' అని ముమ్మారు అను నధికార మున్నదనుకొనుచున్నాను.

నా మనస్సులో నుండునది తెలిపివేసెదను. ఆ మీద భగవదిచ్ఛ !

భర్తగారికి ఇంతటి సహన ముండుటయే లోకములో ఇంతటి పరిహాసమునకు కారణమైనదని నా తలంపు. లోకులలోనేకాక, 'తమ పెద్దమ్మవచ్చి, నా సమక్షముననే, "చేతగాని పెద్దమ్మా !" అని సంబోధించినపుడు, నా హృదయము పరియలగుచుండెడిది. అయితే, భర్తగారి కేమాత్రమును రోషము లేకయుండుట చూచిన, ఆశ్చర్యముగ నున్నది. వీరియొక్క క్షమ ధర్మరాజుక్షమకన్నను ఒక మూరెడు హెచ్చుగనే యున్నది. అయితే ఏమి చేయవచ్చును ? నా క్రోధము, ఆత్రము నన్నెట్లు క్షీణింపజేసినవో, అట్లే వారియొక్క క్షమ వారిని బంధించుచున్నయది.

" ఏకః క్షమావతాం దోషో,
ద్వితీయో నోపపద్యతే,
య దేనం క్షమయా యుక్తం
అశక్తం మన్యతే జనః"

అని పాంచాలి చెప్పినట్లు, ఎందరో వారిని ఇట్లు అనుటచే నాకు చాల సంతాపముగ నున్నను, వారేమో సహింతురు.

"యో న దర్శయతే తేజః
పురుషః కాల ఆగతే,
సర్వభూతాని తం పార్థ
సదా పరిభవంత్యుత"

నిరంతరము సహన మున్నచో, అందరు పరిభవించుటలో వింత యేముండును? అట్లు జరుగకను పోలేదు. అయితే, మన మేమి చేయగలము? ముఖ్యము, వారికి లేనిది కల్పించుట సాధ్యమా?

'నాసతో విద్యతే భావో
నాభావో విద్యతే సతః."

౬. ఈ సుమంగలి భర్త నామ ధేయములో 'కృష్ణ'శబ్ద మున్నది.

అని ఉండనే యున్నది.

ఎంతైనను, వారి పక్షము బలిష్ఠము.

"సంహితాహి మహద్బలమ్"

అని యున్నదికదా?. "బలిష్ఠుల అధర్మము సహా ధర్మముగా మారును; దుర్బలుల ధర్మము అధర్మముగా పరిణమించును." అని భీష్మాచార్యులు చెప్పినట్లు, వారే బలిష్ఠులు; వారే ధర్మపరాయణులు. బలిష్ఠులు కాననే, భరణము పారవేసెదమని, భర్తగారి యెదుటనే, ధర్మశాస్త్రవేత్తలు, న్యాయాధికారులు అయిన—ఆచార్యులు—అమ్మ మున్నగు పండితులు సభర్తృకకు భరణము నిర్ణయము చేసుకొమ్మని ఎంతయు బాధపడిరి. దానికి అనుకూలము కాకపోవుటచే, ఇంటనే వేరుపాకము కావించుకొనునట్లు రెండవ యేర్పాటు కావించి, తమ తమ్ములు, ఇతరులు తమ యింటనే యుండునట్లును, మఱియు నాభుక్తికై బియ్యము బేడలు, ఉప్పు, చింతపండు, నూనె మాత్రమే నాకు అనుగ్రహించి అవి వండుకొని తినునట్లును, తినకున్న పారకతో కొట్టెదమనియు, ఎముకలు పుడిచేసెద మనియు, న్యాయాధికారులగు వారలు ఎంతో బెదరు పెట్టి, సంసారము కుదురుపాటు కావించినామని నా తండ్రికి తెల్పిరి. ఇన్ని సౌకర్యము లున్నను సాపాటు మానుకొన్నదని జాబుకూడ వ్రాసిరి. వీరియొక్క న్యాయమునకు భర్తగారును ఆమోదించిరి. నేను కేవలము బియ్యము, బేడలు, ఉప్పు, చింతపండు, నూనె కొరకే ఏడ్చుచున్నానని తలంచి పోరు మాన్పజూచిరి. సంసార మిట్లయినది!! ఇక సామగ్రి—అనగా, ఇత్తళివి ఒక చిన్న జోడుతపిలె, అల్యూమినియము బోగణీ, ఇంకొక చిన్నలోటా మాత్రము నాకు సంసారమునకు సామగ్రి నొసగి, రమాదేవికి మాత్రము ఎనిమిది దినముల కొక శేరు చక్కెర ఒసంగిరి. నన్ను వివాహమాడినందుకు వారి కిన్ని కష్టములు ప్రాప్తమైనవి.

మరియు, భర్తగారికి నాచేత నీరుత్రాగుటకు గూడ అనుమాన మున్నట్లును, నాచేత నేమైన తిన్నచో మందుపెట్టెదనని వారివారలకు భయమున్నట్లును ఈతూరి బహిరంగముగా స్పష్టమైనది. అందువలననే, ఒకసారి నేను పాకముచేసియుండి సాపాటుకు పిలువగా, భర్తగారు ఆనాడంతయు పస్తుండి మరుసటిదినమున అమ్మగారు చేసినచో భుజియించిరి.

ఇంతటి "మందులమారి"నయ్యు, నాభర్త నావశమున లేకయుండుట చూచినచో, మీ కంతయు ఆశ్చర్యము కొల్పవచ్చును. లేదా, భర్తగారి దృఢకాయమును మెచ్చుకొనవచ్చును!

* * *

ఈవిషయము విరమింతము. నాకు ఇవన్నియు తలచుకొన్నచో ఏమియు తోచక చాల యోచనగా నుండును. ఏమియు తోచక కర్తవ్యశూన్యురాలనై యున్నాను.

"సాధుసంగతయో లోకే
సన్మార్గస్యచ దీపికా."

అని వసిష్ఠులు చెప్పినట్లు, మీరొకరే నాకు త్రోవ చూపవలసియున్నది.

"విశ్వాస శ్చా సుఖోదయః"

అని నానుండి మీరును మనఃఖేద మనుభవించవలసివచ్చినందుకై కుందుచున్నాను.

"తప్యంతే లోకతాపేన
సాధవః ప్రాయశో జనాః."

అని సహజముగ సజ్జను లొకరి తాపమును సహించలేరు. ఇంక, మీమాట నేను చెప్పనేల? నానుండి మీరును పరితాపపడవలసివచ్చినది.

"సజ్జనోహి సముత్తార్య
విపద్భ్యో నికటస్థితం,
నియోజయతి సంపత్సు
స్వాలోకేష్వివ భాస్కరః."

నాహృదయము ఆందోళనగా నున్నది. కొంత మనశ్శాంతి కోరుచున్నాను. దయచేసి ప్రతివ్రాయవలయును.

"కార్పణ్యదోషోపహతస్వభావః
పృచ్ఛామి త్వాం ధర్మసమ్మూఢచేతాః
యచ్ఛ్రేయ స్స్యాన్నిశ్చితం బ్రూహి తన్మే
శిష్య స్తేహం శాధి మాం త్వాం ప్రపన్నం."

ఇందుమీద మీయిష్టము వచ్చినట్లు చేయవచ్చును. ఇట్లు చేయుమని చెప్పినచో అట్లు చేయుట మాత్రమే నా భారము.

నా యీ పనికిమాలినదీర్ఘలేఖను చూచుకొనవలసిన శ్రమ యిచ్చినందుకు క్షమింపుడు.

రమాదేవి, రమాదేవికృపవలన, మిక్కిలి ఆరోగ్యముగ నున్నది. శ్రీమతి సౌ. కుం. అత్తకు నాఅనంత ప్రణామములు. చి. ఇందుకు 'శ్రీరామరక్ష.'

ఇట్లు,
హతభాగ్యురాలు
సుమిత్ర."



నీడపట్టు

# పురాణములు : వాటి పరమార్థము



శ్రీ తెన్నేటి విశ్వనా

[ గతసంచిక తరువాయి ]

కొంతమంది పాశ్చాత్యులు చెప్తారు : (౧) బ్రహ్మపురాణంలో ఉత్కళదేశంలో ఉన్న జగన్నాథమాహాత్మ్యం వర్ణించియుండుటచేతనున్నూ, సర్గాదిపంచలక్షణములు లేకపోవుటచేతనున్నూ, ఉత్కళదేశంలో ఉన్న మందిరాల పేర్లు కనబడటంచేతనున్నూ ఈపురాణం ౧౩౦౦, లేక ౧౪౦౦ సం.కు పూర్వం వ్రాయబడలేదు.

(౨) పద్మపురాణంలో జైనుల వర్ణన, వైష్ణవుల చిహ్నాలు వివరింపబడియుండుటచేత పన్నెండవ శతాబ్దంలో ఈ పురాణం వ్రాయబడి ఉండాలి. ఇందులోకూడ కడపటిభాగం ౧౫, లేక ౧౬ శతాబ్దంలో వ్రాయబడియుండాలి.

(౩) విష్ణుపురాణంలో బౌద్ధజైనప్రసంగాలు ఉండడముచేతనున్నూ, కలియుగాబ్దం ౪౭౪౬ సం. వరకు రాజవంశావళులు వుండటంచేతనున్నూ ౧౦౪౫ సం.లో ఈపురాణం వ్రాయబడింది.

(౪) వాయుపురాణమే అన్నిపురాణాలకన్న ప్రాచీనమైనది; పంచలక్షణములు గలిగియున్నది.

(౫) భాగవతం బోపదేవుడు వ్రాశాడు; ౧౨-వ శతాబ్దంలో వ్రాసియుండాలి.

(౬) నారదీయపురాణంలో పురాణలక్షణాలే లేవు. ఆధునికమైన భక్తిప్రధానగ్రంథము. గోవధ నిరసన ఇందులో చాలా హెచ్చుగా ఉన్నది. ౧౬, ౧౭ శతాబ్దాల్లో సంగ్రహింపబడిఉంటుంది. బృహన్నారదీయపురాణంలో విష్ణుభక్తి హెచ్చుగా వర్ణింపబడినది. వైష్ణవుల కర్తవ్యాలు విపులంగా ఉన్నాయి. పురాణం బహు ఆధునికమయినది.

(౭) మార్కండేయపురాణం—ఇదితొమ్మిదో, పదో శతాబ్దాల్లో సంగ్రహింపబడింది.

(౮) అగ్నిపురాణంలో ఇతిహాసఛందోవ్యాకరణతాంత్రికవిషయాలు అన్నీ ఉండుటచేత ఆధునికమైనది.

(౯) భవిష్యపురాణం—ఇది భవిష్యము అనేటందుకు కారణం కనబడదు.

(౧౦) బ్రహ్మవైవర్తంలో పురాణలక్షణాలు లేవు. పురాణం అనడానికే కాదు.

(౧౧) లింగపురాణం కర్మగ్రంథమే. అనేక అంశాలు ఆధునికములే.

(౧౨) వారాహపురాణంకూడ కర్మ ప్రధానమైన గ్రంథమేను. ౧౨-వ శతాబ్దంలో ఉన్న రామానుజుని ఆభాస చాలా కనపడుతుంది.

(౧౩) స్కందపురాణంలో చాలామటుకు జగన్నాథమాహాత్మ్యం చెప్పబడిందికాబట్టి బ్రహ్మపురాణము, స్కందపురాణమున్నూ సమకాలరచనలు.

(౧౪) వామనపురాణంకూడ పురాణ మనేటందుకు లేదు. ౧౫, ౧౬ శతాబ్దాల్లోది దీని రచన.

(౧౫) మత్స్యపురాణంలో పురాణంతాలూకు అయిదు లక్షణములూ ఉన్నా, ఉపపురాణాల వర్ణనలుండుట వల్ల ఆధునికరచనయేను.

(౧౬) గరుడపురాణంలో పురాణలక్షణాలు లేవు; గరుడుని విషయంకూడా కనపడదు.

(౧౭) కూర్మపురాణంలో భైరవ, వామ, యామలతంత్ర శాస్త్రవివరాలు ఉండుటచేత అది తాంత్రిక శాస్త్రప్రతిష్ఠాపనతరువాత రచింపబడినదే; చాలా ఆధునికమైనది

(౧౮) బ్రహ్మాండపురాణము వ్యాసుడు వ్రాసినదే. వాయుపురాణం, బ్రహ్మాండపురాణం అనుబంధాలులాగ కనపడతాయి.

మీదచెప్పిన ఈ ఖండనలు నిజమేఅయితే, వైదిక గ్రంథములందు,అనగా బ్రాహ్మణాలయందున్నూ, ఉపనిషత్తులందున్నూ పేర్కొనబడిన పురాణాలు యావత్తూ లుప్తమయిపోయిఉండాలి. లేక నిరర్థకమయిఅయినా ఉండాలి. శతపథబ్రాహ్మణంలో శ్రాద్ధాదికార్యముల్లో పదోరోజున పురాణశ్రవణ చేయాలన్న మాటకు అర్థమైనా లేకుండాఉండిఉండాలి.

ఇటువంటిది అసంభవం. పురాణాల్లో ఎక్కడయినా ప్రక్షిప్తమయిన సంగతులు నిర్ధారణజేసి ఆధునికమని అనవచ్చునుగాని పురాణాలే ఆధునికములు అంటే అది సరిపడనిసంగతి. ఆపస్తంబసూత్రాల్లో—

"అథ పురాణే శ్లోకా ఉదాహరన్తి—
అష్టాశీతిసహస్రాణి యే ప్రజామీషిరర్షయః
దక్షిణేనార్యమ్ణః పన్థానం యే శ్మశానాని భేజిరే
అష్టాశీతి సహస్రాణి యే ప్రజేనోషిరర్షయః
ఉత్తరేణార్యమ్ణఃపన్థానం తే అమృతత్వంహి కల్పతే"
(౨-౨౬, 3౫)

అని ఉన్నది. దీనికి సరిగ్గా, చూడండి, బ్రహ్మాండపురాణంలో ౫౪: ౧౮౫-౧౮౬:—

"అష్టాశీతిసహస్రాణి మునీనాం గృహమేధినాం
సవితు ర్దక్షిణం మార్గం శ్రితా హ్యాచంద్రతారకం
క్రియావతాం ప్రసంఖ్యైషా యే శ్మశానాని భేజిరే
లోకసంవ్యవహారేణ భూతారంభకృతేనచ
ఇచ్ఛాద్వేషరతాచ్చైవ మైథునోపగమాచ్చవై
తథా కామకృతేనేహ సేవనా ద్విషయస్య చ
ఇత్యేతైః కారణైః సిద్ధాః శ్మశానానీహ భేజిరే
ప్రజైషిణ స్తే మునయో ద్వాపరేష్విహ జజ్ఞిరే
నాగవీథ్యుత్తరే యచ్చ సప్తర్షిభ్యశ్చ దక్షిణం
ఉత్తరః సవితుః పన్థా దేవయానస్తు స స్మృతః
యత్ర తే వశినః సిద్ధా విమలా బ్రహ్మచారిణః
సన్తతిం యే జుగుప్సంతే తస్మాత్ మృత్యుః జితస్తుతై
అష్టాశీతిసహస్రాణి తేషామపి ఊర్ధ్వరేతసాం
ఉదక్పన్థాన మర్యమ్ణః శ్రితాహ్యాభూతసంప్లవాత్
తైః కారణైః శుద్ధైః తేఽమృతత్వం హి భేజిరే
ఆభూతసంప్లవస్థాన మమృతత్వం విభావ్యతే."

అని ఉన్నది. ఆలాగుననే ౬౫ (౧౦3-౧౦౮) లో కూడ ఉన్నది. కాబట్టి ఆపస్తంబసూత్రాలనాటికి బ్రహ్మాండపురాణం ఉన్నదిగదా. విష్ణుపురాణంలో 3-౭ న్నూ మత్స్యపురాణం ౧౨౪: ౧౦౨-౧౧౦ న్నూ ఇదేమోస్తరుగా వ్రాయబడి ఉన్నవి. పద్మపురాణం సృష్టికాండలో—

"అష్టాశీతి సహస్రాణాం యతీనా మూర్ధ్వరేతసాం
స్థానం తేషాంతు తజ్ఞానం తదేవ గురువాసినాం"

ఇంకా చూడండి. భవిష్యపురాణంలోనుంచి ఆపస్తంబసూత్రకారుడు—

"ఆభూతసంప్లవా స్తే స్వర్గజితః పునః సర్గే బీజార్థభవన్తి ఇతి భవిష్యపురాణే" [౨ (౨౪) ౬; ౫;]

అని ప్రమాణం తీసికొని వ్రాశాడు. ఈ ప్రసంగమే బ్రహ్మాండపురాణంలో కూడ వ్రాయబడి ఉన్నది.

ఆపస్తంబసూత్రాలనాటికి పురాణాలు నామనిర్దిష్టమై ఉన్నా యనేది స్పష్టము. ఆపస్తంబసూత్రాల్లో పేర్కొన్న పురాణాల్లో అష్టాదశపురాణాలు పేర్లతోగూ... పద్దెనిమిదిపురా... ఉన్నట్టు నిశ్చయముగా చెప్పవచ్చును.

ఆపస్తంబసూత్రాలు పాణినికి పూర్వమనిన్నీ, క్రీ. పూ. ౫-వ శతాబ్దంనాటివనిన్నీ డాక్టరు బూలరు, మాక్సుముల్లర్, తిలక్ మొదలయిన పండితులచేత నిశ్చయింపబడి ఉన్నది.

ఇది చెప్పిన తరువాత (క్రీ. శ. ౫-౬ శతాబ్దాల్లో) భారతీయులు యవ (జావా), బాలి ద్వీపములలోకి ప్రవాసస్థులుగా వెళ్లినప్పుడు బ్రహ్మాండపురాణం, మహాభారతం, రామాయణం మొదలయిన గ్రంథములు తీసుకవెళ్లినట్లున్నూ, అవి అక్కడ ప్రచారంలో ఉండి ఆకాలంలోనే దేశభాషల్లోకిగూడ తర్జుమా అయినట్లున్నూ పండితులచే నిర్ధారణఅయిఉన్న సంగతులు అంత ముఖ్యంగా చెప్పనక్కరలేదు. అక్కడకు వెళ్లిన వానిని ఓలాంద్ర (హాలండు) భాషలోకి తర్జుమాకూడా చేశారు. ఆ తర్జుమా అయిన బ్రహ్మాండ పురాణమున్నూ, ఇప్పుడు మన దేశంలో ఉన్న బ్రహ్మాండపురాణమున్నూ ఒకటే.

స్కందపురాణం:— క్రీ. శ. ౭౦ లో నేపాలు దేశంలో శ్రీ హర్షప్రసాదుడు స్కందపురాణాంతర్గతమయిన నందికేశ్వరమాహాత్మ్యం వ్రాశాడు. స్కంద పురాణాంతర్గతమయిన కాశీఖండంలోనికథ ఎవరి చేతనో ౯౩౩లో ప్రత్యేకంగా వ్రాయబడ్డట్టు ఉన్నది. అందుచేత స్కందపురాణం ౧౪, ౧౫ శతాబ్దముల్లోవి అంటే నమ్మదగ్గ విషయంకాదు.

మార్కండేయపురాణం:—ఇందులోనుండి ౭-వ శతాబ్దంలో శంకరాచార్యులున్నూ, బాణుడున్నూ దేవీ మాహాత్మ్యమును తీసివ్రాశారు. ఆ కాలంనాటివాడే మయూరభట్టుడు సూర్యశతకం సౌరపురాణంనుండి తీసి వ్రాశాడు. విష్ణుధర్మోత్తర పురాణంనుండి విష్ణుగుప్తుడు బ్రహ్మసిద్ధాంతము వ్రాశాడు.

శ్రీ శంకరాచార్యులనాటికి పదునెనిమిది పురాణాలు ఉన్నాయని ఎప్పుడు తేలినదో, ౨౨౦౦ సంవత్సరములనుండి అవి అన్నీ ఉన్నట్టు నిర్వివాదాంశము. బాణభట్టునకుకూడ పూర్వము విష్ణుపురాణంలోను, ధర్మసూత్రాల్లోనుకూడ వీటి ప్రసంగం ఉన్నప్పుడు ఆధునికములు అని చెప్పేమాట గౌరవింపదగ్గది కాదు.

జగన్నాథ మాహాత్మ్యంఉన్నంతమాత్రానపురాణము ఆధునికం ఎట్లాగు అవుతుంది? దేవాలయం ఆధునికం కావచ్చునుగాని దేవుడు అంతకుపూర్వం లేడంటారా? అర్చనలేదంటారా? ఋగ్వేదంలో (ఋక్ పరిశిష్టంలో) "యత్ర దేవో జగన్నాథః పరం పారం మహోదధేః, బలభద్ర సుభద్రా చ తత్ర మామమృతం కృధి"..."ఆర్యావాచో మ్లేచ్ఛవాచః" కంకయవనాదులనుగురించి వర్ణన ఉన్నంత మాత్రమున ఆ గ్రంథములు ఆధునికము లనలేముగదా. భవిష్యంలో రాబోయే కలిఅవతారం వర్ణనలు ఉన్నవి కాబట్టి ఇప్పుడు అసలు పురాణాలే లేవు, కలి అవతారం తరువాత ఉద్భవిస్తాయి అని అంటారా? తంత్రశాస్త్రంలో చెప్పే హోమాలు అథర్వవేదంలో కనిపిస్తాయి; జైన బౌద్ధ విషయాలు కూడ పురాణాల్లో ఎక్కడయినా కనిపిస్తే ఇదేవిధంగా వ్రాయబడ్డాయి అని ఎందుకు అర్థంచేసుకోకూడదు? కలికాలంలో ఇటువంటి ధర్మాలు వస్తాయి అని సూచింపబడ్డాయి; అంతకన్న హెచ్చులేదే.

గుప్తవంశం మొదలయినవాటినిగురించి ఉండడంచేత ఆధునికాలు అని చెప్పడంకూడ సరియైనది కాదు; రాబోయే మన్వంతరాల వర్ణన లున్నాయి; వీటి మాట ఏమిటి?

బ్రహ్మాండపురాణంలో-

"తస్య పుత్రః శతానీకో బలవాన్ సత్యవిక్రమః
తతః సుతం శతానీకం విప్రా స్తమభిషేచయన్
పుత్రః అశ్వమేధదత్తః అభూత్ శతానీకస్య వీర్యవాన్
అధిసీమకృష్ణో ధర్మాత్మా సాంప్రతోఽయం మహాయశాః
యస్మిన్ ప్రశాసతి మహీం యుష్మాభి రిదమాహృతం
దురాపం దీర్ఘసత్రంవై త్రీణి వర్షాణి పుష్కరం
వర్ష ద్వయం కురుక్షేత్రే దృషద్వత్యాం ద్విజోత్తమాః"

అని ఉన్నది. ఒకవేళ చెప్పిన విషయాలీనాటివే అనుకుందాం. అప్పుడు ఈపురాణాలు ౮౦౦౬ సంవత్సరములక్రిందటివికదా. ఆధునిక మనడానికి వీలు లేదే? ఇవి సూతుడు చెప్పిన మాటలు; పురాణం ౬౦ ౪

పురాణాలు అప్రమాణాలు అనడానికి ఎంతమాత్రమూ వీలులేదు; బృహదారణ్యచాందోగ్యములలోనూ, ధర్మసూత్రాల్లోనూ ప్రమాణములుగా గణింపబడినవి. శంకరాచార్యులు, కుమారిలభట్టు ఆది మహనీయులుకూడ వాటి ప్రమాణం గ్రహించారు. శంకరాచార్యులు బుద్ధునితరువాత ౬౦ సంవత్సరాలతరువాత ఉండేవాడని ఏ. వి. సేంటువిద్వాంసుడు చెబుతున్నాడు.

ఏఏపురాణాలు ఏఏఉపాస్యసాంప్రదాయాలతో వేరువేరుగా వ్రాయబడ్డాయో ఆపురాణాల పేర్లనుబట్టియే ముఖ్యముగా గ్రహించగలము. ధర్మసూత్రములకు ఇంకను ముందుగనే వైదికయుగంలో ౧౮ పురాణముల పేర్లు ప్రచారంలో ఉన్నవని ఇదివరలోనే చెప్పడమైనది.

జైనమతతీర్థంకరుడైన పార్శ్వనాథుడు క్రీ. పూ. ౮౮౦ సంవత్సరమువాడని చెబుతున్నారు. బ్రహ్మ, శివ, విష్ణు మొదలయిన దేవతల ఆరాధన చేసేవారిని గురించి ఆయనప్రసంగాలలో చెప్పబడియున్నది. సరే, బుద్ధుని ప్రసంగాలలో శివ బ్రహ్మ విష్ణు నారాయణ మొదలగు దేవతల ఉపాసనలుగురించి ఆయన చెప్పినవి అందరికీ తెలిసిన విషయమే. అందుచేత ప్రత్యేక సంప్రదాయపోషణకై మునుముందునుండి ఈభిన్నభిన్నపురాణములు ప్రచారంలో ఉండే ఉండాలన్న మాట నిస్సందేహంగా తేలుతోంది.

అవతారవాదం బుద్ధుడితరువాత బయలుదేరిందని ఒక వాదం బయలుదేరింది ఒకప్పుడు. అయితే శతపథబ్రాహ్మణం ౧:౮-౧౨-౧౦ లో మత్స్యావతారముగురించి "మనవేహైవప్రాతః...మత్స్యః పాణి ఆపేదే" అని ప్రసంగము స్ఫుటముగా ఉంది.

తైత్తిరీయ ఆరణ్యకంలో ౧ (౨౩) ౩ లో "అంతరతః కూర్మభూతపర్యంతం తం అబ్రవీత్"... అని కూర్మావతారముగురించి ఉన్నది. శతపథంలో కూడ ౮ (౫) ౧ (౯) లో "సయత్ కూర్మోనామ, ఏతద్వై రూపం కృత్వా ప్రజాపతిః ప్రజా అసృజత" అని ఉన్నది.

తైత్తిరీయసంహిత ౧ (౫) ౧ లో "ఆపో వా ఇదం అగ్రే సలిల మాసీత్ తస్మిన్ ప్రజాపతిః వాయుః భూత్వా చరత్ స ఇమా మపశ్యత్ తం వరాహో భూత్వా అహరత్" అనిన్ని, "స వరాహో రూపం కృత్వా ఉపన్యమజ్జత స పృథ్వీ మధ ఆర్ఛత" అని తై. బ్రాహ్మణం ౧ (౧) ౬ లోనుకూడా ఉన్నది. ఋ. ౯ (౯౮) లో "మహివ్రతః శుచిబంధుః పావకః పదావరాహో అభ్యేతిరేభన్" అని కూడా ఉన్నది. వరాహశబ్దము చేయుచు చరించెను అని భావము. తై. ఆ. ౧౦-౧ లో నరసింహావతారము "తన్నో నారసింహః ప్రచోదయాత్" అని చెప్పబడినది. ఋ. ౧ (౪౪) ౧౪ లో "విష్ణుః విచక్రమే త్రిధా" అని ఉన్నది.

కొంతమంది పండితులు బ్రహ్మోపాసనే ప్రాచీనమైనది కాని శివుడు, విష్ణువుల ఉపాసన ప్రాచీనమైనది కాదని అంటారు. నిజమేమిటంటే, బ్రహ్మ వేదాల్లో చెప్పిన పరమదైవ మన్నమాట నిజమే. కాని సగుణరూపంగా చెప్పవలసివచ్చినప్పుడు విష్ణు మొదలగు వారిని ఉపాసననిమిత్తమై చెప్పియేయున్నారు.

అథ. ౧ (౧౫౪-౧౫౬) లో—

"విష్ణోః నుకం వీర్యాణి ప్రవోచంయః పార్థివాని విమమే రజాంసి యో అస్కభాయ దుత్తరం అధస్థం విచక్రమాణ స్త్రేధోరుగాయః. ప్రతద్విష్ణుః స్తవతే వీర్యేణ మృగోన భీమః కుచరో గిరిష్ఠః."

అంటే విష్ణువుయొక్క మహిమకు అంతులేదనిన్ని, ముల్లోకముల సృష్టి అతడే చేసేడనిన్ని, ముల్లోకములను మూడడుగులలో దాటేడనిన్ని ఇంకా అదే విధంగా చెప్పబడింది. శతపథ ౧ (౨) ౧-౪ లో కూడా స్పష్టముగా కనపడుతుంది.

ఋగ్వే. ౧ (౨) ౨౨ లో "ఇదం విష్ణుర్విచక్రమే త్రేధా నిదధే పదం" అని ఉన్నది. ఇంకా ౧ (౯౮); ౨ (౨౦); ౧ (౧౬౪); ౧ (౧౯౬) ౨ (౧) 3; ౨ (౨౨); 3 (౫౪); ౪ (౨); ౪ (3) మొదలయిన స్థలములలోగూడ విష్ణుప్రశంస ఉన్నది. సామవేదం, యజుర్వేదం, అథర్వణవేదంలోకూడ విష్ణుప్రశంస ఉన్న మంత్రాలు ఉన్నాయి.

దీని సిద్ధాంతం:-విష్ణు ఉపాస్యదేవత సనాతనం నుండీని అయిఉన్నాడనిన్నీ, అందుచేత విష్ణు ఉపాసనా ప్రాధాన్యంతో విష్ణుపురాణం ఉండడానికి కారణం ఉన్నదనిన్నీ, వామనపురాణంకూడ ఎందుకు వచ్చిందో స్పష్టమవుతూంది.

ఋగ్వేదంలో మహాదేవుడైన రుద్రుని ప్రశంస హెచ్చుగా ఉన్నది; నాలుగు వేదాల్లోను రుద్రస్తుతి కనిపిస్తుంది. యజుర్వేదంలో ౧౬-వ అధ్యాయంలో విశేషముగా ఉన్నది. తై. కృ. యజు. లో కూడా రుద్రాధ్యాయమున్నది. వాజసనేయ రుద్రాధ్యాయంలో శివ, గిరీశ, పశుపతి, నీలగ్రీవ, సితకంఠ, భవ, శర్వ, మహాదేవ అనే మొదలయిన పేర్లు అన్నీ వున్నవి. రుద్రుడు, మహాదేవుడు, శివుడు మొదటలో వేరు అనడానికికూడా అవకాశం లేదు. అందుచేత శివపురాణం ప్రత్యేకంగా ఉపాస్యదేవత ననుసరించి ఉండుటకు కారణం కనిపిస్తుంది.

సూర్యప్రసంగం వేదంలో ఉన్నట్టు అందరూ ఒప్పుకున్నదేను. యజు. ౪-౧౯; ౮ (౪౧, ౪౨) లో చూడవచ్చును.

తలవకార ఉపనిషత్తులో "అంబికా బ్రహ్మ విద్యా స్వరూపిణీ, ఉమా, హైమవతీ" అనే పదములు ఉన్నాయి. తై. ఆ. ౧౦ ప్రా. "కాత్యాయనాయ విద్మహే కన్యకుమారి ధీమహి తన్నో దుర్గిః ప్రచోదయాత్" అని ఉంది. అథ. ౪ (౭) 3౦ లో కూడ శక్తిప్రశంస ఉన్నది. ఋగ్వేదంలో లక్ష్మీసూక్తం ఉన్నది.

యజుర్వేదంలో "గణానాం త్వాం గణపతిగ్ం హవామహే" అనిన్నీ, ఋగ్వేదంలో "గణానాం త్వాం గణపతిం" అనిన్నీ, తై. ఆర.లో "తత్పురుషాయ విద్మహే వక్రతుండాయ ధీమహి తన్నో దంతిః ప్రచోదయాత్" అనిన్నీ ఉన్నది. ఈ లాగుననే పంచదేవ ఉపాసన విషయంకూడ వేదములో ఉన్నది.

వేదములలో సూచనపూర్వకంగా ఉన్న విషయములే పురాణాల్లో విస్తరంగా కనపడుతున్నాయి. పరిణామం చెంది నవీనమైన రూపాన్ని దాల్చినవి. పరివర్ధన గలదు. ఉదాహరణం: పృథుచక్రవర్తి భూమిని ఆవురూపమయినదానిని పాలుపితుకుట అనే పురాణగాథ అథ. వే. ౮-3, ౪, ౫లో కనిపిస్తుంది. అదే పురాణాలలో విపులంగా ఉన్నది.

ఈ విషయమే—

"యోవిద్యాచ్చతురః వేదాన్ సాంగోపనిషదః ద్విజః నచేత్ పురాణం సంవిద్యాత్ నఏవ స్యాత్ విచక్షణః ఇతిహాసపురాణాభ్యాం వేదం సముపబృంహయేత్."

అని బ్రహ్మాండ ప్రక్రియపాద ౧ అధ్యాయంలో చెప్పబడినది.

ఈఉపాసనాభేదాలనుబట్టి భిన్నమైన దేవతా ప్రశంసప్రాముఖ్యతలు ప్రత్యేక పురాణాల్లో విపులంగా వ్రాయబడ్డట్లు ఊహించగలము. భవిష్య. ౧ లో విష్ణు శివ సూర్యధర్మములు వేరువేరు పురాణాల్లో చెప్పినట్లు ఉన్నది. స్కందపురాణంలో "అష్టాదశపురాణేషు దశభిః గీయతే శివః,
చతుర్భిః భగవాన్ బ్రహ్మ ద్వాభ్యాం దేవీ తథా హరిః"
అని వ్రాశారు. స్కందపురాణంలోనే శివరహస్యఖండంలో—

"తత్ర శైవాని శైవంచ భవిష్యంచ ద్విజోత్తమాః
మార్కండేయం తథా లైంగంవారాహం స్కాందమేవచ
మాత్స్యమన్య త్తథా కౌర్మం వామనంచ మునీశ్వరాః
బ్రహ్మాండంచ దశేమాని త్రీణి లక్షాని సంఖ్యయా

గ్రంథానాం మహిమా సర్వైః శివస్యైవ ప్రకాశ్యతే
అసాధారణయా మూర్త్యా నామ్నా సాధారణో నచ
వదన్తి శివమేతాని శివస్తేషు ప్రకాశ్యతే
విష్ణోర్హి వైష్ణవం తచ్చ తథా భాగవతం తథా
నారదీయం పురాణంచ గారుడం వైష్ణవం విదుః
బ్రాహ్మంపాద్మంబ్రహ్మణఃద్వేఅగ్నేరాగ్నేయమేకకం
సవితుః బ్రహ్మవైవర్తం ఏవం అష్టాదశ స్మృతమ్
చత్వారి వైష్ణవానీశ విష్ణోః సామ్యపరాణివై
బ్రహ్మాదిభ్యః అధికం విష్ణుం ప్రవదంతి జగత్పతిం
బ్రహ్మవిష్ణుమహేశానాం సామ్యం బ్రహ్మే పురాణకే
అస్యేషామధికం దేవం బ్రహ్మణి జగతాం పతిం
ప్రవదన్తి దినాధీశం బ్రహ్మవిష్ణుశివాత్మకం."
అని చెప్పివున్నది.

ఈవిధంగా ఉపాసకాభేదం ఉన్నప్పటికీకూడా ౧౮ పురాణాలు వినవలసిందే అనికూడ చెప్పేరు.

"అష్టాదశాని పురాణాని నామధేయాని యః పఠేత్
త్రిసంధ్యం జపతే నిత్యం సః అశ్వమేధఫలం లభేత్"
అని మార్కండేయపురాణంలోనూ,
"యేతు ఏతాని సమస్తాని పురాణానిచ జానతే
భారతంచ మహాబాహో తే సర్వజ్ఞా మతా నృణాం"
అని భవిష్యంలోనూ చెప్పిఉన్నది.

ఇంతేగాక పరమాత్మయొక్క యాథార్థ్య తత్వమునుగురించి ఏకవాక్యతకూడా ఉన్నదనిగ్రహించవలెను. అది ఏలాగున అంటే—

లింగపురాణంలో :

"అథోవాచ మహాదేవః ప్రీతః అహం సురసత్తమా
పశ్యతం మాం మహాదేవం భయం సర్వం విముంచతం
యువాంప్రసూతౌ గాత్రాభ్యాంమమపూర్వంమహాబలౌ
అయం మే దక్షిణే పార్శ్వే బ్రహ్మలోకపితామహః
వామే పార్శ్వేచ మే విష్ణుః విశ్వాత్మా హృదయోద్భవః"

అనిన్నీ, తిరిగి—

"వత్సవత్స హరే విష్ణో పాలయేత్ తత్ చరాచరం"

అనిన్ని ఉన్నది.

"సృజామి తన్నియుక్తః అహం హరో హరతి తద్వశః"

అని విష్ణువుచేనియుక్తుడై బ్రహ్మ సృజించినట్లు, హరుడు హరింపుచేయునట్లు ఉన్నది.

భాగవతంలోకూడా ఇలాగే ఉన్నది.

మార్కండేయంలో—

"విష్ణుః శరీరగ్రహణం అహమీశానఏవచ [భవేత్"
కారితాః తే యతః అతఃత్వాం కః స్తోతుం శక్తిమాన్

అని ఉన్నది.

నామమాత్రంవల్ల భేదంకాని, యాథార్థ్యంలో ఒకటే నిజమును ఈ పురాణాలు చెప్పుచున్నాయి.

రానురాను పక్షపాతబుద్ధిచేత అనేకమైన పక్షపాతము చూపించే ప్రక్షిప్త శ్లోకాలు పురాణాల్లో కొందరు కలిపినట్లు ఒప్పుకోవచ్చును; అయితే వాటిని మాత్రం నిరాకరించాలి కాని పురాణాలమీద ఆదరణకు భంగం కలిగించనక్కర్లేదు.

ఇప్పటికి తేలిన విషయం : పురాణాలు వేదముకన్నకూడ ముందుగా ఉన్న గాథలు; శివ బ్రహ్మ విష్ణు శక్తి - వీరిమహిమలు సంకీర్తనచేసి, ప్రపంచ క్రమము మొదలగు పంచలక్షణములతోను ప్రత్యేక ఉపాసకులయొక్క భక్తిపిపాస తీర్చి, కథారూపంగా వేదవేదాంతములలో చెప్పిన కర్మజ్ఞాన ఉపాసనా కాండలను మనుష్యులకు హృదయగతమయ్యేలాగు వర్ణించి చిత్తశుద్ధిచేసి మోక్షసాధనమును కల్పించుటయే అష్టాదశపురాణములయొక్క ఉద్దేశము.







# ఆతని విజయమునకు ఇప్పుడే సన్నాహము జరుగుచున్నది

## అతని తండ్రి అతని విద్యకొరకు గట్టి ఏర్పాట్లు చేయుచున్నాడు

అతడు ఒక చిన్నబాలుడేయైనను విద్య నేర్పుటకు ద్రవ్యము కావలెనను దూరదృష్టి అతని తండ్రికి కలదు. అతని బడిజీతమును తెలివిగా ఇప్పుడు వడ్డికి వేసినాడు. 12 సంవత్సరములలో ఆ పైకమే నూటికి 50 వంతుల వడ్డితో వృద్ధియై అతడు పెరిగి పెద్దవాడైనపుడు యూనివర్సిటి (కళాశాల) విద్యను అభ్యసించుటకు అదిసరిపోవును. ఇందుమూలముగా సంపూర్ణమైనట్టియు ఫలప్రదమైనట్టియు విద్యను కలిగి ధైర్యముతో లోకవ్యవహారములందు ఆయన ప్రవేశించవచ్చును.

అతడు తన తండ్రికి ఎంత ఋణపడియున్నాడు!! నేషనల్ సేవింగ్సు సర్టిఫికెట్టులలో తన ధబ్బును దాచుకొనుటకు చేసికొనిన నిర్ణయమునకు అతని తండ్రి ఎంతఋణపడియుండును! మీరు మీకుమారునకు ఇంత లాభము కలుగజేయగలరా? అది మీ మీదనే ఆధారపడియున్నది బుద్ధిశాలులైన తండ్రులజతలో మీరును చేరి, మీ అదనపురాబడిని.




## నేషనల్ సేవింగ్సు సర్టిఫికెట్లలో దాచుకొనుడు

★ ప్రతి రూ. 10లు 12సంవత్సరముల తర్వాత రూ. 15లు అగును.

★ నూటికి 4¼ వంతుం చొప్పున సాధారణ వడ్డిలభించును. దీని మీద ఇన్‌కమ్‌ టాక్సులేదు.

★ 2 సంవత్సరములైనతరువాత చేరినవడ్డితో ధబ్బును తీసు కొనవచ్చును. (రూ. 5ల సర్టిఫికెట్టుకు 18 నెలలు.)

# 2000 ఏళ్లకు ముందు..

పూర్వపువారు చందనమును పరిశుద్ధతకు పర్యాయపదముగా నిర్ణయించినారు. నేటివారు మోటారులలో "రోల్స్‌రాయిస్"ను ఉత్తమమయినదని చెప్పినట్లు, మంచివస్తువుల ప్రసంగములో చందనమును శ్రేష్ఠమయినదానినిగా ప్రశంసింతురు. చందనము, మధురపరిమళము, చలువగుణము కలిగియుండుటవలన చందనతైలము సౌందర్యాలంకార వస్తువులలో ముఖ్యముగా ఉపయోగింపబడుచున్నది. అశోకునికాలమున యథార్థముగా అంగీకరింపబడిన విషయము నేడుకూడ యథార్థమే!

## మైసూరు శాండల్ సబ్బు



"పరిశుద్ధతకు ప్రసిద్ధమైనది చందనమే"

B-3. TG

మైసూరు గవర్నమెంటు ప్రాడక్టు.



1. కొండవీటి తలవాకిలి




2. కొండవీటి శిథిలములు



3. కొండవీటిలోని వెదుళ్లకొలను



**4. కొండవీటి కోటగోడ.**

చిత్రకారుడు : శ్రీ కె. వేణుగోపాల్

# యుద్ధకాలమునందలి - - భారతదేశపు ఆర్థికస్థితి

= శ్రీ రంగయ్యాప్పారావు బహద్దరు =

ఇన్నాళ్ళకిప్పుడు యూరోపా సంగ్రామము ముగిసింది. ఆరు సంవత్సరాలు మహాభయానకమైన ప్రళయ శక్తి తాండవం చేసింది. ఈ ఘోర యుద్ధాగ్నికి మన దేశంకూడా ఆహుతి అయింది. ఆ మహాప్రళయ సమయంలో బెంగాలుక్షామము మొదలయిన మహావిపత్తులు వచ్చి, యుద్ధరంగంలో తీవ్రంగా పాల్గొన్న దేశము లెంత పీడితములైనవో మన దేశంకూడా దాదాపుగా అంత నష్టాన్నీ పొందింది. పులిమీద పుట్ర అన్నట్లు ఈ విపత్సమయంలో మన దేశంలో ఎంత డబ్బు ఖర్చు అయిందో, ఏ యే మార్గాల ఎంతెంత డబ్బు వసూలు చేయబడిందో తెలుసుకుందాం.

యుద్ధసమయంలో ప్రభుత్వానికి శాంతి సమయంలోకంటే అధికంగా డబ్బు కావలసి వస్తుందని వేరే చెప్పఖ్ఖర్లేదు. కావలసిన ధనాన్ని సంపాదించడానికి కొన్ని మార్గా లున్నవి. వీటిలో ముఖ్యమైనవి: (1) పన్నులు హెచ్చించడము (2) కరెన్సీ నోట్లు వృద్ధిచేయడము (3) దేశీయులవద్దగాని, విదేశీయులవద్దగాని అప్పు తీసుకోవడము. సాధారణంగా యుద్ధంలో పాల్గొనే దేశాలు ధనసంగ్రహమునకు ఈ మూడు పద్ధతులనూ అవలంబించుతవి.

మన దేశంలో యుద్ధానికి పూర్వం 1938-39 సంవత్సరంలో ఖర్చుపడ్డ సాలీనా ఆదా రూ. 85.15 కోట్లు. 1944-45లో ఖర్చుపడ్డ సాలీనా ఆదా రూ.512.65 కోట్లు. ఇంత అధికవ్యయం చేయాలంటే దేశంలో చాలా యిబ్బంది కలిగివుండాల్సింది. అలా కలక్కుండా కొన్ని యేర్పాట్లు చేయబడ్డాయి. మొదటి సంవత్సరాల్లో ప్రభుత్వం చాలామట్టుకు పన్నులపై ఆధారపడిందిగాని, రానురాను పన్నులవల్ల వచ్చే ఆదాయం చాలక ప్రజలవద్దనుండి ఋణపత్రముల ద్వారా తీసుకునే ఋణాలపై ఆధారపడింది. కేంద్ర శాసనసభలో జరిగిన బడ్జెటు ఉపన్యాస సందర్భంలో రైజుమనుగారు ఋణములే యుద్ధకాలపు ధన సంగ్రహణమునకు మూలాధారాలైనవని చెప్పారు. ఋణాలవల్ల ప్రభుత్వపు చేతులోకి డబ్బురావడమే గాక, ఇంకొక ముఖ్యమైన యుద్ధావసర కార్యాన్ని నెరవేరుస్తుంది. అదే మన, (Anti-inflation) డబ్బు విలువ తగ్గకుండా నిలుపుట.* ప్రజలవద్ద పెరిగిపోతున్న డబ్బును ప్రభుత్వం ఋణంగా లాగివేయడంవల్ల ఆ డబ్బు చలామణిలోనుంచి పోయి ఇన్‌ఫ్లేషన్ తగ్గిస్తుంది. ఇదీ ప్రభుత్వపు బాధ్యతలలో ముఖ్యాతి ముఖ్యమైనది.

అలా కానట్లయితే చైనాలోవలె ధరలు మూడు వందల రెట్లుకూడా పెరిగితే పెరగవచ్చు. ఆ విధంగానే పెరిగితే క్రిందటి యుద్ధానంతర కరెన్సీ విలువ పూర్తిగా నశిస్తుంది.

---

* యుద్ధకాలంలో మందుసామానులు వగైరా చేయుట, సైనికులకు జీతాలు హెచ్చుగా ఇచ్చుట, పరిశ్రమల్ని యుద్ధపరిశ్రమలుగా చేయుట మొదలైన పనులవల్ల డబ్బు విపరీతంగా పెరిగి, వస్తువుల సంఖ్య తరిగిపోతుంది. అందువల్ల వస్తువుల ధరలుకూడా విపరీతంగా పెరుగుతవి; డబ్బువిలువ తగ్గుతుంది.

ప్రభుత్వాని కిన్ని మార్గాలున్నా, తతిమ్మా మార్గాల్లో ప్రవేశించేముందు, పన్నులవల్ల వీలయినంత ఆదాయం తియ్యాలి. అందువల్ల మన దేశంలో ప్రభుత్వం చాలామట్టుకు ఈ మార్గమే తొక్కింది.

పన్నుల విధానం:—పన్నులు రెండువిధాలు. ఒకటి ఆదాయంపై పన్ను; రెండు వస్తువులపై పన్ను (Direct tax and Indirect tax). ఇన్‌కంటాక్సు ఆదాయంపై పన్నే కదా! ఈ పన్ను చెల్లించేటప్పుడు ఎంత చెల్లించేదీ మనకు తెలుస్తూనే ఉంటుంది. ఇంక వస్తువులపైపన్ను. ఎక్సైయిజుపన్ను ఇదే. దీన్ని చెల్లించేటప్పుడు చెల్లించుతున్నామని మనకు తెలియదు. వస్తువుధరలోనే పన్నుకూడా కలిసి ఉండడమువల్ల అంతా వస్తువుధర అనే అనుకుంటాము. పాశ్చాత్యదేశాల్లో ఈ వస్తువులపై పన్ను తక్కువగాను, ఆదాయంపై పన్నే యెక్కువగాను ఉంటుంది. మన దేశంలోమాత్రం వస్తువులపైపన్నే యెక్కువ.

1944-45 లో ఆదాయపు పన్ను రూ. 210.0 కోట్లు. ఇది 1938-39 లో రూ. 17.28 కోట్లు. అంటే, దాదాపు పన్నెండురెట్లు ఎక్కువయిందన్నమాట. నూటికి 20 వంతుల చొప్పున ఎగుమతి దిగుమతులమీద పన్ను వేసిన యుద్ధకాలంలో ఎగుమతి దిగుమతులు లేకపోవడంచేత ఈ ఆదాయం యుద్ధానికి పూర్వపు ఆదాయంకంటే తగ్గిపోయింది. ఎక్సైయిజు పన్ను (అబ్కారీ, అగ్గిపెట్టెలు మొదలగు మన దేశంలో తయారయే వస్తువులమీద వేసే పన్ను) పెరిగింది. కొత్త వస్తువులమీదకూడా పన్ను విధించబడింది. 1938-39 లో కేంద్రప్రభుత్వపు ఎక్సైయిజు పన్ను రూ. 8.66 కోట్లు. అది 1944-45 లో రు 39.07 కోట్లయింది. 44-45 లో విదేశవర్తకపు పన్ను కూడా పూర్వంకంటే వృద్ధిపొందింది. ఇకముందు ఇంకా పెరుగుతుంది. ఎందువల్లనంటే, యూరపులో యుద్ధం అయిపోయి, ఎగుమతి దిగుమతులు విరివిగా సాగుతున్నందువల్ల. యుద్ధానికి పూర్వం ఒక సంవత్సరం, యుద్ధారంభము తరువాత ఆరు సంవత్సరాల పన్నులవల్ల వచ్చిన నికరాదాయము ఈ క్రిందిపట్టీలో (కోట్లరూపాయల్లో) చూపబడుతున్నది.

| సంవత్సరము | కోట్ల రూపాయలలో పన్నుల ఆదాయము |
|---|---|
| 1938-39 | 84.51 |
| 1939-40 | 94.57 |
| 1940-41 | 99.88 |
| 1941-42 | 134.57 |
| 1942-43 | 176.88 |
| 1943-44 | 249.95 |
| 1944-45 | 356.88 |

మొత్తం 1112.73 కోట్లు. యుద్ధారంభానికి పూర్వంలా సంవత్సరానికి రూ. 84.51 కోట్ల చొప్పున అయినట్లయితే, ఈ ఆరు సంవత్సరాలకూ రూ. 507 కోట్లు మాత్రమే అయివుండేది. కాని యుద్ధపరిస్థితులవల్ల కొత్తపన్నులమూలంగానేమి, పాతపన్నులు ఎక్కువవుటమూలంగానేమి రూ. 605.67 కోట్లు ఎక్కువ ఆదాయం వచ్చింది. ఇది యుద్ధానికి పూర్వపు పై దాదాపు రెట్టింపు; అనగా నూటికి నూరు వృద్ధి అయింది.

ఇందులో కొత్తపన్నులవల్ల ఎంత ఆదాయం వచ్చిందో, పాతపన్నులవల్ల ఎంత ఆదాయం వచ్చిందో తూచినట్లుగా చెప్పడం చాలా కష్టం. ఆదాయపు పన్ను ఎక్కువచేయడంవల్లనూ, యుద్ధకాలపు పరిశ్రమాభివృద్ధిమూలంగా కొంత ఆదాయము పెరగడమువల్లనూ, ఎక్సయిజు ఆదాయంవల్లనూ వచ్చిన మొత్తము దాదాపు మూడింట రెండువంతులు అనుకుంటే మిగతా మూడోవంతు యుద్ధపరిస్థితులవల్ల చేయబడిన అధికపుపన్నుల ఆదాయ మనుకోవచ్చును.

కొత్తపన్నులు:—యుద్ధపరిస్థితులవల్ల విధించిన కొత్తపన్నులనుగురించి మన మిప్పుడు విచారించవలసి ఉంటుంది. 1940-41 బడ్జెటులో అధికలాభాలపన్ను (Excess Profits Tax) విధించబడింది. ఇది వచ్చిన లాభంలో సగమువంతు, అనగా నూటికియాభైవంతులు,

ఇదివర కెన్నడూ మన దేశంలో ఈపన్ను లేదు. ఇంగ్లాండుదేశంలో ఉండేది. ఇంగ్లాండుదేశం పారిశ్రామికంకాబట్టి, కొన్ని సందర్భాల్లో నూటికి నూరు కూడా పన్ను విధించబడింది. మన దేశంలో ఇప్పుడిప్పుడే తలసూపుతున్న పారిశ్రామికాభివృద్ధికి ఈ అధికలాభపుపన్నులను పెంచడమువల్ల కొంత ఆటంకం ఏర్పడింది. పంచదారపై ఎక్సైజుపన్ను దిగుమతి పన్ను ఒక హండ్రెడువెయిటుకు రెండురూపాయిలనుండి మూడురూపాయిలవరకు పెంచారు. పెట్రోలుపన్ను గాలనుకు పదిఅణాలనుండి పన్నెండణాలు చేశారు. 1940 సం.పు సప్లిమెంటరీబడ్జెటు ప్రవేశపెట్టినప్పుడు ఆదాయపుపన్ను లన్నిటిపైనాకూడా సూపర్‌టాక్సు, కార్పొరేషనుటాక్సు నూటికి ఇరువదియైదువంతులు వృద్ధిచేశారు. పోస్టు టెలిగ్రాఫ్‌రేట్లుకూడా కొద్దిగా ఎక్కువచేశారు. 1941-42 బడ్జెటులో అధికలాభపు పన్ను నూటికి యాభైవంతులనుండి 66 2/3 వంతులవరకూ వృద్ధిచేశారు. ఆదాయపుపన్ను నూటికి 25 వంతుల నుండి 33 1/3 వంతులవరకూ చేశారు. వస్తువులపైపన్నులు కూడా వృద్ధిచేశారు. అగ్గిపుల్లలమీది ఎక్సైజుపన్ను రెట్టింపుచేశారు. నూటికి 10 వంతులు ఎక్సైజు పన్ను టైర్లు, ట్యూబులమీద విధించారు. ఇమిటేషనుసిల్కు దారంమీద పౌనుకు మూడణాలనుండి అయిదణాలు చేశారు. 1942-43 లో ఆదాయపుపన్ను విధించడానికి కనీసపుఆదాయము రూ. 2000లనుండి రూ. 1500లుగా మార్చినారు. ఆదాయపుపన్నుపై సర్‌చార్జీ క్రింది విధంగా వృద్ధిచేశారు. 1500 మొదలు 5000 లవరకు రూ 1-కి 6 పైసలు; 5000 నుండి 10000 లవరకు రూ 1-కి 9 పైసలు; 10000 లనుండి 15000 వరకు రూ 1-కి 14 పైసలు; 15000పై ఆదాయానికి రూ 1-కి 15 పైసలు. సూపరుటాక్సు(పెద్దఆదాయములపైపన్ను) నూటికి యాభైవంతులు చేశారు. అధికలాభపు పన్ను 66 2/3% పన్ను ఇచ్చేవాడు రెండువంతులు డిపాజిటు చేస్తే ప్రభుత్వము ఈ పన్నులోనుండి ఒకవంతు డిపాజిటుచేయడానికి సమ్మతించారు. ఈడబ్బు యుద్ధానంతరఅభివృద్ధికార్యాలకు ఉపయోగించే యేర్పాటు. దీనివల్ల డబ్బు చలామణిలోనుండి తగ్గి ఇన్‌ఫ్లేషన్ తగ్గుతుంది. యుద్ధానంతరపునర్నిర్మాణమునకు కూడా తోడ్పడుతుంది. ఇంతేగాక, ఇన్‌ఫ్లేషన్ తగ్గించుటకు దిగుమతులన్నిటిపై అయిదోవంతు ఎమర్జెన్సీ సర్‌ఛార్జి విధించారు; దీనిలో నుండి ప్రత్తి, పెట్రోలు, ఉప్పుమాత్రం మినహా. 1943-44 లో ఆదాయం పెరగడానికి ఇన్‌ఫ్లేషన్ తగ్గించడానికి ఆదాయపుపన్నుపై సర్‌చార్జీ రూ. 5000 లకు మించిన ఆదాయాలకు వృద్ధిచేశారు. పెద్ద ఆదాయములపై పన్ను రు. 25000 మొదలు 3 1/2 లక్షల వరకు రూ. 1-కి 6 పైసలు వృద్ధిచేశారు. దీనివల్ల కనిష్ఠాదాయముపై రూ. 1-కి రెండణాలనుండి గరిష్ఠాదాయమునకు రూ.1-కి పదణాలన్నర అయింది. వస్తువులపై పన్నులు కొత్తగా రెండు విధింపబడ్డవి. పొగాకుమీద మొదటిది. వనస్పతివస్తువుల (Vegetable Products) మీద రెండవది. పొగాకుపన్ను 10.5 కోట్లు, వెజిటబిలు ప్రొడక్టులపన్ను 1 కోటి, పోస్టు, టెలిగ్రాఫ్‌పై అధికముచేసిన పన్ను 1.2 కోట్లు వచ్చునని అంచనా వేయబడింది. 1944-45 లో వేసిన పన్నులు ప్రభుత్వానికి డబ్బు రాబడికేగాక, ఇన్‌ఫ్లేషన్ తగ్గించడానికికూడా ఉద్దేశింపబడ్డవి. అధికలాభపు పన్ను ఎక్కువచేయలేదుగాని, డిపాజిటుమాత్రం పన్నులో 19/64 వంతు చేశారు. అధికలాభపుపన్ను, ఆదాయపు పన్ను, అధిక ఆదాయపుపన్ను చెల్లించిన తర్వాత మిగిలిన అధికలాభమంతా పూర్తిగా ప్రభుత్వంచేతులోకి పోయింది.

ఎక్కువలాభాలను ఆ విధంగా తీసుకున్నా, చిన్న ఆదాయాలకు కొంత సౌకర్యం చేశారు. సంవత్సరానికి రు. 2000 లకు లోపు ఆదాయముపై పన్ను తీసివేయబడింది. రు. 10000 ల నుండి రు. 15000 ల ఆదాయముపై పన్ను 16 పైసలనుండి 18 పైసలు చేయబడింది. ఈ 18 పైసలున్నూ కనీసపుపన్ను 24 పైసలు కాక. రూ. 15000 లకు మించిన ఆదాయములపై 20 పైసలనుండి 24 పైసలు చేయబడింది. ఇది కనీసపు పన్ను (Basic Rate) 30 పైసలుకాక. గరిష్ఠ ఆదా

యపుపన్ను రూ. 35000 మొదలు రూ. 200000 వరకు గల ఆదాయములపై సర్ చార్జిలో 6 పైసలు వృద్ధిచేయబడింది. కంపెనీలలో డివిడెండ్ల క్రింద ఖర్చు పెట్టకుండ నిలువ ఉంచిన డబ్బుపైమాత్రం రూ. 1-కి [illegible] రిబేటు ఇవ్వబడింది. పొగాకుపై ఎక్సైయిజు పన్ను ఎక్కువచేయబడింది. దీనివల్ల 10 కోట్లు ఆదాయం వచ్చింది. తమలపాకులమీదా, కాఫీ, టీల మీదా పౌనుకు రెండణాలచొప్పున ఎక్సైయిజుపన్ను విధించబడింది. ఈ పన్నులన్నింటివల్లా మొత్తపు ఆదాయము 23½ కోట్లు అయింది. ఇన్‌ఫ్లేషన్ తగ్గించు దృష్టితో చూచిన 90 కోట్లు దేశములో చలామణీనుండి తగ్గినవి. అనగా మిగతా 66 కోట్లు యుద్ధానంతరము మళ్లీ ఇవ్వబడతవి. ఇంక 1945-46 లో పన్నుల విధానములో ఎక్కువమార్పులు లేవు. రూ. 15000 లకు మించిన ఆదాయములపైమాత్రం సర్ చార్జీ మూడు పైసలు ఎక్కువచేయబడింది. దీనివల్ల వచ్చు ఆదాయము 4 కోట్లని అంచనావేయబడింది. పొగాకుమీద రూ. 3.6 కోట్లు ఆదాయము హెచ్చు వచ్చులాగున ఎక్సైయిజురేట్లు ఎక్కువచేయబడ్డవి. పోస్టురేట్లు, టెలిఫోనురేట్లు ఎక్కువచేయబడ్డవి. దీనివల్ల 13.5 కోట్లు ఆదాయము వచ్చింది. ఈ పట్టీలో ముఖ్యమైన ఆదాయ

| సంవత్సరాలు | [illegible] | కేంద్ర ప్రభుత్వ ఎక్సైయిజు | [illegible] | ఇతర పన్నులు | ఉప్పు పన్ను |
|---|---|---|---|---|---|
| యుద్ధానికి పూర్వకాలం | | | | | |
| 1938-39 | 40.51 | 8.66 | 2.04 | 15.24 | 8.12 |
| యుద్ధకాలం | | | | | |
| 1939-40 | 45.88 | 6.52 | 2.38 | 16.99 | 10.88 |
| 1940-41 | 37.30 | 9.49 | 4.14 | 21.79 | 7.67 |
| 1941-42 | 37.89 | 13.15 | 11.66 | 32.40 | 9.20 |
| 1942-43 | 25.12 | 12.75 | 31.40 | 54.36 | 10.91 |
| 1943-44 | 26.57 | 24.94 | 51.28 | 77.86 | 8 34 |
| 1944-45 | 40.00 | 39.07 | 106.11 | 103.89 | 9.30 |

ఎగుమతి దిగుమతిపన్నులు నూటికి 20 చొప్పున సర్ చార్జీ వేసినప్పటికీ 25 కోట్లు మాత్రమే వచ్చినవి ఇది యుద్ధానంతర ఆదాయముకంటె 100 కి 40 తక్కువ. ఎక్సైయిజుపన్ను క్రమక్రమంగా వృద్ధిపొందింది. ఆదాయపుపన్నులు చాలా అధికంగా వృద్ధి పొందినవి. 1938-39 లో 17 కోట్ల నుండి, 1944-45 లో 210 కోట్లయినవి. ఇంతేగాక రైల్వేలు, పోస్టు టెలిగ్రాఫ్ డిపార్టుమెంటులు ప్రభుత్వానికీ విశంగా ధనం సమకూర్చిపెట్టినవి:

| [illegible] | [illegible] | [illegible] |
|---|---|---|
| యుద్ధానికి పూర్వం | | |
| 1938-39 | .19 | 1.37 |
| యుద్ధకాలం | | |
| 1939-40 | .89 | 4.33 |
| 1940-41 | 1.25 | 12.16 |
| 1941-42 | 3.41 | 20.17 |
| 1942-43 | 4.52 | 20.13 |
| 1943-44 | 9.03 | 37.64 |
| 1944-45 | 9.32 | 32.00 |

యుద్ధవ్యయము:—ఈ ధనమంతా ఏ విధంగా ఖర్చయిందో చూదాం. రివెన్యూలోనుండి 1939-40 నుండి 1944-45 వరకు ఖర్చుపెట్టిన మొత్తము 1598 కోట్లు.

| సంవత్సరములు | రివెన్యూలో ఖర్చు |
|---|---|
| యుద్ధానికిపూర్వం | |
| 1938-39 | 85.15 |
| యుద్ధకాలం | |
| 1939-40 | 94.57 |
| 1940-41 | 114.18 |
| 1941-42 | 147.26 |
| 1942-43 | 289.05 |
| 1943-44 | 439.85 |
| 1944-45 | 512.65 |
| మొత్తము | 1597.56 |

యుద్ధము లేని పక్షంలో 1938-39 లో ఖర్చును బట్టి చూస్తే ఈ ఆరేండ్లకూ 511 కోట్లు మాత్రం

ఖర్చయి ఉండవలసింది. కాని యుద్ధంవల్ల 1087 కోట్లు ఎక్కువ ఖర్చయింది. పైమొత్తంలో కేవలం యుద్ధసామగ్రికొరకయిన ఖర్చేగాక ఇతరఖర్చు కూడా కలిసి ఉంది. కేవలము యుద్ధవ్యయం 1938-39 లో 46.18 నుండి 1944-45 లో 397.23 కోట్ల వరకు పెరిగింది. అంటే దాదాపు ఎనిమిదిరెట్ల కెక్కువగా పెరిగిందన్న మాట!

| సంవత్సరములు | కేవలం యుద్ధవ్యయము |
|---|---|
| యుద్ధానికిపూర్వం | |
| 1938-39 | 46.18 |
| యుద్ధకాలం | |
| 1939-40 | 49.54 |
| 1940-41 | 79.61 |
| 1941-42 | 103.93 |
| 1942-43 | 214.62 |
| 1943-44 | 358.40 |
| 1944-45 | 397.23 |
| మొత్తము | 1197.33 |

యుద్ధానికి పూర్వవత్సరమైన 1938-39 వ్యయాన్నిబట్టి చూస్తే యుద్ధకాలపు మొత్తము వ్యయము 277 కోట్లు మాత్రమే అయివుండవలసింది. ఈ అధికవ్యయమంతా యుద్ధమువల అయిందే. యుద్ధంలో యుద్ధంవల్ల అయిన ఖర్చుమొత్తం 1087 కోట్లని యిదివరకు తెలుసుకున్నాము. ఇందులో 920 కోట్లు యుద్ధంనిమిత్తమయిన ఖర్చున్నూ, మిగతా 167 కోట్లున్నూ ప్రభుత్వపు అదనపుఖర్చున్నూ. ఈ అదనపు ఖర్చుకు కరువుభత్యములు, ప్రభుత్వశాఖల వృద్ధి మొదలయినవి కారణాలు. 1942-43 బడ్జెటు నుంచి రివెన్యూఖర్చు అనీ, కాపిటల్ ఖర్చు అనీ ఈ యుద్ధపుఖర్చును విభజించారు. రివెన్యూఖర్చు అంటే దానివల్ల తిరిగివచ్చే ఆస్తి యేమీ ఉండదు. కాపిటల్ ఖర్చు అంటే ఈఖర్చుకుగాను ఆస్తి ఉంటుంది. అనగా మిలిటరీరోడ్లు, విమానాశ్రయములు, బ్రిడ్జీలు మొదలయిన యుద్ధానంతరముకూడా పనికివచ్చేపనులకుగాను ఖర్చుపెట్టింది.

| సంవత్సరములు | కాపిటల్ ఖర్చు కోట్లు |
|---|---|
| 1942-43 | 52.51 |
| 1943-44 | 37.46 |
| 1944-45 | 59.41 |

ఈఖర్చులో బ్రిటీషుప్రభుత్వపు వాటా:— కేంద్రప్రభుత్వమునకు యుద్ధమువల్ల అయిన ఖర్చు పైన ఇవ్వబడిన అంకెలకంటె ఇంకా చాలా ఉంది. కాని 1938లో బ్రిటీషుప్రభుత్వము, భారతప్రభుత్వము కలిసి ఒక ఒడంబడిక చేసుకున్నారు. ఆ ఒడంబడిక ప్రకారం అయిన ఖర్చులో కొంతభాగం బ్రిటీషు ప్రభుత్వంవారు ఇచ్చేటట్లున్నూ, మరికొంతభాగం భారతప్రభుత్వంవారు ఇచ్చేటట్లున్నూ ఏర్పరచుకొన్నారు. 1944-45 ఆఖరువరకు ఖర్చయిన మొత్తం 2722 కోట్లు. ఇందులో భారతదేశపు వాటా 1198 కోట్లు; బ్రిటీషుప్రభుత్వపు వాటా 1374 కోట్లు. ఈ క్రిందిపట్టీలో వివరాలు బాగా తెలుస్తవి.

| సంవత్సరం | మొత్తం ఖర్చు | భారతదేశపు వాటా | బ్రిటీషు ప్రభుత్వపు వాటా |
|---|---|---|---|
| 1939-40 | 54 కోట్లు | 50 | 4 |
| 1940-41 | 127 ,, | 74 | 53 |
| 1941-42 | 298 ,, | 104 | 194 |
| 1942-43 | 579 ,, | 215 }<br>•52 } | 306 |
| 1943-44 | 774 ,, | 358 }<br>•38 } | 378 |
| 1944-45 | 894 ,, | 397 }<br>•60 } | 439 |
| మొత్తం | 2722 | 1198 }<br>•150 } 134 | 1374 |

చుక్కపెట్టిన అంకెలు కాపిటల్ఖర్చును తెలియజేస్తవి. అంటే వీటికిగాను మనకు ఆస్తులున్నవి. ఛాట్ఫీల్డు అనేఆయన, యుద్ధానికి పూర్వం మన దేశపు సైన్యమును యంత్రసహితము చేయవలసినదని

బ్రిటీషుప్రభుత్వమునకు సలహాయిచ్చాడు. ఇందుకయ్యే ఖర్చుకూడా బ్రిటిషుప్రభుత్వాన్నే పెట్టుకోమన్నాడు. బ్రిటీషుప్రభుత్వంకూడా అలాగే డబ్బు ఖర్చు పెట్టింది. ఇలా, ఆయన సలహాయివ్వడానికి కారణము, భారతీయసైన్యంకూడా బ్రిటీషుసైన్యంలో ఒకభాగంగా పరిగణింపబడుతూ, సామ్రాజ్యమునకు సంబంధించిన యుద్ధములలోకూడా పాల్గొంటూఉందిగదా! మన దేశంలోని న్యానికి కొన్ని విమానములు, ఫిరంగులు మొదలయిన యుద్ధపరికరములు ఉచితంగా కూడా ఇచ్చారు. ఇదంతాచూస్తే, "అబ్బా! బ్రిటీషు ప్రభుత్వము మన కెంత సహాయము చేసిందా" అనిపిస్తుంది. కాబట్టి ఈ విషయం మనము జాగ్రతగా పరిశీలించాలి. బ్రిటీషు ప్రభుత్వమూ, భారతప్రభుత్వమూ ఒడంబడిక చేసుకున్నప్పుడు ఈ క్రింది షరతులు ఏర్పాటుచేసుకున్నారు.

భారతదేశము ఈ క్రింది ఖర్చులు భరించాలి:—

1. యుద్ధం లేకముందు సైనికశాఖకయ్యే ఖర్చు. యుద్ధానికిపూర్వము మన దేశపు సైన్యానికి దాదాపు 50 కోట్ల రూపాయిలకు పైగా ఖర్చుయ్యేది. ఇది కేంద్రప్రభుత్వపు మొత్తం బడ్జెటులో సగానికంటే ఎక్కువ. ఇది కేవలము భారతదేశంకోసమే అనడము సాహసము

2. యుద్ధపరిస్థితుల మూలంగా ఖరీదులు ఎక్కువైనందువల్ల యుద్ధానికి పూర్వముండే సైన్యానికి అయ్యే అదనపు ఖర్చు. ఖరీదులు ఎక్కువ కావడానికి కారణం కరెన్సీ అమితంగా అచ్చువేయడమే. కరెన్సీ అమితంగా అచ్చువేయడానికి కారణం బ్రిటీషువారికి కావలసిన రూపాయిలు భారతప్రభుత్వము ఇవ్వడానికి ఒప్పుకోవడమే. దీనివల్ల ఇన్ఫ్లేషన్ ఎక్కువై ఖరీదులు విపరీతంగా పెరిగినవి. భారతదేశప్రజలు తీరని కష్టాలు పడ్డారు. బెంగాలు క్షామానికికూడా ఇది కొంత కారణం. నాలుగు సంవత్సరాల యుద్ధంలో భారతదేశప్రజలు రూ. 20000 కోట్ల ఖరీదు గల వస్తువులను అనుభవించకుండా వదలివేయవలసివచ్చింది. ఈ వస్తువులు జీవితానికి ముఖ్యంగా కావలసిన అవసరాలు. దీన్నిబట్టి విచారిస్తే ప్రజలు ఎంత బాధపడ్డారో తెలుస్తుంది. ఏ దేశమూ కూడా ఇంతటి వస్తుసంపదను వదులుకోలేదు.

3. భారతదేశరక్షణకై ఎక్కువచేసిన సైనికదళము, విమానదళము, నావికాదళము మొదలైనవాటికి పెట్టిన ఖర్చు.

4. భారతదేశసైన్యానికి ఇతర దేశములలో అయ్యే ఖర్చుక్రింద ఒక కోటిరూపాయిలు.

భారతదేశపు అవసరము ఎంతవరకో, సామ్రాజ్య సంరక్షణకు ఎంత అవసరమో నిర్ధారణ చేయడము చాలా కష్టం. జపానువారు బర్మా, ఈస్టుఇండియా దీవులు మొదలైన ప్రాగ్దేశసామ్రాజ్యమంతా ఆక్రమించారు. సామ్రాజ్యరక్షణకై భారతదేశం ముఖ్యమైన మూలాగారం అయింది. బ్రిటీషు సామ్రాజ్యానికి భారతదేశము ఎంత ముఖ్యమో, భారతసైన్యాలు ఈజిప్టులో, ఇటలీలో ఎంత ప్రముఖపాత్ర వహించినవో వైస్రాయిలూ, సైనికాధిపతులూ లెక్కలేనన్నిసార్లు శ్లాఘించారు కాబట్టి ఈ ప్రయత్నమంతా గాని, కొంతవరకైనా గాని భారతదేశ సంరక్షణకోసమేననడానికి ఏమాత్రమూ అవకాశము లేదు. భారతదేశపు బాధ్యత ఇందులో చాలా తక్కువ. బ్రిటీషు ప్రభుత్వము మనమీద నిర్హేతుకంగా ప్రేమామృతము కురిపించిందనుకోడానికివీలులేదు.

## అమెరికాతో అరువు-కవులు చట్టానికి సహాయము

1942 లో, ఇతరదేశాలన్నిటితో పాటు భారతదేశానికికూడా అమెరికా అరువు-కవులు సహాయము ఇవ్వడానికి మొదలుపెట్టింది. భారతదేశం అమెరికా-జపానుల యుద్ధంలో ముఖ్యసరఫరాస్థానం కావడమే యిందుకు కారణం. అందువల్ల, భారతదేశానికి అమెరికా ఏ సహాయం చేసినా, తన స్వంత సైన్యానికి, నౌకాదళానికి, విమానదళానికి సహాయం

# యుద్ధకాలమునందలి భారతదేశపు ఆర్థికస్థితి

చేసుకున్నట్టే. అరువు-కవులు చట్టంక్రింద భారతదేశాని కిచ్చిన సామగ్రులు, ఔషధములు, ఇతర వైద్యపరికరములు, తుపాకిమందు, మోటారులు, ఉక్కు, ఆయిల్, మెషీను పనిముట్లు, ఎలెక్ట్రిక్కు సామానులు, రేడియోలు, రైల్వేయింజన్లు, హార్బరు సామాన్లు, విమానపు సామానులు, భౌతికరసాయన శాస్త్రపరిశోధనా పరికరములు మొదలయినవి. ఇందుకు ప్రత్యుపకారంగా భారతదేశమునుండి అమెరికావారికి కావలసిన సహాయము చేయబడింది. అది యేమంటే, (1) అమెరికాదేశ సైనికులకు కావలసిన బట్టలు, ఇండ్లు, విమానాశ్రయములు, ఆహారపదార్థములు, వారి రాకపోకలకు కావలసిన రైలుమార్గములు, తంతులు మొదలైనవి. (2) అమెరికా నౌకాదళమునకు కావలసిన హార్బరులు, వాటికి కావలసిన మరమ్మతులు వగైరా ఖర్చులు. (3) అమెరికావారికి కావలసిన ముడి పదార్థములు, కాఫీ, టీ మొదలైన సరుకులు.

భారతదేశమునకు అరువు-కవులు చట్టంక్రింద అమెరికా యిచ్చిన సహాయము 1944-45 చివరివరకు 515 కోట్లు. భారతదేశము అమెరికాకు చేసిన సహాయం 124 కోట్లు. ఈ క్రిందిపట్టే యుద్ధకాలంలోని ఆదాయ (పన్నులవల్లనే వచ్చిన ఆదాయము) వ్యయాదికమును తెలియజేస్తుంది.

యుద్ధకాలములో రివెన్యూ ఎకౌంటులో వచ్చిన కొరత 477 కోట్లు. ఈ లోటు అప్పువల్ల సర్దబడింది. యుద్ధకాలంలో అప్పులవల్ల ధనం సంపాదించడము సామాన్యసంప్రదాయము. యుద్ధప్రారంభము మొదలు 1945 జనవరి ఆఖరువరకు అప్పులవల్ల సమకూర్చిన ధనము 833 కోట్లు. ఈ అప్పులు నూటికి మూడురూపాయిల వడ్డీచొప్పున ప్రజలవద్దనుండి తీసుకొన్నారు. అప్పులు తీసుకునే విషయంలో సామాన్యప్రజాసముదాయపు నిలువసొమ్మును తీసుకోవలెనని ప్రభుత్వపు ఉద్దేశము. అందుకుగాను, కొద్దిరోజులకే తిరిగి యిచ్చే అప్పులు, కొంతకాలము జరిగిన తరువాత తిరిగియిచ్చే అప్పులు, చాలాకాలమునకు తిరిగియిచ్చే అప్పులు అని మూడువిధములుగా తీసుకొన్నారు. పన్నెండు సంవత్సరాల ఋణపత్రాలు అమలులోపెట్టారు. వీటికి వడ్డీకూడా కొంచెము ఎక్కువ. ఇవి సామాన్యప్రజాసముదాయానికి ఎక్కు

(కోట్లరూపాయలలో) రివెన్యూ ఆదాయము—వ్యయము

| | 1938-39 | 1939-40 | 1940-41 | 1941-42 | 1942-43 | 1943-44 | 1944-45 |
|---|---|---|---|---|---|---|---|
| రివెన్యూ: ముఖ్యమైన రివెన్యూ పన్నులు | 76.11 | 84.09 | 82.01 | 106.15 | 136.57 | 191.51 | 301.32 |
| చిల్లర రివిన్యూ పన్నులు | 8.34 | 8.05 | 16.39 | 12.23 | 26.56 | 31.27 | 40.80 |
| పోస్టు టెలిగ్రాపుల నికర ఆదాయము. రివెన్యూకు ఇచ్చినది | .19 | .89 | 1.25 | 3.41 | 4.52 | 9.03 | 9.32 |
| రైల్వేలు ఇచ్చినసొమ్ము | 1.37 | 4.33 | 12.16 | 20.17 | 20.13 | 37.64 | 32.00 |
| | 86.01 | 97.36 | 111.81 | 141.96 | 187.78 | 269.45 | 383.44 |
| రాష్ట్రీయములకు ఇవ్వవలసిన ఆదాయపు పన్ను పోను | 1.50 | 2.79 | 4.16 | 7.39 | 10 90 | 19.50 | 26.56 |
| మొత్తం రివెన్యూ | 84.51 | 94.57 | 107.65 | 134.57 | 176.88 | 249.95 | 356.88 |
| యుద్ధపుఖర్చు నికరం | 46.18 | 49.54 | 73.61 | 103.93 | 214.62 | 358.40 | 397.23 |
| సామాన్యపు ఖర్చు | 38.97 | 45.03 | 40.57 | 43.33 | 74.43 | 81.45 | 115.42 |
| | 85.15 | 94.57 | 114.18 | 147.26 | 289.05 | 439.85 | 512.65 |
| కొరత | .64 | — | 6.53 | 12.69 | 112.17 | 189.90 | 155.77 |

వగా ఉపయోగపడవలెనని ఉద్దేశము. దీనివల్ల రాష్ట్ర ప్రభుత్వముల సహకారముతో చిన్నమొత్తములకు కూడా ఋణపత్రములు నెలకు మూడుకోట్లవరకూ అమ్ముడుపోతూఉండేవి.

1944-45 ఆఖరుకు భారతదేశపు ఋణము 1799 కోట్లు. ఇందులో 1004 కోట్లు వడ్డీగిట్టేపనుల నిమిత్తము ఉపయోగించబడింది. అనగా ఆనకట్టలు కట్టుట, కాల్వలు త్రవ్వించుట, రైలుమార్గములు నిర్మించుట మొదలయిన పనులనిమిత్తము ఉపయోగించబడింది. ఇందులో 312 కోట్లు ట్రెజరీసంబంధమైన డబ్బు, సెక్యూరిటీలబాపతున్నూ. కనుక వడ్డీయివ్వవలసిన ఋణము 483 కోట్లు మాత్రమే. ఇది భారతదేశమువంటి దేశానికి అప్పుక్రింద భావించడానికి వీలులేదు.

## భారతదేశము పెట్టుబడిదేశమయింది

ఈస్టిండియాకంపెనీ ప్రవేశించిననాటినుండీ మన దేశము ఋణగ్రస్తమయింది. ఎప్పటివడ్డీ అప్పుడు, ఒక్కపైసా మినహాయింపులేకుండా ఋణదాతలు వసూలుచేసుకున్నారు. కాని యీయుద్ధకాలంలో పరిస్థితులు తారుమారయినవి. భారతదేశం ఆంగ్లదేశానికి ఋణపడకపోవడమేగాక తానే ఋణదాతఅయింది. దీనికి అనేకకారణాలు. వాటిలో ముఖ్యమైనవి: (1) యుద్ధపరిస్థితులవల్ల మన దేశంలోకి దిగుమతులు పూర్తిగా తగ్గిపోయినవి. కాని మిత్రమండలిరాజ్యాలకు కావలసిన అసంఖ్యాకములయిన సరుకులు మన దేశము సప్లయిచేసింది. అందుకుగాను మన దేశానికి ఆంగ్లదేశంలో *స్టర్లింగులు సమకూడినవి. ఈ స్టర్లింగు భారతదేశపు అక్కౌంటులో బాంకు ఆఫ్ ఇంగ్లాండులో ఉంది. (2) ఎగుమతులేగాక, బ్రిటీషుసైన్యములకు, అమెరికను సైన్యములకు కావలసిన సరుకులు, తదితరయుద్ధపరికరములు మొదలయినవి మన దేశములోనున్న మిత్రమండలిసైన్యములు కొనుటవలన వచ్చిన స్టర్లింగుఆదా. (బ్రిటీషువారివద్ద రిజర్వుబాంకుస్టర్లింగులుతీసికొని మన దేశములో వారు ఖర్చుపెట్టుకొనుటకు రూపాయిలు ఇస్తుంది.)

ఈవిధంగా సమకూడిన స్టర్లింగుమొత్తం మొదట మన దేశము ఆంగ్లదేశానికి ఇవ్వవలసిన బాకీక్రింద జమకట్టబడింది. ఈబాకీ 1938-39 సంవత్సరములో 396.50 కోట్లు. ఇది యెప్పుడో తీరిపోయింది. 1945 మార్చి 30 నాటికి మనదేశపు అక్కౌంటులో 1368 కోట్లు నిలువఉన్నది. తరువాత 1500 కోట్లు అయింది. ఇలా క్రమక్రమంగా త్వరితంగా మన దేశమునకు ఆంగ్లదేశము ఋణగ్రస్తం అయిపోతున్నది. ఋణము పూర్తిగా తీరటమువల్ల విదేశాల దృష్టిలో భారతదేశానికి ఆర్థికంగా పలుకుబడి అధికమయింది. ఈ ఋణము తీరడమువల్ల అనేక బాధ్యతలుకూడా తీరిపోయినవి. విదేశాలలో అప్పుతెచ్చే బదులు దేశీయ ప్రజలవద్దనే ప్రభుత్వం అప్పుతీసుకొన్నది. దీనివల్ల ప్రజాసముదాయపు ఆదాయముకూడా వృద్ధి అయిందని తెలుస్తుంది. కొన్నివందల సంవత్సరములనుండీ పెరిగిన ఋణం మూడు సంవత్సరాలలో తీరిపోయింది. స్టర్లింగు ఎలా వచ్చిందీ, అది యెలా ఖర్చుపెట్టబడిందీ క్రిందిపట్టీలో చూపబడుతున్నది:

| | | |
|---|---|---|
| (1) రిజర్వుబ్యాంకులో ఉన్న స్టర్లింగుపత్రాలు, ఆగస్టు 1939 | రూ. | 64 కోట్లు |
| (2) రిజర్వుబాంకుకొన్న స్టర్లింగు జనవరి 1945 | రూ. | 633 ,, |
| (3) బ్రిటీషు ప్రభుత్వమువారు కొన్నందుకుగానుఇచ్చినస్టర్లింగు | రూ. | 1245 ,, |
| మొత్తం | రూ. | 1942 ,, |
| (4) స్టర్లింగు అప్పుతీర్చిన మొత్తం | రూ. | 400 కోట్లు |
| (5) ఇతర అప్పుతీర్చిన మొత్తం | రూ. | 238 ,, |
| (6) గాక, మిగతా నిలువ ఉన్న స్టర్లింగు(జనవరి చివరకు 1945 | రూ. | 1304 ,, |
| మొత్తం | రూ. | 1942 ,, |

* స్టర్లింగు ఆంగ్లదేశము కాగితపుడబ్బు. మన దేశంలో నోట్లవలెనే స్టర్లింగు ఆదేశంలో చలామణీ అవుతుంది. మన రూపాయినోటు వెండిరూపాయికి ప్రతినిధిగా చలామణిఅవుతున్నట్లే, ఇది పౌనుబంగారు నాణెముబదులు చలామణి అవుతున్నది. మారకపురేటు రూ 1-కి 1 షి 6 పె. (20 షి. ఒకపౌను).

# యుద్ధకాలమునందలి భారతదేశపు ఆర్థికస్థితి

ఇప్పుడిక యుద్ధమయింది కాబట్టి నిలువవున్న స్టర్లింగు మన దేశాభివృద్ధికి చాలా అవసరం. యుద్ధానంతర దేశాభివృద్ధి ప్రణాళికలో ఈ మొత్తము యొక్క ఆవశ్యకత నిరూపించబడింది. ఈ నిలవ మొత్తము మన దేశప్రజల కష్టములవల్ల, అనేక బాధలవల్ల, చివరకు బెంగాలు క్షామమువంటి ఘోరసంఘటనాలవల్ల సమకూర్చబడింది. అందువల్ల మనకీ మొత్తము నివ్వవలసిన నైతికబాధ్యతకూడా బ్రిటీషు ప్రభుత్వమునకున్నది. ఇందుకు ఆంగ్లేయు లేమంటున్నారంటే, "మేము ఇవ్వవలసిన మాట వాస్తవమే గాని, ఇవ్వడానికి ఏమీ అవకాశంలేదు. యుద్ధకాలంలో ధ్వంసమైపోయిన మా లండను మహానగరం యుద్ధానంతర కాలములో మేము మళ్లీ నిర్మించుకోవాలి. నాశనమైపోయిన మాపరిశ్రమ లన్నిటిని పునరుద్ధరించుకోవాలి. విదేశవ్యాపారం పూర్తిగా నశించింది; దానిని మళ్లీ పైకి తేవాలి. మాదేశం వర్తకంమీదా, ఎగుమతులమీదా జీవించే దేశం. మాదేశంలో పండే పంటలు మాకు చాలవు. కాబట్టి యీ డబ్బు 1500 కోట్లుపైగా మీకివ్వాలంటే సాధ్యంకాదు. కాబట్టి మీరు పదిపదిహేనుసంవత్సరాలపాటు ఆగాలి. అప్పుడైనా మాదేశంలో మేము తయారుచేసిన పారిశ్రామిక పరికరాలనే మీరు కొనాలి. అంతేగాక, మీకు కావలసిన విదేశీయవస్తువులన్నీ మీరు మాదేశంలోనే కొనాలి. అలా కొంటే మేము క్రమక్రమంగా మీ ఋణం తీరుస్తాం" అని. దీనివల్ల భారతదేశానికి అనేక నష్టాలున్నాయి: (1) మనకు కావలసిన పారిశ్రామిక పరికరాలూ, యంత్రాలూ అన్నీ ఇంగ్లాండులోనే కొనవలసివస్తే చాలాకాలానికిగాని వారు మనకు తయారుచేసియివ్వలేరు. ఒకవేళ యిచ్చినప్పటికీ వాటి ఖరీదు ఇతరదేశాల ఖరీదులకంటే చాలా యెక్కువగా ఉండవచ్చు. పైగా, ఇతరదేశాలవారు సప్లయిచేసే వస్తువులు ఇంతకంటే చాలా మంచివికూడా కావచ్చు. మనం, కేవలం వారు ఎప్పుడేది యిస్తే అప్పుడు దాంతో సంతోషపడి ఉండవలసివస్తుంది. ఈ మధ్య మన దేశపు పారిశ్రామిక వేత్తలయిన బిర్లా, టాటా ప్రముఖులు ఆంగ్ల, అమెరికా దేశములు పర్యటన చేశారన్న సంగతి అందరికీ తెలుసు. అమెరికాలో వస్తుసామగ్రి మంచిది ఉన్నదని వారు కనిపెట్టారు. కాని అమెరికావారు మన కివ్వమంటున్నారు. ఎందువల్లనంటే, రష్యావారు మనకంటే ముందే వారికి ఆర్డర్లు ఇచ్చారు. అంతేకాక, వారి స్వంతపరిశ్రమలకే వారు సప్లయిచేయలేకపోతున్నారు. అన్నింటికంటే ముఖ్యమైన కారణం, మనకు డాలర్లు లేకపోవడము. డాలర్లు ఉంటేగాని అమెరికాలో ఏవస్తువైనా కొనడానికి వీలులేదు. బ్రిటీషువారిని, మన కివ్వవలసిన స్టర్లింగులో కొంతమొత్తం డాలర్లుగా ఇవ్వవలసిందంటే, వారు ససేమిరా అంటున్నారు. మాకు కావలసిన డాలర్ల కోసమే మేము నానాఅవస్థలూ పడుతూఉంటే మీ కెక్కడ తెచ్చియిస్తా మంటున్నారు. డాలర్లు లేకపోవడమువల్ల అమెరికా వెళ్లవలెననుకున్న విద్యార్థులుకూడా ఆ ప్రయత్నం మానుకొని ఇంగ్లాండు వెళ్లవలసివస్తున్నది. ఇది యిలా ఉండగా, బ్రిటను తన వస్తువులన్నీ మనకు దిగుమతిచేసేటట్లయితే, యుద్ధకాలంలో మనదేశములో స్థాపించిన పరిశ్రమలన్నీ నాశనమైపోతాయి. మన దేశపరిశ్రమలు మన దేశానికి స్వపరిపాలన లేకపోవడమువల్లనే యెట్టి సహాయసంపత్తిన్నీ లేక అణగారిపోతున్నవి. యుద్ధకాలంలో విదేశీ దిగుమతులు తగ్గిపోవడముచేత మన పరిశ్రమలకు కొంత సదవకాశమే లభించింది. ఈ అవకాశం పోతే మళ్లీ ఎన్నాళ్లకిటువంటిది లభిస్తుందో తెలియదు. ఇంగ్లీషు పారిశ్రామికవేత్త ఒకడిప్పుడే "మీ యుద్ధకాలపు పరిశ్రమలన్నింటికీ సమాధులూ, గోరీలూ కట్టండి; మీకు కావలసిన వస్తువులన్నీ చాలా మంచివి చౌకగా చేసి పంపిస్తా"మంటున్నాడు. చూశారా, ఇదీ బ్రిటీషువారి వైఖరి. నిజానికి, మన దేశంలో పరిశ్రమాభివృద్ధికి 'రక్షణ' లివ్వడానికి ప్రభుత్వానికధికార మున్నది. ఈ పద్ధతి లేకపోతే, ఎన్నో సంవత్సరాలనుంచీ పాతుకుపోయిన విదేశీపరిశ్రమలతో కొత్తగా తలయెత్తుతున్న మన పరిశ్రమలు పోటీచేయలేవు. ఉదాహరణకు చూడండి: విదేశీ పంచదారకు ప్రభుత్వమువారు

నూటికి 10 రూపాయల చొప్పున పన్ను విధించారు. అప్పుడు మన దేశమంతటా పంచదారమిల్లులూ, చెఱుకుతోటలూ బయలుదేరి, దేశమంతటికీ కావలసిన పంచదారేకాక, అధికంగా కూడా తయారుచేయగల్గుతున్నవి. ఈ రక్షణ లేకముందు, జావాపంచదార ప్రపంచమంతా వ్యాపించినట్లే మన దేశంలోకూడా వ్యాపించిపోయింది. అంతటితో జావాలో పంచదార వ్యాపారం కొంత స్తంభించింది. ఈవిధంగానే అన్ని పరిశ్రమలకూ 'రక్షణ'లివ్వాలి. అంటే విదేశంనుండి దిగే సరుకులపై పన్నులు విధించి మనదేశంలో తయారయ్యే సరకులకంటె ఎక్కువఖరీదు అయ్యేటట్లు చెయ్యాలి. అప్పుడుగాని మన దేశపు పరిశ్రమలు వృద్ధికిరావు. ఈవిషయంలో మనము ఎంతో ఆందోళన చెయ్యాలి.

## అంతర్జాతీయ ధన (Monetary) సభ

అంతర్జాతీయ ధనమహాసభ 'బ్రెట్టన్‌వుడ్సు' అనే చోట 1944 జులైలో జరిగింది. ఈమహాసభకు భారతదేశప్రతినిధులుకూడా వెళ్లారు. ఈసభఉద్దేశం అంతర్జాతీయబాంకు, మూలధనం సమకూర్చుట. మనకు ఇంగ్లాండు ఇవ్వవలసిన అప్పు ఈబాంకుద్వారా ఏర్పాటుచేయవలసిందని మన ప్రతినిధులు కోరారు. కాని ఈకోరిక సభవారిచే త్రోసివేయబడింది. యుద్ధ ఋణాలతో పోల్చిచూస్తే, ఈబాంకుమూలధనం చాలా తక్కువగనుక ఆబరువు నిది భరించలేకపోవడమే పై నిరాకరణకు కారణము. అందువల్ల మన ఋణపరిష్కారవిషయము మనము ఇంగ్లాండుతోనే మాట్లాడుకొని ఏదోఒకవిధమైన సమాధానానికి రావలసిఉంటుంది.

## యుద్ధానంతర జాతీయ ఆర్థికవిధానము

యుద్ధమైపోయిందికాబట్టి, యుద్ధసైనికులింక సామాన్యపౌరజీవితంలో ఒడుగుడుకులు లేకుండా ప్రవేశించాలి. మన పరిశ్రమలను యుద్ధసామగ్రి ఉత్పత్తిచేసే పనినుండి మామూలువస్తువులు తయారుచేసే పనికి మార్చాలి. యుద్ధకాలంలో అరిగి పాడైపోయిన బట్టలమిల్లులు మొదలైనవి క్రొత్తవి తెచ్చి నిర్మించాలి. ఇంతేకాక భారతభావిపునరుద్ధరణకు ఒక ప్రణాళిక నిర్మించి దానిని మెట్టుమెట్టుగా వృద్ధిపొందించాలి. ఈపనులు ప్రతీదేశంలోనూ జరగవలసినవే. మనదేశంలో మరీ ముఖ్యం. ఎందుకంటే మన దేశపు ఆర్థికవిధానము వ్యవసాయంమీద ఎక్కువగా ఆధారపడి, పరిశ్రమాభావముచేత, ధనార్జనము లేక బీదరికము ననుభవించవలసివస్తున్నది. కుంటువడిన ఈ ఆర్థికవిధానముకాక, సరియైన, సమర్థమైన ఆర్థికవిధానము నెలకొనవలెనంటే పారిశ్రామికాభివృద్ధి చాలా అవసరము.

పునరుద్ధరణప్రణాళికలలో దూరదృష్టి చాలా ఉండాలి. ముందు గవర్నమెంటులో ఉన్న లోట్లు సర్దుకోవాలి. పారిశ్రామికాభివృద్ధియేగాక, ఇంకా అనేకసమస్యలు పరిష్కరించుకోవలసిన అవసరము కూడా ఎంతో ఉన్నది. ప్రజాబాహుళ్యమునకు నిర్బంధవిద్యావిధానము కావాలి. సైనికశిక్షణ కావాలి. నిరుద్యోగసమస్య ఉండరాదు. ఉండడాని కిల్లూ, కట్టడానికి గుడ్డా, తినడానికి తిండీ ప్రతీపౌరుడికీ ఉండితీరాలి. ఉచితవైద్యసహాయము ప్రతిపౌరుడికీ లభించాలి. ఈ కనిష్ఠావశ్యకములు గుర్తించి ప్రభుత్వము తగినవిధంగా ప్రణాళికను నిర్మించవలె.

యుద్ధానంతర పునర్నిర్మాణమునకు ముఖ్యంగా మూడు ప్రణాళికలు సిద్ధముగా ఉన్నవి. అవి: బొంబాయి ప్రణాళిక, ప్రజాప్రణాళిక, గాంధీప్రణాళిక. ఈ మూడు ప్రణాళికల ఉద్దేశమూకూడా పై సమస్యలను ఎదుర్కొనడమే. వీనిలో బొంబాయి ప్రణాళిక టాటా, బిర్లా మొదలయిన పారిశ్రామికవేత్తలచే తయారుచేయబడింది. ఈ ప్రణాళిక పదిహేను ఏండ్లలో పూర్తి అయ్యేటట్లు ఏర్పాటుచేయబడింది. దీనికి కావలసిన మొత్తము పదివేలకోట్ల రూపాయిలు. ఈ మొత్తము సేకరించడానికి మార్గముకూడా ఈ ప్రణాళికలోనే సూచింపబడింది. దీన్ని అమలులో

పెట్టడమువల్ల ప్రజల సగటు ఆదాయం రెట్టింపు అవుతుందని ఈ ప్రముఖుల అభిప్రాయము. కాని, కేవల పారిశ్రామిక వేత్తలచే రచింపబడుటచే, మన దేశానికి మూలకందమైన వ్యవసాయమున కంతగా ప్రాముఖ్యమిం దివ్వబడలేదు ప్రజాప్రణాళిక రాడికల్ డెమాక్రెటిక్ పార్టీచే తయారుచేయబడింది. ఇదికూడా పదిసంవత్సరాలలో పదివేల కోట్లు ఖర్చుపెట్టి, ప్రజాజీవితాన్ని సౌభాగ్యవంతము చేయడానికే సంకల్పించింది. ఈ ప్రణాళిక ముఖ్యమైన పరిశ్రమలన్నీ ప్రభుత్వస్వాధీనములో ఉండాలనీ, పరిశ్రమలవల్ల వచ్చే లాభాలు అనుభవించనీయకూడదనీ ఆశించి నిర్మాణము చేయబడింది. వ్యవసాయవిషయములో వచ్చే సమస్యలన్నీ యేవిధంగా ఎదుర్కోవాలో, భూమివిషయంలో ప్రభుత్వం ఏ విధంగా చట్టాలుచేయాలో మొదలయిన విషయాలన్నీ సమగ్రంగా నిరూపింపబడినవి.

గాంధీ ప్రణాళికలో గృహపరిశ్రమలకు ప్రముఖమైన స్థాన మివ్వబడింది. ఇతర దేశాల్లోవలె యంత్ర పరిశ్రమలు విపరీతంగా వృద్ధిచేసి, వాటి మార్కెట్టుల కోసం ఇతర దేశాలతో పోటీలకూ, పోరాటాలకూ దిగకూడదనీ, ఈ యంత్రపరిశ్రమలవల్ల చాలామందికి నిరుద్యోగం వస్తుందనీ, కాబట్టి గృహపరిశ్రమలకు ఎక్కువ ప్రాముఖ్యము ఇవ్వాలనీ ఈ ప్రణాళిక పరమాశయం. దీని బడ్జెటు 3700 కోట్ల రూపాయిలు. ఈ అంచనా చాలా తక్కువగా వేయబడిందని నా అభిప్రాయము.

మొత్తముమీద అన్ని ప్రణాళికలూ ఉద్ఘాటిస్తున్న విషయము స్వపరిపాలన కావాలని. అది లేనిదే యే ప్రణాళికాకూడా అమలులో పెట్టలేము. ఇవిగాక, ఈలోగా, ప్రభుత్వము తరఫున మరికొన్ని ప్రణాళికలు తయారుచేయబడినవి. ఇవి సరిగ్గా ప్రజాభిప్రాయము తీసికొనకుండా తయారుచేయడమేగాక, వీటిలో సరియైన ఐక్యతకూడా లేదు. అప్పుడే బట్టల మిల్లులు మొదలైన యంత్రాలకూ ఇంకా యితరసామగ్రికీ విదేశాలకు ఆర్డర్లిస్తున్నారు. ఎన్నెన్నో సరకులు కొనడానికి ఏర్పాట్లు చేస్తున్నారు. ఈసమయంలో ప్రజాప్రభుత్వం ఏర్పడి, ఈపనులు ఎంత వేగంగా చేయిస్తే అంతమంచిది.

ఎన్నిమాటలు చెప్పినా, ఎంత సదుద్దేశముతో ఉన్నా ఒక దేశము మరియొక దేశాభ్యుదయానికి పూర్తిగా తోడ్పడలేదు. అనుమానానికీ, భీతికీ కారణమైన విదేశప్రభుత్వాలు మనకు ఏమి చేయగలవు? స్వపరిపాలన సిద్ధించాలి, ఇటువంటి సమస్యలన్నీ పరిష్కరింపబడాలి. అంతే.



# నీ ది కా దు, నా ది

= శ్రీ కె. అన్నమరాజశర్మ =

చెలువమొలికించు ప్రత్యూషశ్రీకుమారి-కుందమాలిక కంఠానఁ గూర్చెననఁగ,
హిమగిరీంద్రాభిముఖముగా నేఁగుచుండె-నంచపిండు వినీలవిహాయసమున.

నడిమింట న్వాడిఁ బాఱు పత్త్రిరథసంతానంబుపై లక్ష్య మే
ర్పడ నేలంబడవైచె నొక్క శకునిం, బాణాహతిం దేవద
త్తుఁడు సిద్ధార్థసగోత్రజాతుఁడు, దయాధారుండు హా స్థాన వెం
బడి తాఁ బట్టఁగఁబోయె నయ్యొ! భయకంపన్ రక్తసిక్తచ్ఛదన్.

సుమముల్ ప్రొద్దుట నేల రాలిపడినన్ శోకించి, శోషిల్లు గా
తముఁ డేరీతి సహించు! నీ విహగసంతాపంబు, కోపాతిరే
కమొ, హింసాప్రతిరుద్ధమానకరుణాగంగాసముత్తుంగభం
గమొ! నిగ్గారు కపోలపాళి నొలుకం గన్నీరుమున్నీరుగన్.

పదపంకేజసమీపపాతితము నా పక్షి న్విలోకించి, త
చ్ఛదముల్ చక్కఁగ నొత్తి, శాక్యజుఁడు విశ్వప్రేమ జృంభింపఁగా
మృదుహస్తంబుల రక్తముం దుడిచి, సంప్రీతి న్జివుల్లొత్తి, నె
మ్మదిమై గాయము బూడ్చుచుండె; జినధర్మం బాత్మవ ద్దృశ్యమే!

దేవదత్తుఁడు జ్ఞాతివిద్వేషభరిత-చిత్తుఁడై "దీని నేలఁ గూల్చినది నేను;
సోదరా! రాజహంసంబు నాదె యగును-ఇ"మ్మన సుగతుఁ డిట్లు వాదింపఁదొడఁగె.

"తావకీనకఠోరహింసావిధాన-మడ్డగించుటచే నాది న్యాయమగునొ,
ప్రాణనిర్వాపణేచ్ఛకుఁ బాలువడిన-నీదె న్యాయంబొ, విబుధులం దెలిసికొనుము.
జీవహింసారతి విలాసచేష్టయేని,-మానవత్వంబె మొదలంట మంటఁగలియు;
అది యెటులైన వికిరంబు నీయఁజాల-వలసెదో, మచ్ఛరీరంబు బలిగఁ గొనుము"

అనుచు వాదోపవాదప్రయత్నవృత్తి-ధర్మపరిషన్మహానికేతనముఁ జొరఁగ
సర్వధర్మమర్మజ్ఞనిష్ణాత యొకఁడు-"ఆత్మరక్షణ సమధికన్యాయ" మనియె.

# సకృద్ధాత

[నాటిక]

= శ్రీ బెల్లంకొండ చంద్రమౌళిశాస్త్రి =

## ప్రథమ దృశ్యము

[ద్వైపాయనహ్రదసవిధమున రాజరాజు, సంజయుడు నిలబడియుందురు. వేళ మధ్యాహ్నోత్పూర్వము.]

రాజరాజు—మా నాన్నగారితో చెప్పుము. ఇట్లని,—

సంజయుడు—చిత్తము.

రాజరాజు—వెళ్లుము...ఇదిగో సంజయా!... ఏమని చెప్పెదవు ?

సంజయుడు—సార్వభౌమా ! అట్లు సెలవిత్తురేమి! తమ ఆనతిప్రకారము మనవిజేసెదను తండ్రిగారితో.

రాజరాజు — మాట్లాడకుము... సార్వభౌమా! ...సార్వభౌమా అనుచున్నావా!!...ఎవరు ఇక్కడ సార్వభౌములు ?—నేనా సామ్రాట్టును ? — నేను గాను...నా ఒక్క శరీరము విశ్రమించుటకు భూమి లేదు ! నేనేమి సార్వభౌముడను !!—నేను కాను...

సంజయుడు—దుర్దశ!......మీముఖతః అటువంటి అశ్లీలములు వినలేను, ప్రభూ అనకుడు.

రాజరాజు—సరియే. పొమ్ము. మా నాన్నగారితో చెప్పుము. ఏకాదశాక్షౌహిణీపతి ఒక్కడే హతశేషుడు అని....పొమ్ము. సంజయా, పొమ్ము...

సంజయుడు—మహాప్రభూ! కాళ్లాడుట లేదు నాకు పోవుటకు...ఆహా!!... చి...వ...ర...కు...

రాజరాజు — నాకోసము నీవేడ్చెదవేమి సంజయా! నాకొఱ కేడ్చువారును గలరా ఈప్రపంచమున!...ఏడువకుము...మానాన్నగారికి నీవు కన్నులు. నీవే ఏడ్చిన మానాన్నగారికి కన్నులు పోవా! ఐనను ఇప్పు డేమి మించిపోయినది!... బ్రతికియున్నచో... సరియే వెళ్లుము. నీవు చాలసేపైనది వచ్చి.

దాయాదుల్ సుఖులై ససైనికముగా
దర్పించియున్నారు—నే
నో! యావచ్ఛిథిలీకృతుండనయి ఖి
న్నుండౌచు నుంటిన్, ఇకన్
నా యీదేహము శత్రుహస్తగతముల్
గాకుండగా జూతు పో
వోయీ! భారతదేశభాగ్య మెటులో
యూహింతులే సంజయా!

ప్రస్తుతము ఈ ద్వైపాయన హ్రదమే నాకు మణిభవనము. మా నాన్నగారితో చెప్పవలెను సుమీ ఈసంగతి...ఇక నీహ్రదమున ప్రవేశించి జలస్తంభన జేసికొనెదను...నీవు వెళ్లవచ్చును...

సంజయుడు—చిత్తము.

రాజరాజు— -ఇంకేమి చిత్తమోయి ! నాకు చిత్తము, విత్తము నశించి ఎంతకాలమైనది!...నేను చెప్పిన మాట జ్ఞాపకమున్నదా?

సంజయుడు—చిత్తము.

రాజరాజు- ఇదెక్కడి వ్యర్థపదమోయి మాటల కడ్డముగా! నిన్నిక్కడనుండి దయచేయుమనినాను,...మతిలేక చిత్తము చిత్తమనెదవేమోయి!! ఈ మాటలకు పొంగు గడియ లంతరించినవి.

సంజయుడు—వెళ్లుచున్నాను ప్రభూ!...... సెలవిప్పించవలె.

రాజరాజు—ఊఁ...మంచిది.

(సంజయుడు నిష్క్రమించును. తెరపడగానే రాజరాజు మడుగులో ప్రవేశించిన ధ్వని యగును)

ద్వితీయదృశ్యము

[నెత్తురులోడుచున్న గాయములతో, నూగుమ తూగుచు రథికత్రయము మార్గము వెంట నడచుచుందురు. వేళ మధ్యాహ్నోత్తరము]

అశ్వత్థామ—మామా, అటు చూడుము!...అ వెళునది సంజయుడా!...మామా! అటుగాదు. ఇటు. ఇటు, చూచినావా? తలవంచుకుని నింపాదిగా నడచుచున్నాడు...సంజయుడే!...పిలువనా మామా!

కృపాచార్యులు- సంజయుడే.—పిలువుము. మనమును రెండడుగు లశే వేయుదము. (నడతురు.)

అశ్వత్థామ సంజయా...సంజయా...సంజయా. ఇటు-ఇటు. ఆఁ...చూచినాడు. వచ్చుచున్నాడు.

కృతవర్మ—అదుగో! మాటలో వచ్చినాడు సంజయుడు.

(సంజయప్రవేశము.)

సంజయుడు—ఆచార్యులకు, గురుపుత్రులకు, కృతవర్మగారికి నమస్కారములు.

కృపాచార్యులు—దీర్ఘాయుష్యమస్తు.

సంజయుడు—ఎందుకు దీర్ఘాయుస్సు! వ్యాస భగవానుడు నా నెత్తిన బెట్టినాడు భారతకథకత్వము. విసుగు పుట్టుచున్నది...చివరకు నానోటితోనే ...ఈ-వి-షా-దాంత...మును వినిపించు యోగము...పట్టినది.

కృపాచార్యులు—అవునవును. రాజరా జెక్కడ?...ఎక్కడినుండి నీరాక?

సంజయుడు — రాజరాజుగారి సమక్షము

కృపాచార్యులు—ఆఁ! రాజరా జెక్కడ ఉన్నాడు? క్షేమమే నా? ఎంత శుభవార్త నందించినావు సంజయా! రాజరాజువద్దర ఇంకెవరెవరున్నారు?

సంజయుడు—ఏకాదశాక్షౌహిణీపతి ఏకాకి; ఇది ఆ మహారాజు స్వయముగా అనిన నీరవవాక్కు! ...ఆయనకు మతి స్థిమితముగా లేదు. అనిన మాటనే పదిసారు లనును. ఆ వాగ్ధోరణి జూచిన...అహ్హో!... సర్వభారత చక్రవర్తి...కాలచక్రమున కాకు కదలినది...ఆ ప్రభువును తలచుకొన్న దుఃఖము వచ్చుచున్నది.

అశ్వత్థామ- -మేము సజీవులమై యుంటిమని తెలియదా రాజరాజునకు?

సంజయుడు- -తెలియదుగాబోలు! మీ ప్రస్తావనమే తేలేదు. నే నక్కడనున్న క్షణమును వెళ్లుము వెళ్లుమని తరిమినాడు...ఆయనగా రను మాటలకు పూర్వాపరసందర్భసమన్వయమే లేదు. ఎంతటి రాజఠీవిగా, ఎంత చతురముగా, ఎటువంటి పాండిత్య స్ఫోరకముగా మాటలాడువాడు సార్వభౌముడు! తుదకు...ఈ విధముగా...

కృతవర్మ—అగును. పుంజీభవించిన రాజకీయ కళామూర్తి యతడు. ఇట్టి ఉదాత్తుని నొసట క్షుద్రరేఖలుకూడను తీర్చినాడు కాబోలు విధాతృడు...మతి స్థిమితముగా లేదనినావు చక్రవర్తికి. శరీరమైనను స్వాస్థ్యముగ నున్నదా?

సంజయుడు—స్వస్థత! అది యూహించుటకైన లేదు. పూచిన మోదుగువలె నున్నది రాజరాజు దేహము!

కృతవర్మ—అబ్బ!! రామరామ...ఆగుము ఆగుము సంజయా, ఆగుము.



# సౌందర్యము యొక్క రెండు తరాలు

వారిద్దరికి 20 సంవత్సరములు తేడా: గాని, ఆ తల్లియొక్క సౌందర్యము, పదహారు సంవత్సరముల వయస్సుగల కుమార్తెకువలె వున్నది. తల్లి తన చిన్నతనమునుంచి—తన తల్లియొక్క సలహాను పొంది—చర్మ సౌందర్యమును, పియర్సు సబ్బుతోను నిర్మలమైన నీటితోను కాపాడుకొను చున్నది. ఈ రోజున సౌందర్యవతియగు తన కుమార్తె ఇదే చేస్తోంది. గాన ఆమె శరీర కాంతి, తన తల్లి శరీర కాంతివలె వుండును.

ఇండియాలో నలభై సంవత్సరములనుంచి అందమైన స్త్రీలు ప్రత్యేకముగా పియర్సునే వాడు చున్నారు. దీని పరిమళము, మృదువైన నురుగు దీనికి సబ్బులలో ప్రాముఖ్యత నిచ్చినవి.




## పియర్సు సబ్బు

శాశ్వతముగా సౌందర్యమును కాపాడుటకు

TG. 38-172 TL

A. & F. PEARS, ISLEWORTH, ENGLAND

కృపాచార్యులు — ఇంతకు పరిణామసూత్రము అసాధ్యప్రతిభగలది!

నీచజను డుచ్చస్థితిలోకి నెగడు నెడల
క్రిందుమీదులు జూడ డేకృతియొగాని!
ఉత్తము డధఃపతనము నొందెనేని
అతనికిని-లోకమునకును బ్రతుకు గలచు!

సంజయా, రాజరా జెక్కడ నున్నది సవిస్తరముగా చెప్పవూ?

సంజయుడు — పరపక్షము దర్పించియున్నదనియు, స్వపక్షమున శిథిలశేషముగా తా నుంటిననియు, ఈ ఖేదదశలోగూడను తన శరీరము శత్రుహస్తగతము గానీయననియు, ద్వైపాయనహ్రదమే ప్రస్తుత రాజప్రాసాదమనియు మహారా జనిన మాట లివి!

కృతవర్మ — విధి ఎంత బలవత్తరమైనది! అఖండ భరతఖండనేతను ఎక్కడినుండి ఎక్కడి కీడ్చి తెచ్చినది! జలహర్మ్యమా!!—ఎంత రసహృదయుడవోయి దుర్యోధనా!!

త్థామ— అవును. జలస్తంభనవిద్యాపరిశ్రమ సుష్టుగా జేసినా డతడు. మా తండ్రిగారుసైతము అనువారు సుయోధనుడు జలస్తంభనకళాకుశలు డనియు, గదాకదనప్రవీణుడనియును. సకలసంపదలను హరించిన శాత్రవులు నీవిద్యాసంపత్తును కదలించలేకపోయినారా చక్రవర్తీ! అది ఎవరి సొత్తు హరించుటకు! నీ కష్టార్జితము!!

కృపాచార్యులు సంజయా, పద, వెళ్లుదము, రాజదర్శనమునకు.

సంజయుడు—చిత్తము...ఇటు -ఇటు దయచేయుడు. (పరిక్రమింతురు)

కృపాచార్యులు—ఆగుము సంజయా, ఆగుము. ఆ కలకల మేమో కొంచె మాలకింపుము.

సంజయుడు—ఆఁ!... అవును...అదిగో...ఆ కంఠధ్వని...భీమసేను ని ది వలె నున్నదే!--కొంచెము జాగ్రత్తగా వినుడు...కృష్ణార్జునుల గొంతుకలు కావూ అవి! ... ఆగుడు...ఆఁ... ఇక సందేహము లేదు, ఆ వచ్చునది ధర్మరాజాదులే!!

త్థామ--ధర్మరాజుగూడ నున్నా డందువా ఆ వచ్చువారిలో?

సంజయుడు--ఏమో తెలియుటలేదు. ఆయనను మితభాషి యందురు! ఉండిన నుండును. ఏమి?

కృపాచార్యులు—తప్పుకొందము. ఈ స్థితిలో అగుపడగూడదు వారికి, రాజరాజును సందర్శించనిదే!

సంజయుడు—చిత్తము.

కృపాచార్యులు—సరియే. నీవును మా వెంట రమ్ము. మన శిబిరములకు వెళ్లుదము. (నిష్క్రమణము. తెర.)

## తృతీయ దృశ్యము

[దాస దాసీజనముతో కురుకాంతాసముదాయము ముసుగులతో వత్తురు. యుయుత్సుని పురబహిఃప్రదేశమున కభిముఖముగా వచ్చి విదురుడు కలిసికొనును.]

విదురుడు యుయుత్సుకుమారా! నీ యీ వాలక మేమి!! కాంతాజనము నెందుకు తీసికొని వచ్చుచున్నావు?...యుద్ధవార్త లెట్లున్నవి?

యుయుత్సుడు—విదురా, వార్తలేమున్నవి! పూర్తియైనది యుద్ధము.

విదురుడు—ఎట్లు!! చెప్పుము కుమారా! ఏ పక్షమునకు జయము?

యుయుత్సుడు—చూచుచు నడిగెద వెందులకు? ఏ పక్షమునకు జయసిద్ధి గలిగిన నే నీవైఖరితో వత్తును? ఈ కాంతాసముదాయముతో!

విదురుడు—......శల్యుడు??

యుయుత్సుడు—శల్యుని శల్యములు కూడ నస లేవు ఈ దినమున!

విదురుడు—రాజరాజు ? సైన్యము ?

యుయుత్సుడు—పేరు పేరు వరుసల నే నిప్పుడు చెప్పలేను—మనోదార్ఢ్యము కొఱవడుచున్నది. రాజరాజు మాత్రము అష్టమంగళిని దిగి రణవేదినుండి పలాయనుడైనాడు.

విదురుడు—సైన్యమంతయు నెక్కడికి పోయినది? అతిరథులు—మహారథులు అందరును??

యుయుత్సుడు—తమ అంతిమరక్త బిందువులను కురుక్షేత్రమునకు ధీరగంధముగా నిడి త్యాగశీలురై మహాప్రస్థానము జేసినారు వీరాధివీరు లందరును.

విదురుడు— ఆగుము, కుమారా, ఆగుము. ఎంత విపర్యాసమైనది!...హృదయదహన దక్షమైన ఎంతటి నరకవార్త!...భవిష్యద్భారతావనికి వారు దేవతలుగా పరిగణింపబడరా తండ్రీ!!...ఎంత నాశన కర్మము జరిగినది! శివ శివా!—నేను ప్రథమము నుండియు నెత్తిన నోరుబెట్టుకొని చెప్పుచునే వచ్చితినిగదా! యుద్ధము సర్వనాశకక్రతువని,...మహాభారతహృదయ మెంత సంక్షుభితమైనది!!—ఈ మానవతుల నిట్లు ఇంటికి జేర్చి ఎంత మంచిపని జేసితివి!... వీరి నంపువిషయమున ధర్మజాదు లేమైన నడ్డుజెప్పినారా

యుయుత్సుడు— నేను ధర్మరాజునే అడిగినాను. అతడు శ్రీకృష్ణు నడిగి "సరియే. మంచిది. తోడ్కొనిపోదగును" అని అనుమతించినాడు. తీసికొనివచ్చితిని.

విదురుడు—కడు దొడ్డకార్య మిది కుమారా! సమయమునకు మంచి ఊహ గలిగినది నీకు; కాని ఈ వార్త ముసలిరాజునకు తెలియజేయగూడదు మనము. ఎందుచేతననగా: మొదటినుండియు యుద్ధవిశేషములు ఎప్పటికప్పుడు సంజయుడే వినిపించుచుండుట పరిపాటి. ఈనాటి కథనుగూడ నతడే చెప్పును. ఇంకొక రహస్యము. ఈవార్త పట్టణమున నెవరివలననైనను సరియే ప్రవేశించకుండ నుండునట్లు చూడవలెను.

రాజకీయరథంపు చక్రద్వయమున
వార్త యొక్కడు—దాని సద్వ్యాప్తిగాని
సంగ్రహముగాని వలయు నాసమయములను;—
అర్థహీనము వార్త లం చనును జడుడు!

అందుచేత వార్తలను తృణీకరించరాదు. తరువాత: రాజపత్నీ జనమును, వారి సేవికలను తీసికొనిపోయి అంతిపురమున ప్రవేశపెట్టుము. తదితరులను బహుజాగ్రత్తగా నా యా స్థలముల నిమంత్రించుము. నేను వృద్ధరాజుసభాగృహద్వారమున ఈ ధ్వని మ్రోగకుండునట్లు అందుకు సమర్థులను జూచి ఉంచి అభ్యంతరమునకు వెళ్లెదను. ఇక్కడ నింకను కాలహరణ మెందులకు? (నిష్క్రమణము. తెర)

## చతుర్థ దృశ్యము

[హ్రదసమీపమునకు దీనముగా రథికత్రికమును, సంజయుడును వత్తురు]

కృపాచార్యులు — సంజయా, అదియే నా ద్వైపాయనహ్రదము?

సంజయుడు—చిత్తము, అదియే.

ద్రౌణి- మామా, రాజరాజును ఏమని మాట్లాడించవలెను! ఊహ అనునదియే తోచకుండ నేదో అయోమయముగా నున్నది మనస్సు, చక్రవర్తి ఈ పరిణామము చూచుసరికి!!

కృపాచార్యులు—అవును. కార్యకారణ సంబంధము లటువంటివి. మన మేమి చేయగలము! మనము జీవనలోభులమై శరీరము దాచుకొని స్వామిద్రోహులము కావద్దు. అంతకన్న మన మేమి చేయగలము!!

(నడచి, మడుగుదరినే నుంచుని, వంగి లోనికి జూచుచు మాట్లాడుదురు. మడుగులోనుండి దూరమునకు అస్పష్టముగా వినబడును రాజరాజుమాటలు)

కృపాచార్యులు—దుర్యోధనచక్రవర్తీ. దుర్యోధనచక్రవర్తీ...ఆఁ, నేను కృపుడను. రాజదర్శనార్థము వచ్చితిమి. అశ్వత్థామ, కృతవర్మగారు, సంజయుడును

వచ్చినారు...అదేమి అట్లనెదవు! నిన్ను జూచుటకే వచ్చితిమి. నీ వింకను చక్రవర్తివే మాదృష్టిలో...మే మున్నంతవరకు నీవు విచారపడనక్కఱలేదు...వద్దు. నీ నోటివెంట ఆ నీరసవాక్కు...వద్దు ప్రభూ, భరించ లేను...ఊఁ, అందుకే వచ్చితిమి మేము ముగ్గురమూ. నీవును...అదియే నీ వనగూడదు...గెలువ మనే అధీర ముగా మాట్లాడెద వేమి రాజరాజా! అథవా గెలువ మనియే అనుము. పదకొండు అక్షౌహిణుల బలగము నేమి చేసికొనినాము!

రాజ్యము వీరభోజ్యమని
రంజితరాజ కిరీటరత్న సం
పూజ్య పదద్వయీ సతత
భోగసమగ్రకురుప్రభూ! బుధ
ప్రాజ్యవచస్సు నీ కెరుగ
రాదొ! జయాఽజయపక్షలాభసుల్
త్యాజ్యము గావు రెండును, స్వ
తంత్రపురాజ్యము స్వర్గరాజ్యముల్.

అవును. నీకు తెలియును. ఎందు కిట్లు బాధ... ప-డు-ట...

అశ్వత్థామ—రాజరాజా, నేను గురుపుత్రుడను. అశ్వత్థామను.—ఎరుగుదువుగదా నన్ను...ఆఁ?... ఏమని?...మేముగూడ నలిగిడిగానున్నట్లు తోచు చున్నామా? ఈ బడలిక నేడు పోవునదిగాదు. శాంతి వచ్చినని డది పోవును...నీ మనస్సూ — శరీరమూ చీకాకుగా నున్నవా!...నాకు తెలియును...ఆఁ?... నా కీమాట నచ్చలేదు. అనుజీవులు లేరు అను మాట నీ వనవద్దు. మే మెవరము?...సరియే...

చావునకు రెండు చావులు లేవు రాజ
రాజ!—స్వార్థప్రయాణసౌలభ్య మెంచి
ప్రభుఋణంబున బోను,—దేవతలు మెచ్చ
భారతములోని త్యాగసంపత్తి విలుతు!!

ఆఁ? నేడే మించిపోయినదిమాత్ర మేమున్నది? సరే. అనుమానము మాత్రము నీవు పెట్టుకొన వద్దు.

కృతవర్మ—దుర్యోధనా!...నేను కృతవర్మ నోయి!...నీ యీ దైన్యస్థితి జూచుటకు బ్రతికియుండి వచ్చితిని...దర్శనము కాదా నాయనా?...నిన్ను ఇంతకన్న నిర్బంధించవలసిన ఘట్టము కాదిది... ఆఁ...కృపాచార్య గురుకుమారుల నిశ్చయము వింటివి గదా! వారిలో నే నొకడను...సరే...సరియే...వెళ్లి వత్తును.

సంజయుడు—ఆచార్యస్వామీ! ఎటు తిరిగి నను ప్రొద్దెదురేనన్నట్లు కానికాలమున అంతయు వింతలే జరుగును...అదిగో. అటు జూడుడు. పా ర ముగా, ఆ ప్రళయమేఘపటలము లేమి!!...అవి విమతయూధజైత్రయాత్రాసంరంభములు లేమో!— ఇంకను ఆ మాత్ర ముద్ధతముగా భారతదేశమున వచ్చు వా,రెవరున్నారు? పాండుపుత్రులుగాక!...అన్నట్లు మన మొక సంగతి నిర్లక్ష్యముజేసి మన ధోరణిలోనే మనమున్నాము. ఇంతకుమునుపు మాంసపుమోపులతో వచ్చి ఇక్కడ నీళ్లు త్రాగిపోయిన బోయ లెవరో మనము అనుకొననేలేదు...గుప్తచారు లైన గావ చ్చును.

అశ్వత్థామ—ఒక వేళ నౌననుకొందము. ఐన నేమి?...వారు వెళ్లి చెప్పిరందువా మన భాషణా దికమును?

కృపాచార్యులు—కావచ్చును. అదియు గాద నుటకు వీలులేదు.

అశ్వత్థామ— చెప్పనిమ్ము. చెప్పినందువల్ల నేమియు భయములేదు. నీవన్నట్లు బహుశః చెప్పియే యుందురు...లేకున్న ఆసమాజ మిటెందుకువచ్చును! ఇప్పుడు,...మామా, కాలజీమూతమువలె అంతకంతకు సైన్యరయసముద్ధూతధూళి పడగవిప్పుకుని పైకివచ్చు చున్నది...మామా, కొంచెము సావధానముగ వినుము ...కోలాహలముగూడ వినవచ్చుచున్నది.

కృపాచార్యులు—రాజరాజా-రాజరాజా. ఆఁ— నేనే. కృపుడను. సెలవుతీసికొనుటకు వచ్చినాము... రాజా, ప్రకృతము ఒక విచికిత్స వచ్చినది. పాండ

వులు ససైనికులై ఇటే వచ్చుచున్నారు...చతురంగ గమనమువలన రేగిన దుమ్మును, మ్రోగెడు కలకలమ్మును మనకు బహుసమీపస్థములైనవి...ఇప్పుడు సమ్ముఖీను లమై సమిత్తునకు పురోగమించుటా?—ప్రకృతము నీ మనస్సు సమరాభిముఖము గాక. ఇప్పటి కెట్లో ఈ విధముగనే యుండి, పర్యాయమున నీ ఆజ్ఞ పొందిన సమయమునకు మరల మేము వచ్చుటా?...ఆఁ? ఇప్పు డుత్సాహముగా లేదూ మనస్సు!!...సరే...సరే... ఇక సెలవు...అవునవును...నిజమే...ఆఁ?...ఏమో ప్రస్ఫుటముగా తెలియలేదు నీవన్నమాట—ఆఁ... ఆహాఁ!...నాకేమియు భయము లేదు, మీరు జాగ్ర త్తగా వెళ్లుడనియా!...చిత్తము...

అశ్వద్థామ—మామా, రాజరాజుస్థితి ఎట్టి విష మమునకు వచ్చినది!!

సంజయుడు—ఆచార్యవర్యా! మీరు ముప్వు రును కనులవెంట నీరు పెట్టుకొనిన ఎట్లు! ఔను. చిర కాలపరిచయము—స్వామిభక్తి అట్టులే చేయును. కాని ఇప్పుడు మనను మనమే ఓదార్చుకొనవలసినవారము. రాజాజ్ఞ ప్రకారము ఇక మన మిట నిలువరాదు. నే నీ కుంజాంతరమున నిల్చుండి ఏమి జరుగునో చూచి వత్తును.

(కృప, కృతవర్మ, శ్వద్థామలు నిష్క్రమిం తురు. తెరపడును.)

## పంచమ దృశ్యము

[ పాండవపంచకము, శ్రీకృష్ణుడు, మరికొందరు మడుగుదరినే నిల్చియుందురు ]

కృష్ణుడు—భీముడు బావా, బిగ్గరగా నవ్వ కోయి! నీవు నవ్విన నాకు భయము వేయును! వెనుకటి కథ జ్ఞాపకమువచ్చి!!

ధర్మరాజు—బావా, బావా! ఇదే హ్రదము. ఈమడుగులోనే భారతకిరీట మున్నది ప్రస్తుతము!... నీ వన్నమాట నిజమే. మా భీముడు నవ్విన రాజరాజు వినగల డేమో నని నాకును...

కృష్ణుడు—దాయాదిని ఇక్కడను కొంచెము విశ్రామ మనుభవించనీయరా యేమి!

ధర్మరాజు—విశ్రాంతి! దురభిమానమున కేనా డతడు తలవంచెనో ఆనాడే విశ్రామ మతని పరిసరము లలోగూడ లేకుండబోయినది!

కృష్ణుడు— పెదబావగారు ఏమో యనుకొం టిని! నిశితవిశిఖములట్లు మర్మఘాతవాక్కులు విడచు చున్నారే! బావా! రాజరాజు వి న గ ల డు సు...

ధర్మరాజు—విననిమ్ము. వినుటకే అనినది! అత డనుకొన్న కథ అడ్డముతిరిగినది. నే డీమడుగునొడిలో నొదిగినాడు. సముద్రతృణన్యాయముగా. ఇది వ్యర్థ ప్రయత్నము. తొడిమయూడిన పండు ఆకులలో నెంతకాలము నిలుచును!!

కృష్ణుడు— (జనాంతికముగా) సరే. నీ వన్న మాటలన్నియు యథార్థములే! ఇప్పుడు ధర్మపన్నాగ ములతో గాదు కర్తవ్యము. వజ్రము వజ్రముచేతవలె. అవినీతి నవినీతివలననే ... ఎరుగుదువుగదా సమయ ధర్మము! ఇప్పుడారాజనీతిని సక్రమముగా వినియో గించుకొనవలెను నీవు. అంతే ... గాని...దానికి దృష్టాంతములు కావలెనన్న చూపుదును. ఒక్కటే మాటలో చెప్పవలసివచ్చిన ఇప్పటివరకు జరిగిన అన్ని యుద్ధములలోను తంత్రనిర్వహణమున మాయకు మాయ యే ప్రయోగింపబడినది.

ధర్మరాజు—(మడుగులోనికి వంగి బిగ్గరగా) యోధనా! దుర్యోధనా!...దుర్యోధనా...దుర్యో ధనా!...నేను యుధిష్ఠిరుడను...ఆఁ? దర్శన మిప్పించ వలెను...ఎంతసే పట్టు బిగబట్టుకొనెదవోయీ ప్రాణ ములను!...ధురంధరమైనదిగదా నీ సామ్రాజ్యవాదము! వచ్చి మరల నొకయెత్తు వేయుము...అంతియేగాని వంశగౌరవమును మడుగున ద్రొక్కెదవా!...ఒకవేళ ప్రాణభయము ననుకొనినను, మృత్యువున కభేద్యస్థలము లున్నవని యెరుగుదువా?...సర్వసమర్థుడు అనిపించు కున్న నీవే ఈ హాస్యకర్మము చేయుదువా!!...అధి కారము గలవాడు క్రిందుమీదులు జూడక, స్వధర్మ

మునుగూడ పరిగణింపక సకలబాధలను బెట్టి, నేడదంతయు మరచిపోయినట్లు నటించగనే ఆ ఘోష గొట్టి, భూమిమీదను, స్వర్గముమీదను ఇతోధికవ్యథ పెట్టక ఎట్లు రక్షించును!... అతిఘోరముగా. తనుజులు—అనుజులు పోయినారు. నీకు హృదయమైన అంగరాజు, అటుపైన శకుని, దుశ్శాసనుడు వీరు ముగ్గురును భారతరాజ్యమున మాకు స్థానములేకుండజేసిన మంత్రివర్గము. ఈ స్థాయీసంఘమును చచ్చిపోయినది. కన్నులు చెదరు రక్తవాహిని పారినది! ఇవన్నియు జూచికూడ జనత నిందించుననియైన తలపక ఈ నీచకార్యమునకెట్లుద్యమించితివి!...వినుచుంటివా దుర్యోధనా?... ఈ భీరుభావమును మడుగునకే వదలి ఏకైకవీరుడవై వచ్చి యుద్ధసంకల్పమును పూరించి ఈ స్వల్పసమస్యను తేల్చికొనుము,...నీ అధీరతకు కారణము గోచరించుట లేదు నాకు!... ఎందులకు?... విజేతవైన ఆ సముద్రక్షితితలమున స్వకీయవిజయకీర్తుల నంకితము జేసికొని ఏకచ్ఛత్రాధిపతి వౌదువు. లేక, పరాభూతుడవైన యోధలాంఛనములతో రాజసికతపస్వివై వీరస్వర్గమున విహరింతువు!! వింటివా దుర్యోధనా?... ఈ పక్షుద్వయమున కన్యథాత్వము లేదు...అమ్మ!!! ...ఎంతకొట్టుకొనిన నూడిపడినదోయి నీ వాక్కు! ...ఆఁ? ఏమియో అనుచున్నావు?... కొంచెము బిగ్గరగా ననుము అనదలచుకున్నది! ఆఁ?... ప్రతిజీవి బ్రతుకుమీద తీపియుండునా? ఆఁ. ఉండును!!... ఇంకా...అవును ... ఇందనుకనుండి నేననినదేగదా మరల నీవిప్పుడేకరువుబెట్టునది?... ఆఁ! నీవు శ్రమదీర్చుకుండువరకు మేమును శ్రమదీర్చుకొని, మరల తమ సమక్షమునకు రావలెనా!! కార్యార్థికి శ్రమమేమిటి? నీయిష్టమైన నిప్పుడే ఉపక్రమించవచ్చును...ఆఁ! ఆఁ! ఏమిటోయి! ఎంతమాట!!... 'ఇంకెవరికొఱకు యుద్ధము చేయను? నీవే ఏలుకొమ్మనియా! అహో!! ఎంత సాహసవాక్యముబికినదోయి! నీవెరుగుదువా నీవిప్పుడీమాట ననుట? యుద్ధము సర్వలయకరమని ఇప్పుడు తెలిసికొనినావా అనుభవసిద్ధముగా! ఏమి లాభము నేడు?...ఆఁ? ఇక యుద్ధము చేయవూ?... ఏమి జేతువు? ... ఆఁ!...ఈ భూమినంతయు నాకు దానముగానిచ్చి, అడవులలోనికి వెళ్లి తపస్సు చేసుకొందువా!...దుర్యోధనా! దాత యెవరు? ప్రతిగ్రహీత యెవరు? మనలో!... మన వంశమున సకృద్దాతలు లేరిదివరలో! ఆవాంఛ నీయందు నేడు వెలువడినను ఎవరకై ఇచ్చెదవు దుర్యోధనా నీవు?...నీవే యివ్వదలచిన భారతదేశమున కింతటి విలయ మేలవచ్చును! నేడెవ్వరికైనను మిగిలినది రక్తాన్నమేగదా! మానవత్వమే మారణమై పోలేదా నీస్వార్థమున!!...ఇంటికి వచ్చి కృష్ణపరమాత్ముడు చేసిన హితవు రుచించకపోగా నతని బంధించుటా? నీవు...పోనిమ్ము. సకృద్దాతవే ఐ యివ్వదలచినను గతాధికారివిగదా నేడు?...నేడొక రిచ్చువారును, ఒకరు పుచ్చుకొనువారును లేరు; ఎవరి స్వత్వమును వారు వారి శక్తిసామర్థ్యములతోనే నిరూపించుకుందురు... ఆఁ? ఇక లాభము లేదు దుర్యోధనా! ఎందు కట్లు జలముల నొదిగియొదిగి బాధపడెదవు? ఏమి దుర్యోధనా! ఇదియా నీభయకారణము! మాలో నీచిత్తమువచ్చినవారి నొకరి నెన్నుకొనుము—తగిన పరికరములను ఏరికొనుము. ఆఁ!... సరియే. మంచిది! మాబావమఱదులకూ, మాకూ జడియమని యెవ్వరనినారు!! — దుర్యోధ నీకు ఇంకను సంశయముగా నున్న మాసోదరులలో నే యొక్కరిని గెలిచినను పునః యుద్ధము లేదు. నీవే సమ్రాట్టువు. ఇక బహిర్గతుడవు గావచ్చును...ఆఁ...సరియే...

(అందరూ కొంచెము ముందుకు నడతురు—తెర వ్రాలును)

## షష్ఠమ దృశ్యము

కృష్ణుడు- పెద్దబావా, కథను మరల పూర్వోతిపూర్వము జేయునట్లున్నావే!!

ధర్మరాజు—ఏమి?

కృష్ణుడు—ఏమా! మీ ఐదుగురిలో ఏయొక్కరతనితో గదాయుద్ధమునకు నిలబడినను నవ్వుబాట్ల

పని...అట్టిస్థితిలో నీ విచ్చిన్న మాట! మీ ప్రథమావస్థను స్మృతికి దెచ్చికొనుము!—శకుని జూదము—సర్వస్వార్పణము—తుద కిది పందెపుకయ్యమైనది...ఈమాత్రము విశేషమునకు ఇంతటి సంక్షోభ మెందులకు!- ఇప్పుడు నీవు వేసిన పాచికలో దుర్యోధనునంతటి గదాకౌశలము గలవాడు గాకున్నను, బలాఢ్యుడు గనుక భీముడుబావ పనికిరావచ్చును...ఐనను కంఠస్థపాండిత్యనితో శ్రుతపాండిత్యము గలవాడు జయించుట అల్పవిషయము గాదు...పక్షాంతరమున...

భీముడు—పాండిత్యములు, పక్షాంతరములు! నీ కెప్పుడును మేము తేలిక! గదాభ్యాసమున అతడంత ప్రవణుడేమి!!... మా మా సమరభ్రమణ వైఖరి...రానిమ్మ చూతువుగదా ఈ యుత్తర క్షణముననే!...అప్పుడు నీవే గొప్పవాడవని వైతాళిక తాళములు!!

కృష్ణుడు—అవును బావా! నీ వంతమాత్రపు వాడ వౌదువు! బకుడు—జరాసంధుడు—నీహస్తలాఘవమున...నే నెరుగనిదా!...అవును గాని...ఆనాటి రాజసభ...నీ...ప్రతి...జ్ఞ...

భీముడు—జ్ఞాపకమున్నవి... అడుగో మరచి పోవుకాలమువలె వచ్చుచున్నాడు ఉద్ధతుడై దుర్యోధన చక్రవర్తిగారు!!!

రాజరాజు — (ప్రవేశించి) ఇక రాదగును. మీలో ఎవరు వచ్చినను సరియే...యుధిష్ఠిరా, ఏదీ గద. ఒకటి ఇటు తెమ్ము.

ధర్మరాజు—ఇవిగో ఆయుధములు. నీ కభిమతమైనదానిని నిరభ్యంతరముగ నీవే తీసికొన వచ్చును.

రాజరాజు — ఈగద బాగుగనేయున్నది. వస్తువు నిమిత్తమాత్రము. సరియే. ఇంకెందుల కాలస్యము? రండు ఎవరు వచ్చెదరో!

భీముడు—నేనే వత్తును. నీ కొఱ కింకెవరో వచ్చు! టెందులకు?

రాజరాజు—నీవే నమ్మ .భీమన్నా! ఇది గదాయుద్ధము. ఆలోచించుకుని వచ్చుట...

భీముడు—అక్కఱలేదు. మాయకు వలసినంత ఆలోచనము న్యాయమున కక్కఱలేదు. ఏమి?

పాపము పుణ్యముగ మాటలేకుండను
మోసపుకుత్తుల ముంచుటగునో!
తడిలేని యెడదతో కుడిచి కూర్చుండక
నిండ్లకు నిప్పు పెట్టించు టగునో!
నీతి జాతులు లేక నిండుకొల్వున మమ్ము
మానభంగము జేసి మసలుటగునో!
రసికత్వ మెరుగని రాజ్యాశచే పొంగి
విషమును త్రాగగా బెట్టుటగునో!
అగున?—దేనికి యాలోచనమ్ము. నీవె
చెప్పుమోయి దేశద్రోహి! సిగ్గులేక
తగునునని మాటలాడగా దలచినావ!
ప్రేతముఖమును వైమక దాత వగుదొ!!

సకృద్దాతవట! నీ కీపేరు పెట్టినందుకు ఎన్నవలెను మా అన్నగారిని!!...నీవు ఆలోచించి ఆలోచించి చేసిన మహాకార్యములకు ఫలిత మిది; యుద్ధ మనిన నే మనుకొనినావు? ఖేలనమా! పాలనమా!!— యుద్ధము సర్వమారణహోమకర్మ — దానికి కర్తవు నీవు — తత్పరిసమాప్తపూర్ణాహుతిక్రియ నీ ప్రాణములతో—ఇది ముహూర్తము.

రాజరాజు—ఐనదా! ఆయాసము తీర్చుకొందువా కొంచెము తడవు!!

భీముడు—చిత్తము! రాజరాజుగారి ఆజ్ఞలు గాబోలు నివి!! కంఠగతప్రాణుడవైనను రాజసము చావలేదు ఇంకను నీకు!—ఆయాసము తీర్చుకొనవలెనా! చిత్తగించి దయచేయుడు తీర్చుకుందును.

(నిష్క్రమణము. అవనికావిక్షేపము)

# సత్యభామ

శ్రీ బొడ్డు బాపిరాజు

ప్రావృట్పయోదగర్జా-రావముల ప్రయాణభేరి ప్రస్తావించెన్
దేవరరణసన్నాహము-కావించెద నొక్కమనవి కాదన రనుచున్.

"ఇందరిలోన భామయెడనే యభిమానము మెండు కామినీ
బృందములో కుమారయదుపీరున" కందురు, మత్తపఃఫలం
బందినయట్టు లెంతు నపు డాకులవృద్ధుల మ్రోల; నిప్పు డీ
చందమునన్ నిజం బెరుగజాలుదు స్వామిదయావిశేషముల్.

చిన్నతనమ్మునందె వ్రజశేఖర! చేసిన సాహసమ్ములన్
గ్రన్నన గాథలుం గథలుగా మిము గన్న యశోద తెల్పుచో
కన్నుల నీరు మేన పులకల్ తులకింపగ విన్ననాడె యు
త్పన్నములయ్యె, దుర్జయ భవద్భుజశౌర్యము గాంచు కోరికల్.

అదవదమై బలమ్ము చెడి అంత మహేంద్రునివంటివాడు మీ
పదములు పట్టె వజ్రమును బట్టిన చేతను, నేటి కిట్లుగా
కదనము మీకు, నాకు చిరకాలమనోరథముల్, నిరంతరా
భ్యుదయము లెల్లలోకముల కొక్కతరిన్ సమకూడెలే హరీ!

ఎవ డారక్కసి దేవనాథు హడలెత్తించెన్, సరే, వాని వై
భవముల్ దోచిన దోచెబో; అదితిదేవమ్మన్ జగత్పూజ్య న
ట్లవమానించుట మేలె? ఆర్నెలల వ్యాయామమ్ము లమ్మమ్మ వ్రేల్
జెవిపోగుల్ గిలుబాడనా? ఇగను మంచీ చెడ్డ లేదా ప్రభూ!

అతిచిత్రం బిది క్షీరసాగరమునన్ హాలాహలంబట్లు ని
ర్మిత నానాభువనావనవ్రతుల కీమీకున్ క్షమారాశి భూ
సతి మాయక్కకు మున్ను ముద్దుకొడుకై జన్మించినాడంట, అ
ద్భుతచారిత్రు డతిప్రతాపు డెటు లీదుర్మార్గముల్ ద్రొక్కెనో!

ఖలు డమరారి దిగ్విజయగర్వితుడై తొలుకారు చంద్రవం
కల పదియారువేల నృపకన్యకలన్ చెరబట్టె నంచు నె
చ్చెలు లనుచుందు, రానుడివిశేషము చూడగవత్తు, పాప! మా
కులమణిదీపవల్లికలకున్ విడిపించెద పైడిసంకెలల్.

ఏటికి మోముదమ్మి వెలిగింతురు వెన్నెలనన్ననవ్వు నా
మాటకు—పారిజాతసుకుమారుల కేల రణప్రసంగముల్

పాటలు గావు వీణియలపై పలికింపగ వైరికోటి పో
రాటము లన్నచో; నని తలంతురొ చిత్తమునన్ యదూత్తమా!

ఎరుగకపోను మీమనసు లేను ముకుంద! మరందమొల్కు క్రొ
వ్విరిలతలన్ వసంతవనవీథులచే విహరింప మీకు, సం
గరములు వీరభోగ్యములుగాని విలాసములా? యటంచు నన్
మరపుల బుత్తురే, పిరికిమందులు పోయుట రాచబిడ్డకా!

అనుటయె కాదు, లేజవురుటాకులు గిల్లని చేత చిక్కటా
రిని ఝుళిపించి నిల్పగల రేమగవానినిగాని; కేకయేం
ద్రుని కయికమ్మ తొల్లి పతితో ననికిం జనదేమి? నేను మా
వనధరమూర్తితో నరిగివచ్చెద నాహవయజ్ఞవాటికిన్.

చెలువపు మేన క్రొంజెమట చిత్తడి యొత్తెద; కయ్యమందు మీ
రలసినవేళ పయ్యెదచెరంగుల చల్లని గాలి వీచి, మె
చ్చుల పురికొల్పెదన్; వలయుచో రథసారథినై విచిత్రవృ
త్తుల నడిపింతు గోకులవిధూ! సెలవైనను విల్లు బట్టెదన్.

ఇచ్చయెరింగి మీరు చదివించిన యా విలువిద్యలెల్ల వి
వ్వచ్చుడు తోడుగాగ బలభద్రులకే వినిపించిపోయె మే
లచ్చుపడంగ నాడబడుచైన సుభద్రయు, నా మెపోలికల్
వచ్చెను సత్యభామ కనరా చిరునవ్వుల రాజబంధువుల్.

ఏమి భయమ్ము వా డనగనేల జగం బది యెత్తివచ్చినన్;
స్వామిభుజాంతరమ్ము నవిచారముగా సుఖ మేలుకొందు, వ
ర్షామధురాంబువాహమును చారుతటిత్ప్రభవోలె శాత్రవ
స్తోమము గుండియల్ చెదరిచూడగ నొత్తుచు పాంచజన్యమున్.

ఈ కనుదమ్ములం దెరుపు లెంతకు చాలవు! పాలబొజ్జ ము
ల్లోకము నిల్పు మేటిదొరలుం బనిపూనుట దాసురాలి నీ
పోక కృతార్థ సేయుటకుబో, యదువంశకళానిధీ! నమో
వాకము; మీ దయల్ మరువవచ్చునె సత్యకు నెన్ని జన్మలన్.

అవలీలన్ నరకాసురున్ దునిమి, దేవాధీశు మన్నించి, మా
నవలోకమ్ముల దుఃఖవహ్నిశిఖలన్ జల్లార్చి, దిక్కుల్ జయా
రవముల్ మ్రోయగ పోయివచ్చెదము శీఘ్రం బింక నింటింట ను
త్సవముల్ గా వెలిగింతు రెల్లప్రజ లాత్మానందదీపావళుల్,

# బసవపురాణము : జయసింహుడు

## శ్రీ వేదము వేంకటరాయశాస్త్రి

బసవపురాణము చరిత్రపరిశోధకులకు గనివంటిది. మనవారు తేదులను, సంవత్సరములను లెక్క చేయక పోవుటచేతను, పలు దేశకాలములందలి విషయములను పురాణరీతిని వ్రాయుటచేతను మనకు కాలాను క్రమముగా విషయనిర్మాణమునకు పూర్వగ్రంథము లుపకరించుటలేదు. కాని శాసనాద్యాధారములచే కాలానుక్రమణిక నిర్మించుకొని పురాణాదుల విషయములను వానికి సమన్వయించి ద్రావిడకర్ణాటక వాఙ్మయచారిత్రాంతర్గత విషయములతో సరిచూచిన పలువిషయములు తెలియగలవు. ఈకవుల గ్రంథములలో వారికి తెలియకయే సమకాలిక రాజకీయ మత సాంఘికవిషయములును, తత్సంబంధిపదములునువచ్చుట చేతను, ఆపదములే వానికి సరివచ్చు శాసనములలో కానవచ్చుటచేతను నాటి దేశకాలపరిస్థితులు మన యూహకు వచ్చుట కవకాశము కలుగుచున్నది.

కేవలము వీరశైవ మతప్రచారమునకు రచితమైన యీ బసవపురాణమున చారిత్రిక విషయములు పెక్కులు కవియొక్క రచనాసందర్భముననూ, శైవుల మహిమస్థాపనకై చెప్పబడిన అద్భుత ప్రదర్శన కథనములచేతను కొంత రూపుమాసి అచారిత్రికముల వలె నేర్పడియున్నవి. బసవేశ్వరుని శాసన మేదియు కానరాదు. కాని ఆతని వంశమువారివి కలవు. బిజ్జలుడు చారిత్రిక పురుషుడే. మతప్రవర్తకులును చారిత్రికపురుషులే. ఈమహాగ్రంథమును సమగ్రముగా శాసన, ద్రవిడపురాణాదులతో సరిచూచిన చాల దేశోపకారమగును.

ఇందలి కథలలో జగదేకమల్లని కథయు, తేడరదాసయ్యకథయు పశ్చిమచాళుక్య చక్రవర్తి 'జగదేకమల్ల' జయసింహుని గూర్చినవి. ఈ తడు క్రీ. శ. ౧౦౧౫ మొదలు ౧౦౪౨ వఱకు కర్ణాటక సామ్రాజ్యమును పరిపాలించెను.

బసవపురాణమున చతుర్థాశ్వాసమున 'జగదేకమల్లని కథ' కలదు. (పుట ౧౧౩, ఆంధ్ర గ్రంథమాల ప్రతి)

"జగదేకమల్ల డసహ్యాభావమున...
గోవిందు ప్రతిమ యుక్కునను గావించి...
బోయించి కడు సాంగముగ బ్రతిష్ఠించి
పాయక రేయును బగలును గొలువ
శంకరదాసి యచ్చటి కేగుదెంచి
యంకకాడునుబోలె, హరభక్తు లలర
నటిముట్మొగవాడ దెఱచి వీక్షింప
బటియలై విష్ణుని ప్రతిమ నుగ్గుడు"

ఈకథ ననుసరించి జగదేకమల్లుడు వైష్ణవుడని తలంపరాదు. ఏలన బసవపురాణముననే రెండవమారు ప్రస్తావితుడైనపుడు ఈతడు జైనుడని స్పష్టముగా కలదు.

బసవపురాణము షష్ఠాశ్వాసమున తేడరదాసయ్యకథ కలదు (పుట ౧౮౧).

"మఱియును విను పొట్లచెఱు వను పురిని
వఱలంగ నేణ్ణూరు వసదులు గట్టి
వెలయ మున్నిరువదివే ల్జినమునులు
గొలువగ జినకులగురు డొక్కరుండు
నా బల్లహునకు ముఖ్యాచార్యు డగుచు
దా బుద్ధిసెప్పుచు దగ బ్రబోధింప
క్షితిపతియైన యా సింగబల్లహుని

యతివ సుగ్గలదేవి యలంకచిత్త
తాను తేడరదాసయ్యవరద
యానూనసద్భక్తిమానసగాన
తమ గురుస్వాముతో దాసి దేవునకు
రమణి యాస్థితి విన్నపముసేసి హితుల
బుచ్చుడు నప్పు డప్పొట్లచెర్వునకు
నచ్చెరువందంగ వచ్చునయ్యెడను
జినమును త్వెక్కు నుచ్చితములు సేయ..
నుచ్చితులగు జైనకూళలందఱను
బిలిపించి బల్లహుకొలువున వారి
వలపట నవరత్నకలితమై తనరు
సింహాసనాసీను జేసి యాజైన
సంహారుడైనట్టి సద్గురుదేవు
దాసయ్యపాదము ల్వ్రాసి యొత్తుచును
నా సుగ్గలవ యుండె నా జినమునులు
మంత్రతంత్రానేక మాయాదులను గు
యంత్రమహేంద్రజాలాది విద్యలను
అద్వైత శూన్యమాయావాదకర్మ
విద్వేషమున జైనవితతి దర్కింప
...బల్లహుడాదిగా నెల్లజైనులును
దల్ల డంబందుచు ధర జాగ్రమెక్కి
గంత నేసర దాసమయ్య బల్లహుని
సంతోషమున లింగసహితు గా జేసి
యుట దక్క మత్తరించుటజేసి యల్ల
సటికలింగంబు సప్పట్టాంబునను
సు రు సన నొగి బ్రతిష్ఠించి
యా త్తణి నా దాసమయ్య యేణ్గారు
వసదులు త్రప్పించి వైచి జైనులకు
నొసగడే శివదీక్ష యొరి జైనుండ."

ఈ రెండుప్రస్తావములలో మొదట జగదేకమల్లు డనియు, తర్వాత రెండవ ప్రస్తావమందు సింగబల్లహు డనియు కలదు. మొదటి ప్రస్తావమునందు జగదేకమల్లు డనియు, రాజధాని కల్యాణకటకమనియు నుండుట చేత కల్యాణకటకమును పాలించినవారిలో నీనామ ధేయములు గలవారు చాళుక్యులుతప్ప మరి యెవరును కానరారు. జగదేకమల్లు డను బిరుదము చాళుక్యులలో ముగ్గురకు గలదు. వారు 'మల్లికామోద', 'జగదేకమల్ల' జయసింహుడు II(క్రీ. శ. ౧౦౧౫-౧౦౪౨); 'ప్రతాపచక్రవర్తి' లేక 'పేర్మ' జగదేకమల్లుడు (క్రీ. శ. ౧౧౩౮-౧౧౫౧); మూడవ తైలపుని యనంతరము కొంతకాలము ఒక జగదేకమల్లుడు పాలించెను. వీరిలో నీ జగదేకమల్లుడు ఎవడైనను కావచ్చును. కాని శంకరదాసయ్య తేడరదాసయ్యయు, సుగ్గలదేవియు సమకాలీనులుగా బసవపురాణమున పరిగణింపబడి యుండుటచే నీజగదేకమల్లుడు ఈపైముగ్గురిలో మొదట నుదాహృతుడైన జగదేకమల్లజయసింహుడే కావల యును. కల్యాణకటకమును ప్రస్తావించుట ఇందులకు బాధకము కాజాలదు. ఏలన క్రీ. శ. ౧౦౩౩ సంవత్సరమున జయసింహుడు చనిపోవుటకు దాదాపు ఏడెని మిది సంవత్సరములకు పూర్వమే కల్యాణకటకము చాళుక్యుల 'నెలవీడు'గా నగపడుచున్నది. [బొంబే కర్ణాటకశాసనములు. I. I. ౬౯]

బసవపురాణమున సుగ్గలదేవిచరిత్రమున నుదాహృతుడైన సింగబల్లహుడును ఈ జయసింహుడే గావల యును. దాదాపు ఏబదియేండ్లక్రింద వ్రాయుచు డాక్టరు ఫ్లీటుగారు ఈతనిని పోల్చినారు. చెన్న బసవపురాణము నాధారముగా గ్రహించి అందు ఈ రాజు సుగ్గలదేవిభర్త, దేసింగబల్లాలుడని యున్నందువలన నయ్యది కవియొక్క దోషమనియు, హొయసలరాజులలో దేసింగుడను రాజు లేడనియు, సుగ్గలదేవి నామధేయమును, పొట్లచెఱువుయొక్క ప్రస్తావము నుండుటచే నీరాజు నిశ్చయముగా చాళుక్యజయసింహుడే యనియు వ్రాసినారు. కాని ఇంతదూరము శ్రమపడ నక్కరలేకయే మన యాంధ్రబసవపురాణము స్పష్టముగా నుడువుచున్నది. సింగడనుటచే నీరాజు జయసింహుడనియు, (సింగడనుట జయసింహుడనుటకు సంగ్రహముగా కన్నడశాసనములలో విరివిగా కానన గును) బల్లహుడనుటచే నీతడు చాళుక్యుడనియు, (చాళుక్యులకు వల్లభ, పృథ్వీవల్లభ బిరుదములు గలవు) వల్లభశబ్దమునకు వైకృతమనియు తెలియుచున్నది.

సుగ్గలదేవి యీ కర్నాటచక్రవర్తి యొక్క రాణులలో నొకతె. బహుశః పట్టమహిషిగా నుండ నోపు. ఈయమ కావించిన దానశాసన మొకటియే మనకు నైయున్నది. క్రీ. శ. ౧౦౨౯ సం. నకు సరియగు శకవర్షము ౯౫౧ శుక్లపుష్య బ. ౧ బుధ వారము ఉత్తరాయణ సంక్రాంతియందు దేవపురమార సింగేశ్వర దేవాలయమునందలి పాశుపతాచార్య బ్రహ్మరాసిపండితునికి, అచటి విద్యార్థులకు, తపోధనులకు అశనాచ్ఛాదనవైద్యాదికములకు భూదానము కావించి యున్నది. [బాం. కర్నా. ౨౫ of ౧౯౩౬-౩౭.]

జయసింహుడు తొలుత జైనుడు. ఈతని తాతయైన తైలపచక్రవర్తి జైనుడో కాడో చెప్పుటకు ఆధారములు కానరావుగాని ఈతని పెత్తండ్రియైన సత్యాశ్రయుడు జైనుడు. ఆతనికి 'అకలంక చరితు'డని జైనమతీయ బిరుదమును, 'ఇఱివబెడంగు' డని పౌరుషబిరుదమును గలవు. ఈతని గురువు కొండకొందాన్వయపుస్తకగచ్ఛమునకు చేరిన త్రికాలముని భట్టారకుడు; జైనాచార్యుడు. [E. C. VI. Mg 11] జయసింహుని జ్యేష్ఠసోదరుడైన త్రిభువనమల్ల విక్రమాదిత్యుడును జైనుడుగా నుండినట్లే తోచుచున్నది. జయసింహుడన్ననో స్పష్టముగా జైనుడు. క్రీ. శ. ౧౦౧౮ సం. డిసం. ౨౩ తారీఖు గల యొక్క శాసనమున [S. I. I. IX- I. 80, 81] 'మల్లికామోద'యను జైనబిరుదముచే ప్రసావితుడు. ఈతని కొమారిత సోమలదేవి క్రి. శ. ౧౦౨౭ సం. మున హిరియముసంగి యను గ్రామమున నొక జైనవసతికి భూదానములం గావించెను. [హైదరాబాదు, మ్యూజియంశాసనము ౪౧౩౪] ఈ హి రి య ము సం గి యే మాస్కి యను ప్రదేశము. క్రీ. శ. ౧౦౩౧ సం. కనకనందిభట్టారకజైనాచార్యుని ప్రార్థనచే, తనపేరట నున్న జగదేకమల్లజినాలయమునకు, ఆ హిరియముసంగిలోనే రాజు భూదానములు గావించియున్నాడు. [హైదరాబాదుమ్యూజియం ముద్గల్లుశాసనము.]

ఈవిధముగా జైనుడే యైయుండియు జయసింహుడు ఇతరమతములవారిని నిరాదరణ సేయలేదను టకు ఆధారముగా నీతడు క్రీ. శ. ౧౦౩౧ సం. ఆహిరియముసంగియందే ఒక వైష్ణవాలయమునకు భూదానము గావించిన శాసనముగలదు. [హైదరాబాదు మ్యూజియంశాసనము ౧౩౬౪] కనకనందిభట్టారకుని కిచ్చిన దానము ఆసంవత్సరమే ఆయూరనే జరిగి నందున ఇరుమతములవారికి స్పర్ధలు రానీయక యుండుటకై సహృదయుడై రాజిట్లొనర్చెనని తలంపవలసి యున్నది.

జయసింహుని జీవితమునందు క్రీ. శ. ౧౦౩౪ మొదలు మతపరివర్తన ప్రారంభమైనట్లు నిదర్శనములు కనబడుచున్నవి. పొట్లచెఱువునందు ఆసంవత్సరము మొదలు దాదాపు జీవితాంతము వఱకును జయసింహు డుండినట్లును తెలియుచున్నది. శ. ౯౫౬ భావ లో (క్రీ. శ. ౧౦౩౪) నీతడు అచట నున్నాడు. (బాం. కర్నా. ౧౨౨ of ౧౯౩౨-౩౩) ఆమరు సంవత్సరము క్రీ. శ. ౧౦౩౫, శక. ౯౫౭ యువ లో కాలాముఖిబ్రహ్మచారి స్థానమైన పంచలింగేశ్వరాలయమున కీతడు స్వయముగా దానమొసగి యున్నాడు! [E. C. VII- Sk. 126 బెళగావి. ఉడగణి, మైసూరు] ఈ తర్వాత నీతడు శైవేతరులకు దానములు గావించిన నిదర్శనములు కానరావు. పైగా నీతడేగాక, నీతని రాణియైన సుగ్గలదేవియును గాక మిగిలిన రాజకుటుంబమంతయు పొట్లచెఱువునందే యుండినట్లు శాసనములు తెల్పుచున్నవి. మఱియొక రాణి నొళంబవంశీయయు, చాళుక్య చక్రవర్తియైన సత్యాశ్రయుని దౌహిత్రి దేవలదేవియు రాజువెంట క్రీ. శ. ౧౦౩౬-౩౭ సం. మున నచ్చటనే యుండెను. [S. I. I. IX. 1-92] క్రీ. శ. ౧౦౩౮ సం. మున గూడ నీతడు పొట్లచెఱువునందే యుండగా నీతని దండనాయకుడును, 'షేషణిహనుమంత' బిరుదాంకితుడును నైన శైశ్యకులజుడు గంగమయ్యనాయకుడు జలశయనదేవునికి దానములు గావించి యున్నాడు. [లోకల్ రికార్డ్సు. వాల్యు. ౨౫ పు ౭౨] క్రీ. శ. ౧౦౩౯ సం. మున కూడ నీతడు అచటనే యుండి కెనకనకోట యను ఊరిలోని సిద్ధేశ్వ

రాలయాచార్యుడైన క్రియాశక్తిపండితుని పాదప్రక్షాళనము గావించి భూదానములుచేసెను. ఈశాసనమున పొట్టలకెఱె యనుటకు మాఱుగా ప్రమాదమున ఘట్టదకెఱె యని యున్నది. [E. C. VII Sk. 153] క్రీ. శ. ౧౦౪౦ లో కూడ 'నెలెవీడు' పొట్టలకెఱె. [బొం. కర్నా. I. I. ౭౪] ఈశాసనములుగాక పోట్ల చెఱువునుండి వెడలిన శాసనములు తారీఖులులేనివి, తారీఖులు చెడిపోయినవి పెక్కులు గలవు.

దీనినిబట్టి చూడగా జయసింహుడు దాదాపు ఆఱు ఏడు సంవత్సరములు బళ్లారిజిల్లాలోని పోట్లచెఱువునందే యుండెననుట తెల్లమగుచున్నది. రాజకుటుంబమంతయు నచటనే యుండెను. క్రీ. శ. ౧౦౩౪ వఱకును జైనమతావలంబిగా నుండి రాణి యొక్క ప్రోద్బలముచేత నేమి, తేడరదాసయ్య యొక్క బోధచేతనేమి జయసింహుడు శైవమతావలంబియై తుదకు శైవుడుగానే గతించెననుటయు, ఈవృత్తాంతమంతయు పోట్లచెఱువునందు జరుగుటయు విశ్వాసార్హములుగా నున్నవి. ఈరాజునకు శైవదీక్ష యొసగుటకు ప్రయత్నించినవారిలో సుగ్గలదేవినేగాక జయసింహుని మఱియొక రాణియైన లక్ష్మీదేవిని చేర్చవలయును. క్రీ. శ. ౧౦౩౪ సం.న ల ప్రోద్బలమున రాజు అజ్జడిపురమునందలి శ్రీకంఠభట్టారకునికి భూదానములు గావించెను. [బొం. కర్నా. ౧.౨ of ౧౯౩౨-౩౩] ఇదియే ఈతని మొదటి శైవశాసనము, దానమును.

తేడరదాసయ్య సర్పమును స్ఫటికలింగముం గావించినది ఇంద్రజాలములో చేరదగినది. ఆతడు ప్రతిష్ఠించిన దేవునికి ఉత్తరేశ్వరుడని నామధేయము బసవపురాణమున కలదు. హైదరాబాదు మ్యూజియం శాసనము ౧౩౬౦ A (చాల శిథిలముగా నున్నది) చాళుక్యవిక్రమాదిత్యుని కాలము దానియందు (C. V. 4=1080) ఉత్తరేశ్వరుని ప్రస్తావము కలగు. అదే ఇదని చెప్పుటకు ధైర్యముచాలదు. ఇంకను పరిశోధింపవలసి యున్నది.

జయసింహుడు వీరశైవుడాయెనని మదనతిలకాఖ్య కన్నడప్రబంధకర్త చంద్రరాజు తన పోషకుడైన మాచిరాజుంగూర్చి వ్రాయుచు తెల్పియున్నాడు. ఈ మాచిరాజు జయసింహుని సేనాధిపతి! తంత్రపాలమాచయ్య యని శాసనములయందు వ్యవహృతుడు [S.I I.IX-I. ౯౭]

"త్రిజగద్వ్యాపక కీర్తికుంతలధరాధీశం
జయసింహం...చాళుక్యవంశోత్తమం."

"చోళకుళవిళయకాళం
కాళముఖప్రాసి తోద్ధతాహితమాళం
మాళవరాజకశూళం [తిలక.
కూళాయుధచరణకమళ భృంగంసింగం." మదన

జయసింహుని యనంతరము చాళుక్యులందఱును శైవులుగానే యుండిరి. బిల్హణకవి తన విక్రమాంకదేవ చరిత్రమున జయసింహుని కుమారుడైన త్రైలోక్యమల్లాహవమల్ల సోమేశ్వరుడు తమ కులదైవతమగు 'బాలచంద్రశేఖరు'ని వరమున సుపుత్త్రులను గనెననియు [విక్రమాంక దేవచరితము, తిరుపతి వేంకటకవుల యాంధ్రానువాదము, పుట ౧౪], తర్వాత నీ సోమేశ్వరునికి కుదురని వ్యాధి శరీరమంతటను వ్యాపించినప్పుడు ఈశ్వరనామస్మరణ గావించుచు తుంగభద్రయందు మునిగి అసువులు వ్యయించెననియు [అదే గ్రంథము, పుట ౨౬] వ్రాసియున్నాడు.

చూడగా బసవపురాణమునందు కొంతవఱకొంత వాస్తవమున్నదనియు, చక్కగా పరిశోధించి శాసనాద్యాధారములచే సరిగా సమన్వయింపవలయు ననియు తెలియుచున్నది.

# సత్యాహింసలు: పూర్వసంప్రదాయం

## మహాభారతమే మహాత్మునికి ఒరవడి



= శ్రీ సి. హనుమంతరావు =

గాంధీమహాత్ముని పవిత్రజీవితములో సత్యాహింసలకు లక్ష్యాలక్ష్యముల అన్యోన్యతయు, ఆశయసాధనముల యేకత్వమును, పడుగుపేకల న్యాయమును (ఓతశ్చ, ప్రోతశ్చ) సిద్ధించినవి. ఆయన జీవభావములో సత్యమే యీశ్వరుడు. ఈశ్వరుడు సత్యస్వరూపి. అట్టి సత్యస్వరూపి యగు పరమేశ్వరుని పొందుట కుద్దేశింపబడిన భక్తిప్రపత్తులే ప్రత్యక్షయోగమున ఈశ్వరపూరితమగు, ఈశ్వరరూపియగు మానవకోటియొక్కటే గాక నిఖిలసృష్టిజాలముయొక్క సేవగా పరిణమించుచున్నది. అట్టి సేవ యావత్ప్రాణికోటిని ప్రేమించుటే యగును. ప్రేమించుట యథార్థముగా బాధింపకుండుటయే; అదియే అహింస. ఈ నిర్వచనములు జగత్తులోని సకలధర్మప్రవక్తల యొక్కయు, విశేషించి ఆర్యఋషులయొక్కయు సాంప్రదాయములకు సరిపడియున్నవి.

ఉపనిషత్తులలో 'సత్య'పదము 'బ్రహ్మము'నకు పరమలక్షణముగాను, కేవలపర్యాయపదముగాను పేర్కొనబడినది:

'సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ'—తైత్తిరీయోపనిషత్.

(ఏది సత్యమైనదో, యెప్పటికిని వినాశనము లేక శాశ్వతమై వెలయుచున్నదో, తెలివి యను ప్రజ్ఞను గలిగియున్నదో, దేనినైనను గ్రహించుటకు చేతనారూపమగు సత్తాను గలిగియున్నదో, అంతము లేనిదో, మితము గలిగియుండనిదో, కొలతకు లోబడినది గాదో, అదియే బ్రహ్మ.)

'తస్యోపనిషత్—సత్యస్య సత్యమితి ప్రాణావై సత్యమ్, తేషా మేష సత్యమ్.'—బృహదారణ్యకం.

(సత్యములలో సత్యమైనది; ప్రాణములే సత్యములైనవి, వానికంటెను సత్యమైనది. ఇదియే రహస్యమగు బ్రహ్మవిద్య.)

'సత్యం నామావ్యయ మవికారి తథైవచ'—మహాభారతము.

(ఏది యవ్యయమును, నిత్యమును, మఱియు నవికారియు నగునో యదియే సత్యము.)

'సత్యస్వరూపమున ప్రత్యక్షమైనావు'-కంచెర్ల గోపన్న.

'Whatever anything is really, it is unalterably'-Green's Prolegema to Ethics.

(ఏది యథార్థముగా నున్నదో, యదే యెప్పటికిని మార్పులేక ఒకేరీతిగ నున్నది.)

తన జీవితములో తా నలవఱచుకొనిన అహింసా నిర్వచనమును మహాత్ముడు భారతీయవిజ్ఞానమునకు, ఆర్యసభ్యతకు, హైందవజాతీయతకు, నీతికిని రత్నాకరమువంటిదైన మహాభారతమునుండియే గ్రహించియున్నాడు. ఉపనిషత్తులందును, బ్రహ్మసూత్రములందును సూత్రప్రాయముగా సూచింపబడి నేఱుగా హృదయమునకు తాకగలిగిన పరమధర్మసూక్ష్మములే మహాభారతమునందు సాకల్యముగా, సర్వదృక్కోణములనుండి చర్చింపబడి, వ్యాఖ్యానము చేయబడి,

# భారతి - పార్థివ కార్తికము

వ్యష్టిసమిష్టిజీవితములందు పూర్తిగా సమన్వయము చేయబడియున్నవి. భారతజాతీయతాస్వరూపమును మహాభారతము వ్యక్తీకరించినట్లు వేయితరమహాగ్రంథమును (వేదములు, ఉపనిషత్తులుసహా)జేయుట లేదన్నను అతిశయోక్తి గాదు. గాంధీమహాత్మునకు మహాభారతమే పరమలక్ష్యగ్రంథము. ఆయన రాజనీతి మహాభారతకారుని రాజనీతి; ఆయన ధర్మానుష్ఠానము మహాభారతాంతర్గతమగు గీతాధర్మజిజ్ఞాసయొక్క ప్రయోగము. అంతియేగాని కీర్తిశేషులగు శ్రీనివాసయ్యంగారు శెలవిచ్చినట్లును, కొందరు పూర్వాచారపరాయణులు ప్రచారముచేయుచున్నట్లును మహాత్మునకు తన అహింసాసిద్ధాంతమును బౌద్ధజైనప్రవక్తలనుండి సంకలించలేదు. గౌతమబుద్ధ మహావీరులు అహింసను పరమసత్యముగా గ్రహించిన సుద్ధికసాత్వికమూర్తులు. అందునను శాక్యమునికంటె మహావీరుడు అహింసయొక్క చరమదశను చూచినవాడు. అందుకనే దీపములు వెల్గించిన కొన్ని జీవరాసులు చచ్చిపోవలసివచ్చునని, అట్టి హింసానివారణకై జైనులు దీపములు పెట్టుకొనుట మానుకొని సూర్యాస్తమయసమయమునకు ముందుగనే భోజనాది సమస్తగృహకార్యకలాపమును ముగించుకొను నియమము గలవారైయున్నారు. మహాభారతములో ఆరణ్యపర్వమున ధర్మవ్యాధుడు—

"హాలికుండెంతయు నోజతో దునగ సీ
రాగ్రంబునన్ జోకి ప్రా
ణు లనేకంబులు సచ్చు హింస యది యౌ
నో గాదో, వేయేల, మ
ర్త్యులు నేలం జరియించుచో బదములన్
ద్రొక్కంబడున్ జెక్కుజం
తులు, హింసావిధి గా దనంగ వశమే,
దోషజ్ఞ యూహింపుమా!
సలిలము లుర్వి యాకసము
సర్వము జంతుమయంబు గావునన్
గలుగు నవశ్యమున్ సకల
కర్మములందును హింస, హింసకున్
వొలగిన దేహయాత్రయును
దుర్ఘటమైనటు లుండు, నింతయున్
వలపర, హింససేయమని
తారు తలంతురు కొంచె జెమ్మగిన్.
పనివడి యహింస వ్రతముగ
గొని వనమున నున్న మునులకుం దొడగదె హిం
సనము, తరుమూలఫలశా
ఖనిపీడన మది హింస గాదొకొ తలపన్."

అని హింసనుండి తప్పించుకొనుట అసాధ్యమని నిరూపించియున్నాడు. ఈ సిద్ధాంతమును పరమలక్ష్యముగా కొంతవరకు జైనులుమాత్రము స్వీకరించిరి. స్వీకరించి హింసయని నిత్యజీవితములో వ్యవసాయాది సమస్తవృత్తులు విసర్జించిరి. విసర్జించి బాహ్యదృష్టికి హింసారహితమని వడ్డీవ్యాపారవృత్తియందే ఆసక్తులై, ధనదాసులై ఘోరరాక్షసులవలె సజీవమానవరక్తమాంసములను గ్రోలు మహాపాపమునకు పాల్పడిరి. ఈ వడ్డీవ్యాపారవృత్తి యెంత దారుణమైనది ఇస్లాంమతప్రవక్తయగు మహమ్మదు దానిని కొరానులో నిషేధించుట బట్టియే తెలిసికొనవచ్చును. 'అతి సర్వత్ర వర్జయేత్' అనిగదా సామాన్యనీతి! అందుచేతనే మహాభారతకారుడు అహింసాస్వరూపమును పై పద్యములతోనే చాలించక,

"హింససేయనివాడు లేడిజ్జగమున
నొక్కడైనను, తమతమ యోపినట్ల
హింస తెరువున కెడగల్గి యేగవలయు,
నదియ మూలె! యహింసనా నతిశయిల్లు!"

అని ప్రామాణ్యప్రదమగు నిర్వచన మిచ్చియున్నాడు. దీని సత్యమును చాటుటకు మహాత్ముని జీవితమే సాక్షి. దీనినిబట్టి అహింస పరమధర్మమే యగుచున్నది. గాని యది సత్సాంప్రదాయముతో గూడిన విచక్షణాపూర్వకమగు అహింసగామాత్రే ముండవలెను. ఇదియే గాంధీమహాత్ముని యాదర్శము. కానియెడల తనతో సమానముగా, తనకంటె మిన్నగా సకలప్రాణికోటిని ప్రేమించు పరమకారుణ్యమూర్తియగు మహా

# బాధితప్రజానీకమునకు

# 60 సం॥ నిరంతర సేవ




## 60 సం॥ క్రితము లిటిల్సు ఓరియంటల్ బామ్

బాధిత ప్రజానీకమునకు పెక్కు మందికి అందజేయబడినది. నేడు భారతదేశము నందంతటను అన్ని నొప్పులకు, పోట్లకును ఇది దివ్యౌషధముగా వాడబడుచున్నది. దీని ప్రఖ్యాతి నాగరికత ప్రపంచమున కంతకును వ్యాపించినది.

కీళ్లనొప్పి, తుంటినొప్పి, నడుమునొప్పి, చెవిపోటు, తలనొప్పి, బెణుకులు, కండరముల నొప్పులు, దంతములనొప్పి మొదలగు వాటిబాధ నివారణకు లిటిల్సు ఓరియంటల్ బామ్ తప్పక గుణమొసంగును.

## లిటిల్సు

# ఓరియంటల్ బామ్

త్ముడు ప్రాణావశిష్టమైన ఆవుదూడను చంపుట కెట్లు ఒడంబడినాడు ? అహమదాబాదుపురపాలకసంఘము వారికి వీథులవెంట తిరుగు కుక్కలను చంపవచ్చునని యెట్లు సలహోయిచ్చియున్నాడు ? ఆశ్రమములోని తోటలను, కాయలను పాడుచేయుచున్నవని కోతులను చంపుట కెట్లు ఉద్యమించినాడు ? ధర్మసూక్ష్మత నెఱిగి ఫలాశను, కర్తృత్వాభిమానమును వీడినవాడు గనుకనే యిన్ని ప్రాణిహింసలను జేసియు, యథార్థముగా జేయనివాడే యగుచున్నాడు.

జైనులు వ్యక్తిగతజీవితమున హింసను విచక్షణ లేక విసర్జింప ప్రయత్నించి విఫలులైనట్లే బౌద్ధులు సాంఘికజీవితములో అహింసను పూర్ణముగా ప్రవేశపెట్టదలచి అపజయమొందిరి. నీతిధర్మమును సువర్ణసింహాసనాధిష్ఠితను జేసినాడనియే లోకమంతయు శాక్యసింహునికి భక్తితో తలవంచుచున్నది. అప్పటి కాలమున ఆర్యసంఘమున జ్ఞానమును, బ్రహ్మవిద్యయు ఆక్రమించియున్న మహోన్నతస్థానమునందుండి వానిని దింపి అందు నీతిధర్మమును ప్రతిష్ఠింపసమకట్టెను. అట్లే భక్తిని, యోగమును క్రిందికి లాగి సర్వభూతదయ హెచ్చని చాటినాడు. ఇంతవరకు జనసామాన్యహృదయమున గౌతముడు సంపూర్ణజయమును గైకొనగల్గినాడు. కాని స్వభావస్వధర్మసిద్ధాంతములపై నిర్మింపబడిన వర్ణాశ్రమధర్మములను కూలద్రోయ సమకట్టి సర్వమానవులును ఆధ్యాత్మికముగనేగాక యితర విధములను సమానులే యని చాటి మాయాద్వైతసిద్ధాంతముపై అహింసాస్వరూపమగునట్టి శుద్ధసాత్త్వికభిక్షుకసంఘము నొక్కటే యేర్పఱుపబూని విఫలుడైనాడు. అహింసాసిద్ధాంత మన్నిప్రమాదములకు లోనగుటబట్టియే,

"విను మహింస ధర్మవితతి కెల్లను మేటి
నదియు సత్యయుక్తమైన వెలయు
ననఘ శిష్టచరితలందు సత్యమ కడు
నధిక మనిరి శ్రుతుల నరసి బుధులు."

అని వెన్వెంటనే ధర్మవ్యాధునిచేతనే సత్యాహింసల సమ్మేళనపూర్వకమగు ధర్మసూక్ష్మత మహాభారతకారుడు ప్రకటింపజేసినాడు. ఇంతటి శిష్టాచారసంపన్నుడు గాబట్టియే మహాత్ముడు "బలయుతులుమాత్రమే అహింసాసామర్థ్యమును గ్రహించి వెల్లడించగలుగుదురు. బలహీనులు ప్రయోగించునట్టి అహింస నిజమగు అహింసగాక అశక్తదుర్జనతమాత్రమే కాగలదు."అని వక్కాణించియున్నాడు.

మును, దుర్మార్గమును ప్రతిఘటించునపుడు అహింస నవలంబింపగల నైతికధైర్యసాహసములు లేనిపక్షమున హింసను, దౌర్జన్యమును ప్రయోగించియైనను అధర్మమును రూపుమాపవలెనుగాని దాని నేకారణముచేతను సహింపరాదు" అని వ్యక్తిజీవితమునను; "భారతదేశము అహింసావిధానముననే స్వరాజ్యమును బడయవలెనని నా ఆశయము, నా సలహా. ఇట్లు చేసిననాడే భారతదేశము నిజమగు స్వాతంత్ర్యమును బడసి యీశ్వరప్రసాదితమగు తన వ్యక్తిత్వమును, ప్రత్యేకతను నిలబెట్టుకొని ప్రపంచమునకు నిజమగు సేవ జేసి ధన్యత నొందగలదు. ఈ అహింసావిధానము దేశముయొక్క పూర్వసభ్యతాసాంప్రదాయములచే మఱింత సులభమును గాగలదు. కాని యిట్టి యహింసామార్గ మనుసరింపజాలని నాడు ప్రపంచములో నన్నిదేశములును జేసినట్లే భారతీయులును హింసావిధిని స్వాతంత్ర్యము బొందియేతీరవలెను" అని సమిష్టిగా రాజకీయములందును ప్రబోధించుచున్నాడు. అహింసను సత్యముతో జతపఱచినపుడే దాని విజయము నిజమును, సమగ్రమును, శాశ్వతమును గాగలదు !

ఈ నిర్వచనములు శుద్ధతత్త్వప్రతిపాదితములేయై యున్నవి. మహాత్ముడు సత్యాహింసల ప్రయోగముగా రాట్నమును, భారతజాతీయతను ప్రచారముచేయుటలో దేశములో నొక నూతనసాంఘికవ్యవస్థను తీసికొనిరా సంకల్పించియున్నాడు. ఈ వ్యవస్థద్వారా అఖిలప్రపంచమునకు నొక ప్రత్యక్షప్రమాణపూర్వకమగు నీతిపాఠమును గఱపుట వారి జీవితపరమావధి. కార్యరూపమగు నీ మహదాశయమే సత్యాహింసల సమ్మేళన. ఈ సమ్మేళనమే పరమేశ్వరస్వరూపము. ఇదే విశ్వకళ్యాణసాధన. ఈ విశ్వకళ్యాణమహదాశయము రాట్నముచేతను, జాతీయతచేతను సాధింపబడగలుగుచో అవియును సత్యాహింసల స్వరూపములే గాగలవు.

# పరత్ హోర్బరు గ్రహచారము



= శ్రీ కె. పార్థనాథశర్మ =

రెండవ ప్రపంచమహాయుద్ధము ముగిసినది. ప్రపంచము కొంత నెమ్మదిపడినది. ఇంక నైన మిలిటరీలారీలు యథేచ్ఛముగా రాజమార్గములలో సంచరించుటవలన కలుగు ప్రమాదములు, ఆహార పదార్థములు మొదలగు నిత్యోపయోగవస్తువులు కరవగుటచే ప్రచారమునకు వచ్చిన రేషనింగు చట్టముల వలని ఇబ్బందులు తగ్గునుగాక.

అనుకొన్నంత కాలమునకు చాలాముందుగానే, తలవనితలంపుగా, అకస్మాత్తుగా ఈ జపానుయుద్ధము ముగిసిన సందర్భములో గ్రహగతు లేమనుచున్నవో ఇంచుక పరిశీలింతము.

జపాను దేశపు చక్రవర్తి "హిరోహితో" 1901-వ సం. ఏప్రిల్ 29-వ తేదీ రాత్రి 10-10 గంటలకు (టోకియోనగరపు స్థానిక కాలము) జనించిరట. బ్రిటిష్ అస్ట్రొలాజికల్ సొసైటీ అధ్యక్షులగు ఇ. హెచ్. బైలీగారిచే గుణింపబడి, 1937-వ సం. నవంబరులో బ్రిటిష్ జర్నల్ ఆఫ్ అస్ట్రాలజీ అను జ్యోతిషమాసపత్రికలో (31-వ వాల్యూమ్, 23-వ పుట) ప్రకటింపబడిన ఈ సాయనజాతకచక్రము జపాను చక్రవర్తిది.

ఇటీవలనే ఎవరో కార్తాంతికులు జపానుచక్రవర్తిజాతకమును మామూలుపద్ధతిలో కేవలనిరయనరాశి కుండలిరూపమున వార్తాపత్రికలలో ప్రకటించి ఫలములను చెప్పిరని జ్ఞాపకము. లగ్నములో గురు, శనులు ఉన్నట్లు కల్పించుకొని దశాంతర్దశలమూలముగా అనుభవములను సమర్థించుటకు, వారు ప్రయత్నించినారు. కాని "శ్రీపతిపద్ధతి" ననుసరించి భావకుండలిని సాధించి, గ్రహస్ఫుటము చేసినచో, ఈ జాతకమున గురుశనులు లగ్నమందుండక ధనభావమునకు వెళ్లినారని చదువరులు సులభముగా గమనించగలరు. ఫలములను సాధించుటకు ఏమియుక్తులనైన చెప్పనిండు, శాస్త్రానుసారముగా భావకుండలి వేసిచూపుట విద్యార్థులకు ఎక్కువ ఉపయోగకారియని నావిన్నపము. అది అట్లుండె.

| | | | |
|---|---|---|---|
| | బు 22-24 | శు 8-6<br>ర 8-30<br>కే 23-33 | ఇ 27-11 |
| | (సాయనము)<br>"హిరోహితో"<br>జన్మకుండలి | | |
| శ 16-23<br>గు 13-3 | | | కు 26-31 |
| I 22-6<br>వ 16-18 | రా 23-33 | | చ 22-31 |

లగ్నాధిపతి గురువు నీచపడినా, ధనాధిపతి యగు శనితో చేరి ధనస్థానమందే యున్నాడు. అష్టమాధిపతియైన చంద్రునినుండి ఈ గ్రహములకు శుభదృష్టి కలదు. ఈ చక్రవర్తి ప్రపంచములో అందరినీ మించిన భాగ్యవంతుడట! నమ్మవచ్చును. కాని, ఆ చర్చ మన కిపుడు అనవసరము.

ఇంద్రావరుణగ్రహములు జాతకములో ఎచ్చట నున్నవో చూడుడు! స్వాతంత్ర్యప్రియత్వమునకు తోడు ఊడుదొంగతనమును సూచించుచు, చంద్రునకు కేంద్రమందున్న వరుణుడు లగ్నమం దుండి, జాతకుని స్వభావములో కల ఉడుకుడుకుల వైలక్షణ్యమును తెలుపుచున్నాడు. సప్తమ(శత్రు)భావములో నుండు ఇంద్రుడు జాతకునికి నౌకాదళాధిపతులగు ప్రబల విరోధు లుందురని చూపును. బ్రిటిష్ ప్రభుత్వము ప్రపంచములో కీర్తిగాంచుట సాటిలేని నౌకాబలము తోనేకదా? మరియు, వ్యవహారవిషయములలో, సంధి విగ్రహములలో, కరారుకంట్రాక్టులలో భాగరులవలన కాని, భాగములవిషయమునకాని ద్రోహమో, మోసమో ఈ ఇంద్రగ్రహము సూచించుచున్నది. ఇట్టి ఇంద్రునకు బుధునినుండియు, కుజునినుండియు మిత్రదృష్టి సహాయ మున్నది. అనగా, వ్యాపారవిషయమున, యుద్ధసామగ్రుల ఎగుమతిదిగుమతులవిషయమున జాతకునకు పరరాష్ట్రములతో శత్రుత్వము వచ్చునని సూచన. ఈ రెండు గ్రహములనుండియు లగ్నమందలి వరుణగ్రహమునకుకూడ మిత్రదృష్టి ఉన్నదను మాట సత్యమే. ఆ గ్రహములు సూచించు సౌకర్యములు జాతకునికి సైతము లేకపోలేదు. కాని, ఈదృష్టి మోతాదు సప్తమభావమందలి ఇంద్రగ్రహముపైననే హెచ్చుగా ఉన్నదని చదువరులు గుర్తింపగలరు. ఇది కాక, బుధుడు సప్తమ(ప్రత్యక్షశత్రు)స్థానాధిపతికదా? ఆకారణమున సప్తమభావమందలి ఇంద్రగ్రహమునకే వీని శుభదృష్టివలన హెచ్చుసౌకర్యము లభింపగలదు.

రాజ్యస్థానాధిపతి శుక్రుడు. ఇతడు వృషభరాశిలో ప్రబలుడుగా నున్నాడు. జాతకునిది ప్రాచీనమైన ఉత్తమరాజవంశము. కాని, ఈశుక్రుడు రవికి అత్యంతసమీపములో సంయోగము నపేక్షించుచున్నాడు. కాక, అష్టమాధిపతియగు చంద్రునితో ఈ శుక్రునికి సార్ధకేంద్రశత్రుదృష్టి కలదు. ఉత్తమ వంశములో పుట్టి, గొప్ప పదవిలో నుండి, ఈజాతకుడు తన ప్రభావమును కోలుపోగలడు. పుణ్యసహమ బిందువు (వృషభరాశి 6°-7')శుక్రుని సమీపమందే యుండి చంద్రుని శత్రుదృష్టితో చెడినది. పూర్వపుణ్యము క్షీణమైనదని ఇది సూచించును. చతుర్థస్థానాధిపతి కుజుడు. పితృపైతామహముగా వచ్చిన భూపతిత్వమునకీగ్రహము అధికారి. ఈకుజునికి లగ్నాధిపతియగు గురువుతో సార్ధకేంద్రశత్రుదృష్టియు, సప్తమాధిపతియగు బుధునితో పూర్ణత్రికోణమిత్రదృష్టియు కలవు. అనగా, ఈ కుజుడు జాతకునికంటె అతని విరోధులకే అనుకూలుడనుట. అగుటచే శత్రువులతో స్పర్థ వచ్చినచో జాతకుడు తన రాజ్యమును, ఇల్లు వాకిలిసహితము శత్రువులకు కోలుపోవు ప్రమాద మున్నది. యుద్ధవిరామము కలిగినవెంటనే టోకియో నగరములో ఉన్న మహారాజభవనము అమెరికా సేనాపతియగు మెకార్థరు స్వాధీనపరచుకొననని వార్తాపత్రికలు చెప్పినవి. ఇంతేకాక, చక్రవర్తికి రాజ్యవిముక్తి కావచ్చునను వార్తలుసయితము పుట్టినవి.

జపానుచక్రవర్తి యుద్ధమును ఆరంభించిన వయస్సునకు అతని జాతకమున చలితగ్రహస్థితి ఈ క్రిందికుండలి చూపగలదు:

| | | | |
|---|---|---|---|
| చ 8 | | కే 21 | ర 17<br>శు 28<br>ఇ 28 |
| I 1 | చలితగ్రహ కుండలి (1941-42) | | బు 11 |
| శ 15<br>గు 11 | | | |
| వ 15 | రా 21<br>X 21 | | కు 11 |

రెండు సంవత్సరములకు పూర్వము, అనగా 1939 లో చలితరవి జన్మవరుణగ్రహమునకు సమసప్తక

వేశను పొందినాడు. (అప్పుడే జర్మను హిట్లరు మిత్రమండలివారితో యుద్ధ మారంభించుట.) మిత్ర భేద తంత్రమున కప్పుడే ఆరంభము. నూతన రాజ్యములను సంపాదించుటకు ఆశలు పుట్టినవి. లోలోపల సన్నాహములు సాగించుచు జాతకుడు కాలమును నిరీక్షించుచుండినాడు. 1941-42 లో దశమాధిపతి (రాజ్యస్థానాధిపతి) అను శుక్రుడు చలనవశమున ఇంద్రునిపైకి వచ్చినాడు. తన నౌకాబలము ప్రపంచములో సాటిలేనిది అను గర్వము—లేక భ్రమ—జపానుచక్రవర్తికి వచ్చినది. చలితచంద్రుడు మీన రాశిలో 8° కి వచ్చి జన్మరవిశుక్రులను మిత్ర (అర్థ కోణ) దృష్టితో ప్రోత్సాహపరచినాడు. జర్మనీ హిట్లరు జాతకమందలి గురువు మకరరాశిలో 8° లో నుండుట. అగుటచే ఈ చలితచంద్రుడు హిట్లరుకును, జపానుచక్రవర్తికినిధర్మైక్యముకలిగించిజతగూర్చినాడు సప్తమాధిపతి బుధుడు చలనవశమున కర్కాటకములో 11° లో నున్న కాలమది. జన్మకాల కేతువుతో ఈ చలితబుధునికి అర్ధకేంద్రశత్రుదృష్టి యున్నది. జాతకుడు మిత్రమండలివారితో యుద్ధ మారంభించినాడు. మోసముతో శత్రువులను గెలిచి ఆసియాఖండమంతా స్వాధీనము చేసుకోవచ్చు నని గంపెడాశ! చలితదశమ కేంద్రము చలితరాహువుపైకి వచ్చుట 1941 లోనే! ప్రపంచము గడగడలాడునట్లు జపానువారు యుద్ధము లో దిగి శత్రువుల కూపిరియాడకుండునట్లుగా దేశముల నాక్రమించుచు వచ్చిరికదా!

ఇచట ఒక చిత్ర మున్నది. మన జార్జి సార్వభౌముని జాతకములో * ఇంద్రగ్రహము మిథున రాశిలో 16°-31′ లో నున్నాడు. అనగా, జపాను చక్రవర్తి జాతకమందలి వరుణునికి సమసప్తకములో, అమెరికా సంయుక్తరాష్ట్రముల ప్రెశిడెంటుగానుండిన రూజువెల్టు జాతకములోని లగ్నమందలి వరుణుడు (మిథునరాశిలో 16°) జపానుచక్రవర్తి జాతకమందలి లగ్నగతవరుణునికి నికరముగా కేంద్రశత్రుస్థానములో! బ్రిటిషువారితో జపానుకు ప్రత్యక్షవైరము, అమెరికావారితో గుప్తవైరము అని దీని యర్థము. బ్రిటిషు సామ్రాజ్యములోని ప్రాచ్యభాగముల నాక్రమించుకొను కోరికయే జపాను వారి ప్రధానమగు ఆశ. కాని, జపాన్ చక్రవర్తి యొక్క వరుణునితో స్పర్ధలోనున్న జార్జిసార్వభౌముని ఇంద్రుడు తానై పైబడి యుద్ధమునకు ముందునడచువాడు కాదు. క్రోధకారణము లెన్ని వచ్చినా, తనంత తాను ముందు దుముకుట అతనికి గిట్టదు. కాలమునకై పొంచినాడు. రూజువెల్టు జాతకముతో జపాన్ చక్రవర్తిజాతకమునకు వచ్చిన స్పర్ధ ఉభయత్ర వరుణగ్రహప్రయుక్తమైనది. కావున వారిరువురికే తొలుదొల్త యుద్ధము వచ్చినది. జపానుచక్రవర్తి అమెరికావారి యుద్ధనౌకాశ్రయమగు పరల్ హార్బరును మొట్టమొదట నాశనముచేసి యుద్ధమారంభించినాడు. అమెరికావెనువెంటనే బ్రిటను జపానుతో యుద్ధములోనికి దిగినది.

జపాన్ చక్రవర్తికి పుణ్యసహమబిందువు వృషభ రాశిలో 6°-7′ లో నున్నదికదా! దినవర్షదశాపద్ధతిలో నిది చలించి 1941 కి మిథునరాశిలో 28½° కి పోయినది. అనగా, దశమాధిపతియగు శుక్రునికి, రాజ్యకారకుడగు రవికి, అర్ధకేంద్రశత్రుదృష్టికి చలిత పుణ్యసహమము వచ్చిన దన్నమాట! ఈ దుష్కాలములో యుద్ధమారంభించిన చక్రవర్తికి జయమెట్లు రాగలదు? మూడుముక్కాలు సంవత్సరములలో చలిత పుణ్యసహమబిందువు మిథునములో 27° కి పోవును. జన్మకాలమందలి ఇంద్రుడు దీని నాకర్షించుచున్నాడు. ప్రత్యక్షశత్రుస్థానమునందు (సప్తమభావములో) కదా ఇంద్రు డుండుట? పుణ్యమంతా ఇంద్రజాలములో మాయమైపోదా? తరతరములుగా, సర్వస్వాతంత్ర్యముతో, పరాజయ మను మాట యెరుగక సామ్రాజ్యము నేలిన వంశములో నుద్భవించి, అనవసరముగా యుద్ధమారంభించి, తుదకు నడియుద్ధములో చేతులెత్తి తెల్ల జండా పట్టవలసివచ్చినది. చలితరవి

* గత ఫాల్గుణమాసపు 'భారతి' లో 249-వ పుట చూడుడు.

1945 లో మిథునరాశిలో 21° కి వచ్చినాడు. జన్మకాలపుణ్యసహమబిందువున కీగ్రహము సహితము అర్ధకేంద్రశత్రు వైనా డిప్పుడు. ఇక్కడికి రాచరికి మదు గంటవలసినదేనా? చలితపుణ్యసహమబిందువు పూర్తిగా చలితేంద్రసంయోగము నందుటకు ఇంకా కొన్ని నెలలు పట్టును. చేయదలచిన కార్యము నపుడు ఇంద్రుడు సాంగముగా నెరవేర్చునేమో?

1941-వ సం. నవంబరు 30-వ తేదీనాడు జపానుచక్రవర్తి తన నాకాదళమును శాంత (పసిఫికు) మహాసముద్రమధ్యమున నిలిపి తక్కిన ఆసియా ఖండసోదరులను సంబోధించి, "మనము ఒకటిగాచేరి, అమెరికావారిని, బ్రిటిషువారిని ఈ గోళార్ధమునుండి పూర్తిగా తొలగింతము." అని గర్జించుచు బయాయి కొట్టెను. చలితదళమకేంద్రములో చలితరాహువు వచ్చి నందున కల్గిన చారవ యిది. దశమాధిపతియగు చలిత శుక్రుడు ఇంద్రునిపై నుండుకారణమున, యుద్ధములో శత్రువులను మోసగించి ధ్వంసముచేయవలెనను దృష్టియే ప్రధానముగా జాతకునికి వచ్చినది. ఈ ప్రయత్నముతో తనరాజ్యమునకే,తనబుద్ధికే మోసమురావచ్చుననిఅతనికి తోచలేదు. పాపము! ఇంద్రుని మాయ అది. ఆ సంవత్సరమున అతని చలితబుధుడు చలితగురువుతో సమసప్తకములో ఉండుట గమనింపుడు. అప్పటి ప్రయత్నములలో, ఊహలలో ఎంత వివేక ముండునో మన మూహించుకొగలము! గురు వతనికి లగ్నాధిపతి. వివేకము కోలుపోయి, లేక దుర్మంత్రుల యుపదేశ మును విని, జపానుచక్రవర్తి యీయుద్ధ మారంభించి యుండును. స్వపక్షపరపక్షబలాబలములను గమనించక అతడు బలవద్విరోధమును సంపాదించుకొన్నాడు.

అమెరికావారితో రాయబారములు నడచుచున్నవి. 26-11-41 నాడు అమెరికాసంయుక్త రాష్ట్రాల రాజ్యాంగమువారు జపానుచక్రవర్తి కొక సందేశ మంపిరి. చైనా, ఇండోచైనా మొదలగు ప్రాచ్యరాజ్యసంస్థల వ్యవహారములలో జపానువారు ప్రవేశింపకుండుటను గూర్చియు, విదేశవ్యాపారనియమములు, నాణ్యప్రచలామణీ మున్నగు విషయములను గూర్చియు కొన్ని షరతులను అమెరికాప్రెశిడెంటు సూచించియుండెను. దీనికి సమాధానము నీయకయే, జపానువారు లోలోపల ఆత్రముతో యుద్ధసన్నాహము చేసుకొన్నారు; 7-12-1941 నాడు ఆకస్మికముగా అమెరికావారి పరల్ హార్బరుపైబడి విమానముల నుండి బాంబుల వర్షము గురిపించి నాశనముచేసినారు. ఆ హార్బరులోని సేనలుకాని, అమెరికావారుకాని జపానువా రింత మోసముగా ముట్టడింతురని ఎరుగరు. అమెరికావారి గొప్ప యుద్ధ కలుకొన్ని—ఎనిమిది—ముంచబడినవి; మరికొన్ని ధ్వంసముచేయబడినవి. 3000 మంది ప్రాణములు ఆహుతిఅయినవి! ఎన్నో నావలు, విమానములు ధ్వంసమైనవి!

పరల్ హార్బరుపై బాంబులు వేయుటకు అయిదు నిమిషాలకు పూర్వము జపాన్ దేశపు రాయబారులు వాషింగ్టన్ నగరములో అమెరికారాజ్యాంగమువారి ఆస్థానమునకు వెళ్లినారు. బాంబుల వర్ష మారంభమైన తరువాతనే 26-11-1941 వ తేదీనాటి అమెరికాసందేశమును జపానువారు నిరాకరించినట్లు వ్రాయబడిన ప్రత్యుత్తరమును అమెరికావిదేశరాజ్యాంగకార్యదర్శికి వారు అందించినారు. అతడది చదువుకొని మండిపడి, "ఈభూగోళమందలి ఏరాజ్యమైనా, ఇన్ని టక్కులు, ఇన్ని టమార్లు చెప్పుట నా యేబది సంవత్సరముల అనుభవములో నే నెరుగను." అనెనట! తా నీమాట లాడునప్పటికే తమ పరల్ హార్బరు సగము ధ్వంసమైనదని, పాపము, ఆకార్యదర్శి ఎరుగడు. ఇంద్రుని యాజమాన్యమున జరిగిన యుద్ధములో నీతి యెందుండును? అంతా మోసమే; అంతా టక్కులే! తడిగుడ్డలతో కుత్తుకకోయు తంత్రము ఇంద్రునిది.

పోనిండు. పగల్ నాకాశ్రయముపై జపాన్ వారు అగ్నివర్ష మారంభించిన సమయములో గ్రహస్థితిని పరిశీలింతము. యుద్ధారంభకాల మదేకదా? 7-12-1941 నాడు 7-55 A. m. లో ("హానొ

లూలా" స్థానికకాల మిది) బాంబులవర్షము మొదలయినదట! ఆవేళకు గుణించబడిన సాయనకుండలి ఇది:

కే 18-9 కు 15-3 | శ23-33(వ) | వ27-39(వ) | స 16-31 (వ)

|జపానువారి దండయాత్రారంభము.

శు 1-38 చ 28-14

(పరల్‌హార్బరు నాశనము)

I 5-0

ర 15-17 X 15-30 రా 18-9

బు 7-26 ఇ 29-42

రవిగురువు లానాడు పరస్పరసమసప్తకములో నుండి పోట్లాడుచున్నారు. ఇట్టి యోగము ఏడాది కొకతూరి వచ్చునుగదా, విశేషమేమి అనవచ్చును. ఉన్నది. "హిరోహిటో" చరితవరుణుడు ధనుస్సు 15° లో, జార్జిచక్రవర్తి చరితకుండలిలో ఇంద్రుడు మిథునరాశిలో 15° లో ఉన్నారని మనము గమనించితిమేని, ఇందలి విశేషమునకు వేరే వ్యాఖ్యాన మవసరముండదు. జపాన్‌చక్రవర్తి పుట్టిన తరువాత 7-12-41 నాడు మాత్రమే యీ యోగము వచ్చినది. జాతకుని లగ్నాధిపతియగు బృహస్పతికి గ్రహరాజు (రవి) ఆదినము ఎదురునిలిచినాడు. జాతకుని రాజ్యాధిపతిని (శుక్రుని) కబళింప కాచుకొన్నవాడు కదా రవి? కాల మిపుడు వచ్చినది. ఆతని వరుణునిమీద రవి కూర్చుండి, ప్రత్యక్షశత్రు (సప్తమ) భావమునకు జిక్కిన లగ్నాధిపతికి (గురువునకు) ఎదురునిలిచినాడు. ఈదుర్యోగ మతనితో బలవద్విరోధులపైన యుద్ధారంభము చేయించినది.

జాతకుని లగ్నాధిపతి (గురువు) ఆదినమున నున్న స్థానము రూజువెల్టుజాతకములోని వరుణగ్రహస్థానమునకు నిండుకేంద్రమందే. అగుటచే, జపాను వారు అమెరికావారి హార్బరును ముట్టడివేసినారు. యుద్ధారంభము బ్రిటిషువారితో కాదు, అమెరికా వారితోనే.

చైత్రయాత్రారంభ కాలములో పరల్‌హార్బరులో తాత్కాలిక దశమకేంద్రమునకు కుజుని సమసప్తక వేధ ఎంతస్పష్టముగా చూపట్టుచున్నదో చదువరులు గమనించగలరు. అంతే కాదు. తాత్కాలిక రవి గురువులు దశమకేంద్రమున కెంతో అనుకూలురుగా కానవచ్చుచున్నారు. ప్రయత్నము ఫలించినది, తాత్కాలికముగా. హార్బరు అగ్నిపాలయినది. తరువాతి కథ వేరు!

ప్రథమాహుతికి పరల్ హార్బరును నిర్ధరించుటేల? రాజనీతితంత్రజ్ఞులు యుద్ధసౌకర్యార్థమని కారణము చెప్పెదరు. అది యుండనిండు. రేఖాంశాలగ్నము (Geodetic Ascendant) పరలుహార్బరుకు మకర రాశిలో 15° కి వచ్చును. జపానుచక్రవర్తిజాతకపు చరితశని యిపుడదే డిగ్రీలో నిలుచుట! కనుక, ఆ హార్బరుకు జపాన్‌చక్రవర్తినుండి శనిపట్టినది. ఆ హార్బరుయొక్క రేఖాంశా దశమకేంద్రము (Geodetic Meridian) తులారాశిలో 27°లో నుండును. జపాన్ చక్రవర్తియొక్క జన్మకాలపు ఇంద్రగ్రహమునుండి దీనికి కోణదృష్టి! ఆ నాకాశ్రయస్థానముపై అతని కెక్కువ అభిలాష. ముట్టడినిమిషములో తాత్కాలిక దశమస్థానమునకు, తాత్కాలిక కుజునికి సరిసదుమ పరల్‌హార్బరుయొక్క రేఖాంశాలగ్నములో చక్రవర్తి చరితశని యుండుట వింతగా నుండలేదా?

ఆ దినము జపాన్‌చక్రవర్తియొక్క దైనిక లగ్నము సింహరాశిలో 26½°లో, దైనికదశమకేంద్రము వృషభరాశిలో 21° లో నున్నవి. ఇందొక చిత్రము గమనింపుడు! దైనికలగ్నములో చక్రవర్తి జన్మకుజుడున్నాడు. జాతకుడు శత్రువుల నుండి బెదరునట్లు సాహసమును చూపినాడు. ఈ దండయాత్రవార్త వినిగానే ప్రపంచము హల్లకల్లోలమైనది. ప్రతిపక్షులు

ముందుగుండుసన్నాహము చేసుకొనుటకుపూర్వమే కొన్ని పట్టణములు, నౌకాశ్రయములు జపాన్ సేనలు పట్టుకోగలిగినవి. మూడుదినములలోనే అనాయాసముగ సింగపూరువద్ద బ్రిటిషువారి యుద్ధనౌకలను (Prince of Wales and Repulse) జపానువారు ముంచివైచిరి. కొన్ని నాళ్లలోనే ఫిలిప్పైను ద్వీపములను, తాయిలాండు, సింగపూరు నౌకాశ్రయమును, రంగూన్ నగరము మున్నగువానిని వారవలీలగా జయించగలిగినారు. జయముపైన జయము జాతకుని వరించినట్లు చూపట్టినది. ఇదంతా ఇంద్రుని మాయలో కుజుని సాహసము!

కాని, యుద్ధయాత్రారంభకాలమున జాతకుని దైనికదశమకేంద్రములో అతని చలితకేతు వున్నాడు. యుద్ధములో జపాన్ వారు చూపిన దుర్నీతి కిది సాక్షి! తలలేని మొండెముకదా కేతువు? దీని యాజమాన్యములో ప్రారంభించిన యుద్ధములో కీర్తి యెట్లు వచ్చును? మోక్షప్రగుడు కేతువని మనవారనిరి. రాజ్యవిమోచనము నిచ్చునేమో విరక్తివలన కాకున్న, అశక్తతతో అయినాసరే!

యుద్ధమారంభమైనతరువాత రెండుగంటలకు జపాన్ లోని అమెరికాదేశపు రాయబారికి యుద్ధము నారంభింతుమని జపాన్ వారు తెలిపినారట! అప్పుడు టోకియోనగరములో వృశ్చికరాశిలో 27° లగ్నమందుండినది. అనగా, నాటి వరుణుడు అస్తమించుచున్న వేళలో ఈవార్తను వారు పుట్టించినారు. ఈదండయాత్రలోని ఆకస్మికతనుమాత్రమేకాక, ఏ వరుణుని యుద్రేకముతో కన్నుమిన్నుకానక జాతకుడీదండయాత్ర సాగించెనో, ఆవరుణుడు కడకు అస్తమించునని సయితము ఈయోగము సూచించదా? అసమానకక్షతో సాహసమున యుద్ధమునకు జాతకుని పురికొల్పి, వరుణుడు కడకు శత్రుపక్షమును (సప్తమస్థానమును) చేరుకొన్నాడు! ఏమి యీ వరుణుని యాగడము?

పరల్ హార్బరుపై బాంబులు కురిసినక్షణమున ప్రశంసలో నున్న సామ్రాజ్యముల ముఖ్యపట్టణములలో లగ్నదశమకేంద్రము లెట్లుండెనో చూతము:—

| పట్టణము | లగ్నము | దశమము |
|---|---|---|
| 1. పరల్ హార్బరు | 5° మకరము | $15\frac{1}{2}$° తుల |
| 2. లండన్ | 19° కటకము | $18\frac{1}{2}$° మీనము |
| 3. న్యూయార్కు | $9\frac{1}{2}$° మేషము | 5° మకరము |
| 4. టోకియో | $3\frac{1}{2}$° వృశ్చికము | 8° సింహము |
| 5. ఢిల్లి | 9° కన్య | 8° మిథునము |

ధ్వంసముచేయబడిన హార్బరు అమెరికా సంయుక్తరాష్ట్రములవారి సామ్రాజ్యమున కాయువు పట్టువంటిది. యుద్ధారంభకాలములో పరల్ హార్బరులో ఏరాశిలో ఏభాగ లగ్నమందుండెనో, అదే భాగ ఆసమయమందే అమెరికారాజధానీనగరములో దశమకేంద్రమునం దుండుట జ్యోతిషశాస్త్రదృష్టిలో ఎంతో రమ్యముగా నుండలేదా? ఇంతకన్న సృష్టి చిత్రమా?

లండన్ పట్టణములో తాత్కాలికదశమకేంద్రము కేతువుమీద నున్నది. అకస్మాత్తుగా జపాన్ వారిట్లు సామాన్యయుద్ధనీతిని వదలి దుర్మార్గముగా ప్రవర్తించుట విని యింగ్లాండులోని జనులు తల్లడిల్లి కంగారుపడియుందురు; ప్రపంచమున తమ సామ్రాజ్యగౌరవమునకు గొప్ప అవమానము, కళంకము వచ్చినట్లు భావించియుందురు. ఢిల్లీనగరములోని తాత్కాలిక దశమకేంద్రము జార్జిసార్వభౌముని జాతకమందలి రాహుకేతువులకు సరినడుమ చిక్కి తల్లడిల్లినది. సార్వభౌముని నాశ్రయించియున్న హిందూదేశము సయితము జపానువారి దుండగముల పాలు కాగలదేమో యని భీతివచ్చినది. సూర్యు డస్తమించ నెన్నఖ్యాతి గాంచిన బ్రిటిషుసామ్రాజ్యమున కిది కళంకము కాక వేరేమి?

టోకియోనగరములో తాత్కాలికదశమకేంద్రము జార్జిసార్వభౌముని దశమకేంద్రబృహస్పతిమీద నుండినది. జపానుచక్రవర్తిజాతకమున రవిశుక్రుల

స్థానమున కిది నికరముగా కేంద్రమే; మరియు, అతని అష్టమాధిపతి యగు చంద్రునినుండి అర్ధ కేంద్రమే! జపాన్ చక్రవర్తిజాతకమున ప్రబలవేధ పాలయిన ఈ దశమకేంద్రము జార్జి సార్వభౌముని జాతకమున ప్రబలుడగు బృహస్పతికి చిక్కినట్లేకదా? ఈ యుద్ధప్రయత్నమువలన జాతకునికి పరాజయము వచ్చుటేమివింత?

ఇది యిట్లుండ, దండయాత్రా కాలమందలి టోకియో దశమకేంద్రమును దేవమాన పద్ధతితో చలింప జేసినచో, మూడు ముక్కాలు సంవత్సరముల కది సింహరాశిలో $11\frac{1}{2}^\circ$ లకు వచ్చును. అనగా, రూజువెల్టు జాతకమందలి చలితశని (వృషభరాశిలో $11\frac{1}{2}^\circ$) నుండి పూర్ణకేంద్రముపాలయిన దనుట! యుద్ధారంభము నుండి మూడు ముక్కాలు సంవత్సరములకు రూజువెల్టు శని యుద్ధయాత్రాదశమ కేంద్రమును పట్టినాడు. దండయాత్రా కాలమందలి టోకియోలగ్నము చలించి అప్పటికి వృశ్చికరాశిలో $6^\circ$కి పోయినది. ఇది రూజువెల్టు జన్మశని కెదురు. ఈవిధముగా టోకియో లగ్న దశమములు రెండును ఏకకాలమందే అమెరికా ప్రెశిడెంటుశనివాత బడినవి. ఇక జపానుకు జయ మెక్కడిది?

పరల్ హార్బరులగ్నము 1945 ఆగస్టునెలకు మకరరాశిలో $8^\circ$ కి చలనవశమున వచ్చినది. అంటే చలితలగ్నము దండయాత్రాకాలపు శనికి, చక్రవర్తి జన్మకేతువునకు సార్ధకేంద్ర శత్రుదృష్టికి వచ్చిన దన్నమాట! పరాజయము కాక మరియేమగును?

యుద్ధయాత్రారంభకాలపు రవి చలించి 1945 ఆగస్టునెలకు ధనుస్సులో $18^\circ$ కి వచ్చినాడు. చలిత రాహువు కన్యారాశిలో $18^\circ$ లో, చలితకేతువు మీన రాశిలో $18^\circ$ లో అవుచుండుట. జపాన్ యుద్ధపు చలితరవి రాహుకేతువులకు చిక్కినాడు. “యుద్ధము వలదో రామచంద్రా!” యని జపాన్ చక్రవర్తి ఆయుధములు పారవైచి సంధికోరినాడు. జపాన్ జాతీయ జీవితమునకే కళంకము దెచ్చు షరతుల నంగీకరించినాడు. ప్రపంచ చరిత్రలో తీరరాని అపకీర్తిపాలయినాడు.

6-8-1945 నాడు మిత్రమండలివారు పాశుపతాస్త్రమువంటి ఆటంబాంబును ప్రయోగించి జపానులో ముఖ్యపట్టణమగు హిరోషిమాను మూలమట్టుగా నాశనము చేసిరి. జపాన్ చక్రవర్తికి దీనితో వణకుపుట్టినది. 14-8-45 నాడు అతడు శస్త్రసన్యాసము కావించి శత్రువులకు “జితోస్మి” యన్నాడు. ఇంతటితో ఈ యుద్ధము ముగిసినది.

ఇప్పటి కింత చాలును. మరొకప్పుడు, ఆటంబాంబు ప్రయోగకాలమును గూర్చియు, జపాన్ చక్రవర్తి జితోస్మి యన్న కాలమునుగూర్చియు గ్రహగతులను చర్చింతము—అవకాశమున్నచో.






[ కథ ]

= శ్రీ కందుకూరు లింగరాజు

"అమ్మ చచ్చిపోయింది..." అంతకంటె ఎక్కువ చెప్పలేని హృదయంతో రామూ వచ్చి, అప్పుడే వచ్చిన అన్నయ్యతో అన్నాడు.

పన్నెండేళ్లలోపు వున్న రామూను గద్గదకంఠంతోటే, నీళ్లుతిరిగే కళ్లతోనే దగ్గరగా తీసుకుని హత్తుకొని వూరడించేడు. అంతకంటే ఏదో అని, ఏదో చెప్పి ఊరడిద్దామనుకున్న మాటలు, ఆ వయస్సుకు నచ్చచెప్పగల్గే, ధైర్యం, అనునయం కల్గించేవి కన్పించలేదు శీతారామయ్యకు.

అల్లా తమ్ముణ్ణి దగ్గరకు తీసుకుంటూనే కక్కాయిని చూచేడు. ఏదో తను కష్టపడి, సవతితల్లి పోయిందని ఏజెంటుకాళ్లూ కడుపూ పట్టుకుని, బ్రతిమాలి సంపాదించిన పదమూడురోజులూ రామూను తనదగ్గరే వుంచుకున్నాడు. తనతోటే అన్నం తినిపించేడు. తనప్రక్కనే పండుకోబెట్టుకున్నాడు.

శీతారామయ్యకు తెలుసు సవతితల్లి సావిత్రమ్మ తనను ఆఖరుకు గుమ్మంలోకైనా రానిచ్చేది కాదని. తన తల్లి పోయినతర్వాత తను ఆమెఇంట్లో గడిపిన, స్కూలుఫైనలు ప్యాసయ్యేవరకూ చవిచూచిన, ఆమె పెట్టిన కష్టాలు నెమరుకువస్తే మొదట్లో వెళ్లకూడదనుకున్నాడు. ఒక్క ముక్కలో చెప్పాలంటే తనను ఇంట్లోంచే తరిమేసిన సావిత్రమ్మకు, చచ్చి పదిరోజుల్లోనూ ఈ చంద్రలోకంలో తిరిగే ఆమెఆత్మకు తన చేత్తో పిండాలు వెయ్యటానికి మనస్సు ఒప్పిందికాదు. అయినా లోకానికి వెరచి, తప్పనిసరిగానే బయల్దేరేడు.

అసలు అప్పుడే సావిత్రమ్మ తనమీద కొస్తంత ఆఖరుకు నౌకరు రామయ్యకు ఇచ్చినంతైనా గౌరవం వుంచితే, తను చేసే నౌకరీకి ఫలంగా కాలేజీకి అయ్యే ఖర్చులన్నా ఇస్తుందని ఆశించేడు. కాని స్కూలుఫైనలు ప్యాసవడంతోటే ఎల్లాగో తండ్రి సంపాదించి ఇచ్చిన ఉద్యోగంలో ప్రవేశించడం జరిగి, అందులోనే ఇంతకాలం బురదలో పడ్డ నత్తలా కొట్టుకుంటూనేవుండి, ఆశించుకున్న పెద్దవుద్యోగాలూ జీతాలూ, హోదాలకు తిలోదకాలు ఇచ్చుకున్నాడు. సావిత్రమ్మ మానసికంగా, భౌతికంగా, ఆఖరుకు ఆధ్యాత్మికంగా తనను ఎన్ని కష్టాలు పెట్టినా, అవన్నీ మరిచేపోయేడు బ్యాంకులో చేసే గొడ్డుపనితో. కాని ఇంటికి వచ్చే ప్రతీసాయంత్రమూ "ఆఖరుకు బి. ఏ. చదివేవరకన్నా వుంచింది కాదు...మహామ్మారి!" అనుకుని తిట్టని రోజు లేదు శీతారామయ్య జీవితంలో.

శీతారామయ్యకు రామూను చూడగానే తనకు సంతానం అంతవరకూ లేకపోబట్టి అనండి; లేకపోతే పుట్టకపోవడంవల్ల సహజంగా పిల్లలను చూడగానే ఉబుక్కువచ్చే వాత్సల్యంవల్లనే అనండి ...సావిత్రమ్మ అసలు ఆమెజీవితంలో తనను కష్టపెట్టిం

దనే అనుకోలేదు. అదంతా ఏ నవలలోనో చదివినట్టు గానే అనుకున్నాడు. ఆరోజుల్లో రామూను తన తల్లి కన్నట్టే భావించేడు. అతనిమట్టుకు ఎల్లావున్నా, పన్నెండు రోజులూ అయినతర్వాత తను చదువు చెప్పిస్తానని రామూను తీసుకువెళ్లే రోజున కక్కాయి "ఏదో నాయనా! పెద్దవాడి వయ్యేవు. మీనాన్నగారు చచ్చినరోజున వచ్చేవు. మళ్లీ ఇన్నాళ్లకు నాకడుపు చిచ్చుపెట్టి వెళ్లిన రోజున వచ్చేవు." అని ఏదో అనడంతో శీతారామయ్యకు గుండెల్లో గునపంగుచ్చినట్టే అయింది. "ఎల్లాగైనా కక్కాయి సావిత్రమ్మ తల్లేకాదూ!" అనుకున్నా బాధమాత్రం పోలేక పోయింది.

తన జీవితం సింహావలోకనం చేసుకుంటే కక్కాయి తనకు చేసిన ద్రోహం, చెయ్యదలచిన అపకారం ఇంతా అంతా కాదు. ఆఖరుకు కన్నతండ్రి చేతే "నాఆస్తంతా నాస్వార్జితం" అని అనిపించింది. తన తల్లివైపు పదివేలరూపాయల నగలూ, ఓరెండుపుట్లు వచ్చే మాగాణీ వుండవలసినా...ఇప్పుడు అవేమీ తనకు లేకపోయినా కక్కాయీ, సావిత్రమ్మా కలిసి తనకు పెట్టిన వాతలు, దెబ్బలుమాత్రం ప్రేమతో ఇచ్చిన ఆస్తిలా వుండిపోయేయి.

రామూ, తనూ ఇంటికి వచ్చేటప్పటికి, ఎన్నో విధాల ఆలోచనలు పోయేయి. ఒక్కటిమాత్ర హృదయంలోనుంచి ఎంత తోలుకుందా మనుకున్నా తోలుకోలేకపోయేడు. ఆఖరుకు కొన్నాళ్లపాటు తన తండ్రిచేతుల్లో ఎంతో గారాబం, ప్రేమ పొందిన మంచిరోజులు ఎదురుగాతిరుగుతే ఇప్పటికి ఆతండ్రి యొక్క రక్తాన్ని పంచుకుని మిగిలింది ముప్పైఅయిదు ఏళ్ల లోకాన్నిచూచి కొద్దోగొప్పో అనుభవం గడించిన తనూ, ఇకముందు ఏముందో తెలియని రామూనూ మిగిలేరా? నిజంగా దుఃఖమే వచ్చింది. తన తండ్రి సావిత్రమ్మచేతిలో ఎల్లా మారినా, ఇప్పుడు సమానంగా రక్తం ఇచ్చి పెంచిన రామూను తనకు అప్పచెప్పి వెళ్లినట్టే తట్టింది.

గుమ్మంమెట్లు ఎక్కేటప్పటికి అంతవరకూ చూడని వెంకటలక్ష్మమ్మ 'అతడెవరు?' అన్నట్టు ఆశ్చర్యపడింది. ఓమాదిరిగా క్షణికం వూహాతట్టినా, "వాణ్ణి ఎందుకు తీసుకువచ్చేరు? వాళ్ల కక్కాయి వుందిగా? బ్రతికున్నన్నాళ్లూ మనకు ఏమైనా పెట్టేరా? చచ్చికూడా మనమీద కక్షసాధిస్తారా?..." వగైరాప్రశ్నలు వేసేంత తెలివితేటలూ, తంత్రాలూ లేకుండానే పెరిగిందవడంవల్ల స్వంతమరది, తమ్ముడుగానే తీసుకుని తృప్తిపడింది. శీతారామయ్యకు ఎప్పుడూ భార్యను అనుమానించని హృదయం ఎంచేతో ఎక్కువగానే తేలికపడింది.

రామూ వచ్చినప్పటినుండి పంథాలన్నీ మార్చవలసివచ్చింది శీతారామయ్యకు. సావిత్రమ్మ రామూను ఎల్లా రాజకీవిలో పెంచిందో? ఒకేరక్తంలోనుంచి పుట్టినా తను అనుభవించలేని దర్జాలూ, హోదాలూ అనుభవించేడని తెలుసు. అదికూడా అంత చిన్నవయస్సులోనే. ఒక్కసారిగా తను గడిపే క్లుప్తసంసారం... ఏదో పచ్చడిమెతుకులు...కాసిన్ని చింతపండునీళ్లు... ఇన్ని నిమ్మకాయిపిండిన మజ్జిగనీళ్లతోటి రామూ అలవాటుపడాలంటే కష్టమే! అంచేత తను అనుకున్నట్లు, తనూ వెంకటలక్ష్మి వూహించుకుని, ప్రతినెలా దాచుకునే పదో, పదిహేనురూపాయలు ఇక మిగల్చడం కష్టం అయినా, దాన్ని తమ్ముడికోసం త్యాగంచెయ్యడానికి నిశ్చయం చేసుకున్నాడు. తను తన జీవితంలో పొందలేని, తన ఆశలన్నీ ఫలాలు అవలేని సన్నివేశాలు రామూజీవితంలో వుండకూడదు. తల్లీ, తండ్రీ లేని పిల్లాడి మనస్సు ఏవిధంగానూ కష్టపడకూడదు అన్న భావంలో పడాడు.

దాంతో సావిత్రమ్మగారి ఇంట్లోలాగే ప్రొద్దుటే కాఫీ, శుభ్రంగా పప్పూ, రెండుకూరలతోటి భోజనం, సాయంత్రం 'టీ' వగైరాలన్నీ నెమ్మదిగానే శీతారామయ్యఇంట్లో ప్రవేశించేయి. వెంకటలక్ష్మమ్మకు "తప్పిదారి తనకే ఓబిడ్డ పుడితే వాడి

కోపమని నిల్వచేసిన రెండు వేలలోంచీ ఇంటిఖర్చుకు నెల నెలా తీస్తున్నానే” అని కాస్తంత హృదయానికితట్టినా ఏదోలే అన్నట్టుగానే ఊరుకుంది.

ఆ రెండేళ్లలోనూ ఎన్నో మార్పులు వస్తూనే వున్నై. చదువుకోడానికి సుభ్రమైన గది లేదని ఇంకో పెద్దఇంట్లోకి వెళ్లేరు. కొత్త మధ్యాహ్నం స్కూలుకు టిఫిన్ తీసుకువెడతాడని ఓ కుర్రాణ్ని కూడా పెట్టేరు.

ఖర్చు ప్రతినెలా ఎక్కువే అవుతున్నా తమ్ముడు సుఖంగా, దర్జాగా రాజభోగం పొందుతున్నాడన్న సంతోషం...తనకంటె ఎక్కువ హోదాలో తన తల్లి చూపించలేని దయ తను భిక్షగా ఇస్తున్నానన్న గొప్ప...తనకు ఇక ఎల్లాగానూ బిడ్డలు కల్గరు, వీడినే కొడుకిక్రింద పెంచుకుంటానన్న వాత్సల్యం... తర్వాత తర్వాత పెద్దపెద్ద చదువులు చదివి పేద్ద పేద్ద ఉద్యోగాలు చేస్తూ తనను సుఖపెడతాడన్న ఆశతోనే శీతారామయ్య తృప్తిపడ్డాడు.

ఆ యేడు స్కూలు ఫైనలు గట్టెక్కడంతోటే రామూ పడిన సంతోషంకంటే శీతారామయ్యే ఎక్కువ సంతోషించేడు. వెంకటలక్ష్మమ్మ మురిసే పోయింది.

రామూకూడా అన్నగారింటికి వచ్చినప్పటి నుంచి తను అసలు తల్లినీ, తండ్రినీ కూడా పోగొట్టుకున్నానన్న తలంపే కలగకపోవడంవల్లా, తను రోజూ అనుభవించే రాజభోగాలవల్లా శీతారామయ్య, వెంకటలక్ష్మమ్మలే తనకు దేవుడిచ్చిన తల్లీ, తండ్రీ అని సంతృప్తిపడ్డాడు. తెలియని మొదటిరోజుల్లో ‘అమ్మా’ అనే పిల్చి తృప్తిపడ్డాడుకూడాను. అల్లా పిల్చినప్పుడు వెంకటలక్ష్మమ్మకూ పాలుచేపొచ్చినట్టే అయి రామూను కౌగలించుకునేది. తన కొడుకు, తన తమ్ముడు, తన మరిది అన్నీ కల్పిన ప్రేమతో, వాత్సల్యముతో పెంచింది.

అసలు వెంకటలక్ష్మమ్మకు ఒక్క అక్కగారు తప్ప ఇంకెవ్వరూ లేనేలేరు. చాలాకాలం ఓ తమ్ముడైనా ఉంటే బావుండేదనుకుని ఎన్ని దేవుళ్లకు మ్రొక్కినా వారు వరమియ్యనేలేదు. ఏదో రామూను చూసేటప్పటికి దేవుడే విసంగానైనా చూచి సంతోషించమన్నాడని తృప్తిపడింది. దాంతోటే రామూ యెడ గౌరవంకూడా హెచ్చయిపోయింది

ఆ శీతాకాలంలో రామూకు జ్వరం వచ్చింది. శీతారామయ్యకు గుండె గుభేలుమన్నట్టే అయింది. ఆఫీసుకు సెలవుపెట్టి రామూమంచందగ్గరే, అన్నం కూడా తినకుండా గడిపేడు. కళ్లమ్మట నీళ్లుకూడా కుక్కుకొన్నాడు. ఎవరు ఏది చెపితే ఆవైద్యం, ఆ చికిత్స చేయించేడు. ఆఖరుకు రక్షరేకుకూడా కట్టించేడు. ఆతని మాట ఎల్లా ఉన్నా వెంకటలక్ష్మమ్మకు ప్రాణాలు పైనే పోయేయి. ఊళ్లో ఉన్న పోలాలమ్మకు చలిమిడిపానకాలు మొక్కుకుంది. సత్యనారాయణవ్రతం చేయిస్తానంది కూడా.

ఇంతకూ ఆజ్వరం కొత్త కాలంమార్పువల్ల వేసవిలోంచి వర్షాల్లోకి దింపేటప్పుడే వచ్చింది. మూడురోజుల పట్టపగలుండి పారిపోయింది. ఆతని జ్వరం మాట ఎల్లా వున్నా, పదిలంఖణాలు చేసినట్టు శీతారామయ్యా, వెంకటలక్ష్మమ్మా తయారయ్యేరు.

అసలు రాము ఏ ముహూర్తాన, ఏ ఘంటలో, ఏ నిముషంలో శీతారామయ్యఇంట్లో అడుగుపెట్టేడోకాని, అక్షణాన్నుంచి కొన్నాళ్లు తెలియకుండా, కొన్నాళ్లు తెలిసీ తెలియకుండా, మరికొన్నాళ్లు తెలిసే, వెంకటలక్ష్మమ్మహృదయంలో రామూకు తన అక్కకూతుర్నిచ్చి పెళ్లిచేస్తే బావుంటుందన్న భావం మొలిచింది, పెరిగింది, అల్లుకుంది. ఈ భావం రోజురోజుకూ రామూను పెరిగే స్థితిలో చూస్తుంటే (ఆ పచ్చటి పసిడిశరీరం, పైకి దువ్విన క్రాపింగు, జబ్బకట్టిన చెయ్యి, వచ్చీరాని మీసాలు) ఎక్కువే అయి శరీరాన్ని అంతా వ్రుములుకుంది. ఆఖరుకు కొన్నాళ్లు అతన్ని చూచినప్పుడల్లా ‘అతడు తన అల్లుడే’ అనుకుని మురిసిపోయింది.

ఈ భావం, ఈ ఆలోచనా వెంకటలక్ష్మమ్మ చాలాకాలం శీతారామయ్యతో చెప్పకుండానే దాచి

పెట్టింది. "అప్పుడే, ఇంకా మీసకట్టైనా రాలేదు, పెళ్లా" అనేస్తారని భయపడింది. ఆఖరుకు రామూ స్కూల్ ఫైనల్ ప్యాసయింతర్వాత, ఇక ఉండబట్టలేక, రాత్రి ఏదో ఏదో చెప్పకున్న తర్వాత గునుస్తూ, మురుస్తూ, సగం సిగ్గుతోనే చెప్పింది.

సీతారామయ్యకుకూడా వెంకటలక్ష్మమ్మ చెప్పిన దాంట్లో ముగ్ధతనం ఏమీ కన్పించలేదు. అంతా సమంజసంగా, సబబుగా, బావున్నట్టే తట్టింది. ఇది వరకు ఆతలంపే అతనికి తట్టలేదు. ఇక రామూ తన వాడు అవుతాడనీ, తనకు గౌరవం, ప్రతిష్ఠా ఆర్జించి పెడతాడనీ, అన్నిటికంటె, ఆఖరుకు, ఓ వరసగా 'అల్లుడు' అవుతాడనీ సంతోషపడ్డాడు. 'అల్లుడు' అనుకున్నప్పుడు యెందుకో సీతారామయ్యశరీరం పులకరించింది. ఓసారి అసబబుగా అన్నట్టు ఎడం కన్ను అదిరింది. ఏది ఎల్లా ఉన్నా "భేషుగ్గా ఉంది నీ ఉద్దేశ్యం" అన్నట్టు వెంకటలక్ష్మమ్మను మెచ్చుకున్నాడు. ఆయనా మెచ్చుకునేటప్పటికి వెంకటలక్ష్మమ్మ నెమిలే అయిపోయి సిగ్గుపడింది. సంతోషించింది.

అయితే తీరా ఈవిషయం ఎవరిదగ్గర ప్రస్తావన తెద్దామా అన్నది ఇద్దరికీ సమస్యఅయి ఆరాత్రంతా ఎవరి దారిలో వారు ఆలోచించడానికి మొదలెట్టేరు.

* * *

రామూకు కొత్త జ్ఞానం వచ్చినప్పటినుండీ కక్కాయి అన్నయ్యకు ఆఖరుకు వారానికి ఒక్కమాటైనా 'తననుపంపివెయ్యమని' ఉత్తరం వ్రాస్తోందని తెలుసు. అన్నయ్యకూడా ఉత్తరం వచ్చినప్పుడల్లా "ఒరేయి, ఇవ్వాళ కక్కాయి నిన్ను రమ్మందిరా"అని ఏ భోజనం చేసేటప్పుడో చెప్పేవాడు.

అసలు సీతారామయ్యకూ ఇష్టంలేదు రామూను కక్కాయియింటికి పంపాలని. ఆ మహామ్మారి రామూను ఏం మార్చేస్తుందో అన్న భయం లోలోపల పీకడం, పైగా ఇన్నాళ్లూ పెంచిన, ఆదరించిన ప్రేమా, భావిలో కట్టుకున్న, పెట్టుకున్న ఆశాసౌధాలూ పటాపంచలుచేస్తుందేమో అన్న బెరుకూ వుండడంవల్ల రామూను "పోనీ, వెళ్లిరా, ఓవారం రోజు లుండిరా" అన్న ముక్క అందామనుకున్నా అననివ్వలేకపోయింది. వెంకటలక్ష్మమ్మ, కక్కాయివిషయంలో స్వానుభవమేమీ లేకపోయినా, భర్త చెప్పిన మాటలూ, సన్నివేశాల బట్టీ ఊహించుకుని, రామూను "వెళ్లిరా నాయనా" అనలేక ఊరుకుంది.

వాళ్లమాట ఎల్లావున్నా రామూకే కక్కాయియింటికి వెళ్లడానికి ఇష్టంలేదు. ఈఇల్లు, అన్నయ్య, వదిన అంతా అలవాటైపోవడంవల్లో, లేకపోతే ఆ పల్లెటూరు వెళ్లడానికి ఇష్టం లేకపోవడంవల్లో రామూ వెళ్దామనుకున్నా వెళ్లడానికి మనస్సు ఒప్పుకోలేదు.

వేసవిశెలవుల్లో కక్కాయి ఇక బ్రతుకుతుందో బ్రతకదో అన్న వుత్తరం కరణంగారు రాయడంతో సీతారామయ్య ఖంగారుపడ్డాడు. తీరా రామూను పంపకపోతే, అందులో పల్లెటూరుకూడా, తలో మాటా అంటారని భయపడ్డాడు. "చూచేరా, తమ్ముణ్ణి మంచివాణ్ణి చేసుకుని ఆస్తంతా కాజేద్దామని చూస్తున్నాడు. ముసల్ది చస్తున్నా మనవణ్ణి పంపలేదు"అని అపవాదు తనమీద పడేస్తారేమో అని ఒణికేడు. ఆ శనివారంమధ్యాహ్నం ఆఫీసుపని ఒంటిఘంటకే ఉరుకుతూమురుకుతూ పూర్తిచేసుకుని, రామూతో వాళ్ల కక్కాయివూరు వెళ్లేడు.

అంతదూరంలో ఎక్కడ చూసిందో, లేక ఎవరైనా ముందరనే ఈవార్త చేరవేసేరో తెలియదుకాని గుమ్మంమెట్లు ఎక్కేటప్పటికి కుక్కినులకమంచం మీంచే బావురుమంది.

"ఎన్నాళ్లకు కళ్లపడ్డావురా రామయ్యా. ముసల్ది చచ్చిపోలేదు. ఇల్లా పీక్కుతింటున్నాది వ్యాధి. నా కూతురు సావిత్రమ్మ బ్రతికుంటే నువ్వు దూరమయ్యేవాడివా? ఎంత రక్తం పంచుకున్నా, ముసలిపీనుగమీద కాస్తంత ప్రేమా చూపించలేకపోయేవా నాయనా..." ఈ వరసలో ఏడుస్తూనే రామూను కౌగిలించుకుంది, ఒళ్లంతా నిమిరింది.

# తమ్ముడు

"అమ్మో! అమ్మో! ఎంత చిక్కిపోయేవు... ఆ వూరినీళ్లు పడలేదుకాబోలు. ఇక్కడున్నప్పుడు పనసపండులా వుండేవాడవు" అంది.

అంతవరకూ సీతారామయ్యను "మంచినీళ్లు కావాలా? కూర్చో" అనేనా అనలేదు. అతనివేపే చూడలేదు. పైగా రామూ చిక్కిపోయాట్ట. మరి తను సేవింగ్సుబ్యాంకులోంచి నెలనెలా తీసి రామూ కోసం వెచ్చించిన పదిహేనువందలూ మట్టిలో పోసినట్టేనా? రామూకడుపు కాల్చి తనూ, తన పెళ్లాం అందలం ఎక్కి వూరేసుతున్నారన్నట్టేగా కక్కాయిభావం. గుండెలు నలిమివేసినట్టే అయింది.

అరఘంట అయిన తర్వాత కొత్త కళ్లకు చెయ్యడ్డుపెట్టుకుని "నువ్వా...సీతన్నా...వచ్చేవా? ఏనో బ్రతికున్నన్నాళ్లూ చూడ్డానికి రాకపోయినా, చచ్చేటప్పుడైనా వచ్చేవు...నీ దయ..."ఆ ముక్కల్లో పాపిష్టి అన్నది చూపించేసింది. "కూర్చో. మంచి నీళ్లు కావాలా నాయనా?" అంది.

ఆ మాటలు సీతారామయ్యను నుంచున్నపళంగా రక్తంతో జేసినట్టే అయింది. సమాధానమివ్వలేక పోయేడు. అల్లాగే చచ్చిపోయి 'ఎందుకు వచ్చేనా' అని తలవంచుకూర్చున్నాడు. కక్కాయి అన్నయ్యను ఆ విధంగా ఆడిపొయ్యడం రామూకు కష్టమనిపించింది. కక్కాయిని అడిగేద్దామనుకున్నాడు. కాని ధైర్యం చాలకపోయింది. లోలోపల బాధపడుతూనే అన్నయ్య అక్కడ, తన కున్న స్వేచ్ఛలో, సాధ్యమైనంతవరకూ సేవచేసేడు. కాని కక్కాయికి రామూ సీతన్నను అంత పూసుకుతిరగడం చాపక్రింద పల్లేరుకాయలు పోసినట్టే అయింది.

సమయం దొరికినప్పుడల్లా న్నను దెప్పిపొడవడంతో సరిపెట్టింది కక్కాయి. రామూకు చాలా సార్లు నొప్పికల్గించింది. తన తల్లి బ్రతికున్నప్పుడు కక్కాయీ, తల్లీ కలిసి సీతన్నను పులిస్తరాకుకంటె నీచంగా చూస్తూ కబుర్లుచెప్పడం ఒకటిరెండుసార్లు విన్నాడు. ఆ స్తినిగురించి అప్పుడు ఏవో గుసగుసలు ఆడేరుకాని అర్థంకాని స్థితిలో ఉండిపోయింది. మరి ఇప్పుడు దాన్ని గురించి ఎంత ఆలోచించినా తెగా తెంపూ లేక జ్ఞాపకంరాని సంగతిలాగే వుంది.

సాయంత్రమే సీతారామయ్య వెళిపోతానన్నాడు. కాని రామూకు వదిలిపెట్టాలనిలేదు. ఇటు కక్కాయికి ఎదురు తిరిగి వెళ్తానని చెప్పడానికి గుండెలు అతుక్కొనూలేకపోయేయి. కనీసం ఆరాత్రికి అయినా ఉండిపొమ్మని పట్టుబట్టేడు. అంచేత నిలబడలేని మాటలు ఇంకా ఏమి వినవలసివస్తుందో అన్న బెదురుహృదయంతోనే ఆగేడు.

ఆరాత్రి కక్కాయి సీతన్నను చాలా నీచంగానే చూచింది. రామూహృదయం చాలా బాధపడింది. ఆఖరుకు గుక్కమ్మట నీళ్లుకూడా కుక్కుకున్నాడు. తనకు అన్నమే కడుపునిండా పెట్టడంలేదట; కట్టుకోడానికి గోనుసంచుల్లాంటి బట్టలు కుట్టించేట్ట; ఒక్కరోజునైనా బండిమీద స్కూల్‌కు పంపలేదట; సంవత్సరానికి ఒక్కపండుక్కైనా తలంటినీళ్లు పోయలేదట-ఆవరసలో కక్కాయి అన్నగారిని దెప్పింది. చీకటితోనే, రామూ లేవకుండానే, "గుండె పగిలిపోయే సన్నివేశాలు ఇంకా ఏం సిద్ధిస్తాయో" అని భయంతో చెప్పకుండానే వెళ్లిపోయేడు సీతన్న. సీతన్న చెప్పకుండా వెళ్లడం కక్కాయికి మరోసమిధ దొరికినట్టే అయింది. "చూచేవురా, రామన్నా. వాడికి నన్ను చూడ్డానికి మొఖం ఎట్లా చెల్లుతుందిరా? వాళ్ల నాన్న బ్రతికివున్నన్నాళ్లూ ఆయన్ని కాల్చుకు తిన్నాడురా! ఆయనకు తిన్నతిండి వంటబట్టిందిరా! మీ అమ్మకు నే పెట్టిన కాసులపేరు, వడ్డాణం వాళ్ళ అమ్మవనీ, ఆ స్తిలో సగం తనదేననీ బావా వేసేడురా. మీ అమ్మ పేర కొన్న ఇల్లు తనదే అన్నాడు. ఇదంతా ఆముండ వుందిగా...వెంకటలక్ష్మమ్మ... అది చేయించిందిరా! మేం ఉన్నన్నాళ్లూ ఇన్ని చారునీళ్లూ, మజ్జిగనీళ్లతోటి వాణ్ణి ఒంగతీసేంకాని లేకపోతే పట్టపగ్గాలు వుండేవా? బి. ఏ. చదువుతానని ఎంత పేచీపెట్టేడు...వాడి మొఖానికి పెద్ద చదువుకూడాను......" ఈవరసలో చాలా నూరింది రామూ చెవులో.

అప్పుడే కన్ను తెరుస్తున్న జ్ఞానంలో రామూ ఆలోచించేడు. కక్కాయి అంత అబద్ధాలు ఆడుతుందా? శీతారామయ్య అంత దుర్మార్గుడా? తన తల్లినీ, తండ్రినీ అంత కాల్చుకుతిన్నాడా?...ఇవో ప్రక్కా, తనకు జ్ఞానం వచ్చినప్పటినుండి వెంకటలక్ష్మమ్మశీతారామయ్యల ఆదరణ, ప్రేమ, ఆపేక్ష ఇవి మరోప్రక్కా నిల్చుని జడ్జీక్రింద చేసేయి. ఎటూ నిర్ణయానికి రాలేక బాధపడ్డాడు. కక్కాయి ఓ ప్రక్క, శీతారామయ్య అన్నయ్య ఓపక్క—తాను మధ్య అడకత్తిరిలో వక్కలా నలిగేడు.

“నిన్ను ఇప్పుడు మంచితనం ఎందుకు చేసుకుంటున్నాడో తెలుసా? ఇప్పుడు నీకున్న ఆస్తిలో భాగం ఎల్లాగైనా సంపాదిద్దామనీ...తన తల్లి వి పదివేలరూపాయలబంగారం మనింట్లో ఉందని అది ఎల్లాగైనా స్వాధీనంచేసుకుందామనీ. ఒరే వెర్రి బాగులువాడా? వాడు రెండుసార్లు టిఫిన్ కాఫీలు పోయించేడంటే, ఊరికే అనుకున్నావా? సినీమాకు తీసుకెళ్లేడంటే...ఏమందిరా, ముందుముందు నీకంతానికి ఉరిపొయ్యడానికేరా? నేనున్నానని ఇంకా హడలిచస్తున్నాడుకాని... చూడు, ప్రొద్దున్న చెప్పకుండా ఎల్లా తోకముడిచేడో! లేకపోతే, వెర్రికుంకాయి, నీచేత ఈపాటికి వేలుముద్ర వేయించేసేవాడే కాదు రా! నీ తల్లి చచ్చిపోయిందికాని లేకపోతే నీ బ్రతుకంతా ఇల్లా అడవిలో ఉన్నట్టు అయ్యేదిరా? అందుకనేరా వారంవారం నీకోసం ఉత్తరం వ్రాయించేదాన్ని రమ్మని...... నాయనా, ఈముసలిదాన్ని నమ్మేవా?”అని ఏడ్చింది. చాలాచక్కగానే అభినయించింది.

శీతారామయ్య అనే భగవద్గీతకు ఇప్పుడు కక్కాయి టీకాతాత్పర్యం చెపుతోందా? ఇంతకాలం ఓవిషప్పుచ్చి ఇంటిక్రింద తాను అజ్ఞాతవాసం చేస్తున్నాడా?

“ఏరోజునైనా ఆ వెంకటలక్ష్మి నీకు మందు పెట్టిస్తుందేమోఅని ఎంత ఏడుస్తున్నా ననుకున్నావ్? ఆముండ మహామ్మారిరా? పయోముఖవిషకుంభం”

తక్కిన, తర్వాత గడిచిన మూడురోజుల్లోనూ దాన్నిగురించే ఆలోచించేడు...అటు ఆరేళ్లనుంచీ ఏర్పడ్డ ప్రేమ, వాత్సల్యం, చనువు-ఇవన్నీ ఎదురుతిరిగేయి. కక్కాయి తనను ఆమెవేపు తిప్పుకోవాలని వేసే ఎత్తులేమో అనుకున్నాడు. అన్నయ్య అంత పని చేస్తాడా అన్న నమ్మకం కల్గలేదు. అదంతా అబద్ధంక్రింద కనిపించింది. ఇంక అందులోనూ వెంకటలక్ష్మమ్మ మందుపెట్టేంత మహామ్మారా? ఈప్రశ్న మరింత ముజ్జిడ్డుగా కన్పించింది.

రెండురోజులు పోయినతర్వాత కక్కాయి సత్యనారాయణవ్రతం చేయించింది. అన్నవరం కొండకు వెళతానని కూడా మొక్కుకుందట. ‘ఎందుకు?’ అంటే “నువ్వు సరిగ్గా వాళ్లింటిదగ్గరనుంచి తిరిగివస్తావో, లేదో అన్న భయంచేతనే” అంది.

మరి జ్వరం వచ్చినపుడు ఇద్దరూ సగం చిక్కేరే...ఈఅంశం ఏవిధంగా కక్కాయిమాటలకు అతకడం?

శెలవులన్నీ నెమ్మదిగా అయిపోయేయి. రెండు మూడుసార్లు అన్నయ్యదగ్గరకి వెళతానని నోటి చివరవరకూ వచ్చింది. ఓసారి నోరుజారింది. అవాళెల్లా అన్నయ్యను చంపేట్టు మాట్లాడింది. దావావిషయం, ఓరోజున అన్నయ్య మహా బాధ భరించలేనట్టు విషం కూడా తెచ్చేడట. “ఆవెధవ ఆ దారుణప్పని చేసేడా నేను, మాఅమ్మ, అయ్యాకూడా కటకటాల వెనకాల ఉండిపోవలసివచ్చేది!”అని ఏమిటేమిటో చాలా చెప్పింది.

తను ఓనెల్లాళ్లనుంచి కక్కాయి చెప్పేమాటలు వినడంవల్లనో, లేక అన్నయ్యకు దూరంగా ఉండడం మూలానో కాని యాదవకులంలో ముసలం పుట్టినట్టే అయింది. అన్నయ్యమీద ఎంత తెచ్చుకోకూడదనుకొన్నా ఓవిధమైన ఈర్ష్య, కోపం, పగా కల్గిపోయేయి. కక్కాయి అంత వృద్ధ వయస్సులో వున్నా తనకోసం త్యాగం చేసినందుకు ప్రేమా, కృతజ్ఞతా కల్గినయి.

ఆ శెలవులాఖర్నే “వాళ్ల ఇంటిదగ్గ రుండి చదువుకోవడం నాకు ఇష్టం లేదు. ఇక్కడ నాకు కంటిమీద కునుకైనా పట్టదు. అక్కడుంటే నీకు దినదిన గండం. అన్నట్టు...కావలిస్తే నేనే వస్తా; కాకినాడలో కాపురం పెడదాము. నువ్వుకాక నాకెవ్వరున్నారు ప్రపంచకంలో” అంది కక్కాయి. కళ్లమ్మట ఓసారి అమ్మను తలచుకుని నీరెట్టింది కూడాను.

ఎటూ చెప్పలేక కొంతసేపు తికమకలాడి “సరే. సామాను తెచ్చుకుని వస్తా” అని అన్నయ్యగారింటికి బయల్దేరేడు.

(సశేషం)



# రైలు ...కీవద్ద నుంచి చూస్తే బాగా కనిపిస్తుంది

కాని, ఆ ప్రయాణీకునికి సంతోషం లేదు. కళకళలాడుతూ, కనబడుతున్న పైరు పొలాలు, పండ్లతోటలు త్వరగా మాపునుండి తొలగిపోగా, వాటి వెనకనే, యేమీ మొలవకుండ నిస్సారమైన విశాల భూములను గురించే అతని ఆలోచన.

అందుకు కారణం గూడ అతనికి తెలుసును—హిందూ దేశంలో గల 7,00,000 గ్రామాలలో చాలభాగం రోడ్లు లేక బస్తీలతో సంబంధం లేకుండ వున్నవి. రైతులు యెక్కువ ఆహారం పండించినా, తమ పంటను మార్కెట్టుకు తీసికొని పోలేరు. రోడ్లు నిర్మింపబడేటట్లయితే, యెక్కువ పైర్లను పండించుటకు వీలుగా వుండడమే కాకుండ, గ్రామీయులు పారిశ్రామిక వస్తువులను తిరిగి కొనగలిగే స్థితిలో వుంటారు. వ్యవసాయం, పరిశ్రమ, అన్యోన్యాశ్రితములు. ఒకదాని అభివృద్ధిమీదనే మరియొకటి ఆధారపడి వుంటుంది.

ఆ ప్రయాణీకుడు భవిష్యత్తు గురించి చూచును. శరీరములో అనేకమైన రక్తనాళముల నిర్మాణమువలె, భావిభారతదేశమంతటను రోడ్లు అల్లుకొని, వాటిమీదుగా దేశప్రజల ఆరోగ్యైశ్వర్యములకు జీవరక్తమువంటి వస్తువులు గ్రామములకు, నగరములకు, పట్టణములకు నిరంతరము రవాణా యగుటను ఎదురు చూచుచున్నాడు.






**మంచిరోడ్లు దేశాభ్యుదయమునకు మార్గములు.**

# కలగూరగంప

## శ్రీకారము - పూర్వప్రయోగోత్పత్తులు

సిరి యను ప్రాకృతశబ్దమునుండి యీ శ్రీకారమేర్పడినట్లు ప్రాచీన ప్రాకృతశాసనములలోని ప్రయోగములవల్ల తెలుసుకొనుచున్నాము. క్రీస్తు మొదటి నాల్గుశతాబ్దములలోని యిక్ష్వాకురాజులు, శాతవాహనరాజులు వ్రాయించిన శాసనములలో నీ శ్రీకారము "సిరి" యనియే వ్రాయబడియుండెను. దీనిని వాడుటలో వారు పురుషులకు దీనిని పేరుముందర నుంచుటయు, రాణులు మున్నగు స్త్రీలకు పేర్లకు చివర దగిలించివ్రాయుటయు ఆచారముగా నున్నట్లు కన్పడుచున్నది. కొందరు స్త్రీలకు "సిరినిక" అనగా శ్రీనిక యనిగూడ ప్రయోగించినట్లు కన్పడుచున్నది. ఎక్కడనో ఒకటిరెండుచోట్లమాత్ర మీ శ్రీకారము (సిరి) పురుషనామములకు చివర వాడుట జరిగియుండెను. వీటికి కొన్ని ఉదాహరణములను అనువదించి చూపించెదను.

I శాతవాహనరాజులలోని శాతకర్ణిభార్య నాగానిక వ్రాయించిన శాసనము—దీనిలో "సిరి" శబ్దము శాతకర్ణికిముందే ప్రయోగింపబడెను.

II నాసికశాసనము— దీనిలోగూడ గౌతమీపుత్ర శ్రీ శాతకర్ణియనియే చెప్పబడెను.

III కార్లేశాసనము— దీనిలో వాసిష్ఠీపుత్ర శ్రీపులోమావియని ప్రయోగము గలదు.

IV ఇట్లే యీతని నాసికశాసనములలోగూడ గలదు.

V అమరావతి, VI కన్హేరిశాసనములు — వీనిలో వాసిష్ఠీపుత్ర శ్రీ (సిరి) శాతకర్ణి యని వ్రాయబడియెను. అనగా సిరి (శ్రీ) శబ్దమునుముందే యున్నది.

VII కన్హేరిశాసనము—శ్రీయజ్ఞశాతకర్ణి యని చెప్పినది.

VIII నాగార్జునకొండశాసనములు— వీనిలో శ్రీవీరపురుషదత్త, శ్రీశాంతమూల అని పురుషులపేర్లకు ముందే యీ శ్రీ (సిరియని ప్రాకృతప్రయోగము) కారము వ్రాయబడెను. పైన నుడివినట్లు అరుదుగా ఈ ప్రయోగము పురుషులకు నామములచివర వ్రాయబడెను. యజ్ఞశాతకర్ణినిగురించి చెప్పబడిన కన్హేరి చిన్నశాసనములలోమాత్రము యజ్ఞసిరి యని చెప్పబడెను.

ఇక స్త్రీలనుగురించి ప్రయోగములను తెలుసుకొందము.

I నాసికశాసనములో భటిపాలిక యనునామె మహాహకు సిరి యను నామెమనుమరాలని యున్నది. ఈశాసనము శాతవాహన రాజులనాటిది.

II వాసిష్ఠీపుత్ర శ్రీపులోమావి శాసనములో "గౌతమీబలశ్రీ" యను రాణిపేరు వ్రాయబడినది.

III ఇక్ష్వాకురాజుల శాసనములలో నాగార్జునకొండశాసనమందు "అడవిశాంతశిరి, చూళశాంతిశ్రీనిక, బాపశ్రీనిక, హమ్మశ్రీనిక, చాతిశ్రీ(శాంతిశ్రీ), హమ్మశ్రీ యను పేర్లు గలవు.

IV ఇంకను ఇచట గల మరియొక శాసనములో రాణివాసస్త్రీలును, రాజబంధువులు నగువారి పేర్లలో "సునీతిశ్రీ, ఖండశ్రీ, మహాసరశ్రీ, విజతవిశ్రీ,

మిశ్రశ్రీ, నాగవసుశ్రీ, ఖండకోటిశ్రీ, రతుమతిశ్రీ, మూలశ్రీ, అయకోటుశ్రీ, మదువిశ్రీ, రామశ్రీ, గొలశ్రీ, వెలిశ్రీ, ఎధిశ్రీ, పరజతశ్రీ, పండితశ్రీ, శివనాగశ్రీ శాపిశ్రీ, అయశ్రీ, సురశిఖా, కుసుమలతా మున్నగు స్త్రీల పేర్లు వ్రాయబడియెను. ఇందలి శ్రీకారము ప్రాకృతభాషాప్రకారము సిరి యనియే వ్రాయబడినను, మన భాషలోకి అనువదించునపుడు శ్రీగా నీయబడుచున్నది. ఇట్టి దృష్టాంతము లింకను గలవు చూడుడు.

V నాగార్జునకొండలోని మరియొక ప్రాకృత శాసనములో మహారాజశ్రీ వీరపురుషదత్తుని కుమారియు, శ్రీ యెహువలశాంతమూలసోదరియు, మహారాజవనవాసకుని భార్యయు నగు మహాదేవి "కొడబలిశ్రీ" యని చెప్పబడు [illegible] బట్టి తేలిన దేమనగా, సిరి యను ప్రాకృతశబ్దము ననుసరించి శ్రీ యను సంస్కృతశబ్ద మేర్పడి, లక్ష్మీప్రదము లనుటకు చిహ్నముగా పురుషులకును, స్త్రీలకును గౌరవవాచకముగా నిది ప్రాచీనకాలమునుండి వాడబడుచుండె ననియు, పురుషుల పేళ్లకు ముందరను, స్త్రీలపేర్ల చివరను వాడుటవల్లనే స్త్రీపురుషభేదము ఆకాలము వారు వ్రాతలలో గుర్తించుచుండిరనియు దెలియగలదు. ఆకాలపు స్త్రీలపేర్లుగూడ మనకు వినోదకరముగా గన్పడగలవు.

కొత్తభావయ్య చౌదరి.

# వార్నిషులు - పెయింట్లు

వార్నిషులను, పెయింట్లను కఱ్ఱ, యినుము మొదలగునవి చెడకుండ, త్రుప్పునకు, చెదలకు లోనుగాకుండా ఉండుటకు, అందమిచ్చుటకు, చిత్తాకర్షమైన రంగులీనుటకు పైపూతగా వాడతారు. ముఖ్యంగా సముద్రయానమొనరించు ఉక్కునౌకల పైభాగంపై విలువైన పెయింట్లు పూస్తారు. అట్లు చేయకపోతే అవి త్వరలో త్రుప్పుపట్టి చెడిపోతాయి. కోట్లకొలదీ పౌనుల వార్నిషులను, పెయింట్లను నాగరికప్రపంచం ప్రతిసంవత్సరమూ ఖరీదుచేస్తుంది.

త్వరలోనే ఆరిపోవటం, రమ్యమైన తళుకు కలిగియుండి, పూసిన పైపూత వస్తువులను దృఢముగా అంటిపెట్టుకొనిఉండటం, తడితగిలినపుడు చెడకుండా ఉండటం, డబ్బాలలో మడ్డికట్టకుండా ఉండటం, రంగు పెకి తే[illegible]ండాఉండటం మొదలైనవి మంచి వార్నిషుయొక్కయు, పెయింటుయొక్కయు లక్షణాలు.

తయారుచేయు విధానమునుబట్టి ఇవి (౧) నూనెవార్నిషులు, (౨) కర్పూరతైలపువార్నిషులు, (౩) స్పిరిటువార్నిషులు అని మూడురకాలు. వాస్తవంగా, వార్నిషులన్నీకూడ వివిధరకముల హరిపూస, అంబరు, కోపాల్ బంక, అనిమిబంక, డామర్ బంక, సంద్రసు, లక్క మొదలైన జిగురుపదార్థములను (Resinous substances) అవిసెనూనెయందు గాని, కర్పూరతైలమునందుగాని, స్పిరిటునందుగాని కరగించుటచే యేర్పడిన ద్రావణములే. వీనిలో అంబరును, కోపాల్ బంకను, అనిమిబంకను అవిసెనూనెలో మరగించి నూనెవార్నిషులు తయారుచేస్తారు. డామర్, మస్టిక్ మొదలగు జిగురుపదార్థాలను కర్పూరతైలంలో కరగిస్తారు. లక్కను, సంద్రసును స్పిరిటునందు కరగించి స్పిరిటువార్నిషులను తయారుచేస్తారు. ఈ స్పిరిటు వార్నిషులను లేపనములు (Lacquers)అనికూడ పిలుస్తారు. ఆధునికకాలంలో వీని ఉపయోగం మిగిలిన వార్నిషు లన్నిటికంటెను, పెయింట్లకంటెకూడ అధికంగా ఉంది. పైరోక్సిలిన్ లేపనములను కఱ్ఱసామగ్రిపైనను, బస్సులపైనను పూయుటకు ఎక్కువగా వాడుతున్నారు. 'సెల్యులోజునైట్రేటు', హారతికర్పూరము, సంద్రసు, రంగులను సరియైన ద్రావణంలో కలిపి వీనిని తయారుచేస్తారు. వార్నిషులను కఱ్ఱలపై పూసినపుడు త్వరితముగా ఆరిపోవుటకు స్వల్పముగా సీసభస్మమును, 'రెడ్ ఎసిటేటు'ను వానిలో కలుపుతారు. ఈపదార్థములను Driers అంటారు.

## కలగూరగంప

వార్నిషులను తయారుచేయటం చక్కని గృహ పరిశ్రమ. వీనిని చేయుటకు విలువైన పరికరముల ఆవశ్యకత లేదు. జిగురుపదార్థములను నూనెలో మరగించుటకు రెండు మూడు యిత్తడికాగులు ఉంటేచాలు.

అవిసెనూనెను ౩౦౦° సెంటిగ్రేడు ఉష్ణోగ్రత వరకు వేడిచేసిన దాని అణువుల కూర్పునందు పరివర్తన మేర్పడి, ఒక అణువుతో మరియొక అణువు సంయోగము చెందుటచే (Polymerisation) దాని తారతమ్య సాంద్రత మొదలగు భౌతికరసాయనికగుణములందు మార్పుకల్గును. ఇట్టి నూనెను వస్తువులపై పూసినపుడు త్వరితముగా ఆరిపోతుంది. నూనె వార్నిషునం దుపయోగింపబడు వస్తువులు ఆయాపరిమాణములలో క్రింద తెలుపబడినవి.

| | |
|---|---|
| కోపాల్ బంక | ౧౦౦ పౌనులు |
| సీసభస్మం | ౮ పౌనలు |
| వండిన అవిసెనూనె | ౨౫ గాలన్లు |
| కర్పూరతైలము | ౫౦ గాన్లు |

నూనె, రంగు, డ్రైయర్లు అను మూడురకాల ముడిపదార్థాలను పెయింట్లు తయారుచేయుటయం దుపయోగిస్తారు. వార్నిషుచేయుపద్ధతియందే అవిసెనూనెను డ్రైయర్లతో కలిపి వండుతారు. పెయింటునకు గల రంగు ధాతురూపకమైన (Inorganic) వర్ణపదార్థములను వండిన నూనెయందు కలుపుటచే కల్గుచున్నది. తెల్లసీసము (White lead), వంగభస్మము, సీసగంధకితము, లిథోపోను, ముగ్గురాళ్లు (Barytes), సుద్ద, జిప్సము, అల్యూమినా తెల్లని పెయింట్లను తయారుచేయుటయందు, సీసపు, తుత్తినాగపు, బేరియం క్రోమురంగులను పసుపుపచ్చని పెయింట్లను చేయుటయందు, ప్రష్యన్ నీలము, అల్ట్రామెరైన్ మొదలగు లోహనీలములను, కోబాల్టునీలమును నీలి పెయింట్లు చేయుటయందును, సీసభస్మము, ఇంగిలీకము, రససింధూరము, ఎఱ్ఱని క్రోమురంగులు మొదలగువాటిని అరుణవర్ణం గల పెయింట్లు చేయుటకు తరచు వాడుతారు. వ్రాతబల్లపై పూయు 'బ్లాక్ బోర్డు పెయింటు'ను దీపపుమసిని ఉపయోగించి తయారుచేస్తారు.

ఈరంగులను నూనెను మొదట 'మిక్సర్'అను యంత్రములో బాగుగా కలుపుతారు. అటుపై పెయింటును 'గ్రైండింగు'మరలలో చికుకత్రొక్కుతారు. ఈయంత్రమందు ఉక్కురోలరులు ఒక యినుపపాత్రలో విద్యుచ్ఛక్తిసహాయమున తిరుగుతూ ఉంటాయి. పెయింట్లు యీ రోలరులమధ్య పడినలిగి, కలిసిపోతాయి. తదుపరి యీపెయింటును డబ్బాలలోకి ఎత్తుతారు.

గుణోత్కర్షమైన సరకులను తగిన పరిమాణంలో మనం తయారుచేయగల్గితే యీపరిశ్రమకు మన దేశంలో మంచి భవిష్యం ఉంటుంది.

జి. వి. యల్. నరసింహశర్మ.

# కోస్తా జిల్లాలలో మొన్నటి తుపాను బీభత్సము





అనకాపల్లిలో వరదలు : నరసింగరావుపేటలో మామూలు ఇళ్లు, గొడ్లపాకలు అన్నీ జలమయమైపోయినవి; నగరములో వీధులు అనేకము రాకపోకలకు వీలుగాకుండా మొలలోతు నీళ్లతో నిండి ఉన్నాయి.



# విమర్శనము



## కథలు - గాథలు

(రెండవ భాగము)

రచయిత : దిగవల్లి వెంకటశివరావుగారు, బి. ఏ., బి. యల్. బెజవాడ. వెల ౧-౪-౦.

ఈశీర్షిక, ఇందలి వ్యాసములును ఆంధ్రపత్రికా, భారతీ పాఠకులకు సుపరిచితములైనవే. మొదటిభాగమును చదివిచూచిన పాఠకలోకమునకు దీని స్వరూపము క్రొత్తగా పరిచయముచేయబనిలేదు. రాణీ వెంకటాంబగారి దొంగకొనుపు, అయోధ్యనవాబుగారి సీమమంగలి, టిప్పుసుల్తాన్ చేయించిన జపము, మహమ్మదాలీ చేయించిన మారణహోమము, హైదరులింగము, చాముండేశ్వరికి సుల్తానుగారి ఆభరణాలు ఇత్యాది విచిత్ర చరిత్రవృత్తాంతములతో ఇది పండితపామర హృదయంగమముగానున్నది. మూలబడిపోయి మగ్గిపోవుచున్న పాతకట్టలనుండి ఇటువంటి అద్భుతచారిత్రిక కథలను ఏరి, కూర్చుచున్న శివరావుగారి కృషి ప్రశంసనీయమైనది.

---

## కాంగ్రెసు వాచకం

రచయిత : వేలూరి సదానందంగారు. ప్రకాశకులు : యువబుక్ డిపో, ఆచారప్పన్ వీథి, మద్రాసు. వెల ౧౨ అణాలు.

౧౯౪౨ ఆగస్టునెల మొదలుకొని ఈనాటివరకు నడచిన ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసుచరిత్ర, ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు నియమావళి, కాంగ్రెసు ప్రమాణపత్రము, మద్రాసు అసెంబ్లీ ఎన్నికలకు సంబంధించిన వివరములు, ఆగస్టుఉద్యమ తీర్మానాదికములను ఈగ్రంథము విశదీకరించుచున్నది. ప్రస్తుతపు ఎన్నికల సంరంభములో దీని ఆవశ్యకతను ప్రత్యేకించి పేర్కొనవలసినపని లేదు.

## సాహితీ విపణి

వ్యాససంపుటి. రచయితలు : సికిందరాబాదులోని సాధనసమితి సభ్యులు. వెల ౧ రూపాయ.

బహువస్తువులను పెట్టుకొని సమీకరించిన ఈ సంపుటి అంతస్సారమునుబట్టి ఈరచయితలు కేవల సాధకులుగాక ఆయాశాఖలలో పరిణతప్రజ్ఞులన్న

భావమును వ్యక్తము చేయజాలియున్నది. మధ్యమధ్య కొన్ని కథలు, గేయములుకూడ చేర్చబడియున్నవి. వెల ఒక రూపాయ.

# గ్రంథ స్వీకారము

### పురుషోత్తముడు

ఖండకావ్యము. రచయిత: ప్రతివాది భయంకర వేదాంతాచార్యులుగారు, ౭౮౦౮ లాలా గుడిబజారు, సికిందరాబాదు, దక్కను వెల ౧ రూపాయ.

---

### చిరంజీవి పాటలు

రచయిత: ఈట్ల కొండయ్యగారు, పేరాల, చీరాలపోస్టు. వెల ౪ అణాలు.

### చలంగారి చలం, ప్రజాసాహిత్యం

రచయిత: గొట్టిపాటి. ప్రకాశకులు: ఆత్మారాం అండుకో., అనంతపురము. వెల ౪ అణాలు.

### రవికిరణము

ఖండకావ్యము. రచయిత: చివలూరి ల నరసింహాచార్యులుగారు, సిరిపురము. వెల ౨ అణాలు.

### ఆంధ్రజ్యోతి - దీపావళి సంచిక

సంపాదకుడు: చక్రపాణిగారు. ఎక్కువ పుటలతో, ఎక్కువ రచనలతో, ఎక్కువ బొమ్మలతో సింగారించుకొని పండుగ కానుకగావచ్చిన ఈ ప్రత్యేక సంచిక తప్పక ఆంధ్రుల ఆదరాభిమానములను పొందగలదు. వెల అర్ధరూపాయ.







Printed and Published by S. Sambhu Prasad, at the Andhra Patrika Press, No. 7, Thambu Chetty St., G. T., Madras. Editor—S. Sambhu Prasad.


ఇండియన్ టీలలో అత్యుత్తమమైనది




LIPTONS
WHITE LABEL
TEA
ONE POUND NETT

# ఆంధ్రగ్రంధమాల పుస్తకములపట్టిక

| | | |
|---|---|---|
| ఆంధ్రవిజ్ఞానసర్వస్వము (2 సంపుటములు) సంపు. 1 కి | రు. | 10-0-0 |
| శ్రీ మహాఋషినిఘంటిత యోగశాస్త్రము—కా. సూర్యనారాయణయోగిని | ... | 5-0-0 |
| భగవద్గీత (సంస్కృ.)—బె. రామారావుగారి వ్యాఖ్యానముతో 1, 2, 3 సంపుటలు మాత్రమేఉన్నవి. సంపు. 1 కి | ... | 1-8-0 |
| శతకకవులచరిత్ర—వం. సుబ్బారావుగారు | ... | 1-8-0 |
| పారిభాషికపదకోశము (ఇంగ్లీషులోని శాస్త్రీయపదముల తెలుగుపదముల నిఘంటువు) | ... | 1-4-0 |
| ఆంధ్రవాఙ్మయసూచిక (ముద్రితాముద్రితగ్రంధములపట్టిక) | | 1-0-0 |
| శ్యామసుందరము—ఒం. సత్యనాథముగారు | ... | 1-0-0 |
| జీవనప్రభాతము (న.)—కె. యన్. వెంకటరమణిగారు | ... | 1-0-0 |
| భీష్ముడు (నాటకము)—పో. పిచ్చిరెడ్డిగారు | ... | 1-0-0 |
| అవిమారకము (నాటకము)—మానపల్లి రామకృష్ణకవిగారు | | 0-10-0 |
| కృషీవలవిజయము | ... | 0-8-0 |
| వివాహతత్వము—బం. మల్లయ్యశాస్త్రిగారు | ... | 0-8 0 |
| నిరుద్ధభారతము—ముం. వెంకటశర్మగారు | ... | 0-8-0 |
| శ్రీరామవిజయము (నాటకము) | ... | 0-8-0 |
| ఆరోగ్యసాధనము— గాంధీమహాత్ముడు | ... | 0-8 0 |
| గీతాబోధ— ,, | ... | 0-4-0 |
| ప్రార్థనగీతావళి | ... | 0-4-0 |
| హాలికోద్ధారము—(ప్ర) శేషాద్రిశర్మగారు | ... రు. | 0-4-0 |
| మానవస్వత్వములు—థామస్ పెయిన్ | ... | 0-4-0 |
| హిందీతెలుగు బాలశిక్ష—పం. ఆ. శాస్త్రిగారు | ... | 0-6-0 |
| ,, మొదటివాచకం | ... | 0 6-0 |

మేనేజరు, ఆంధ్రగ్రంధమాల,

7, తంబుశెట్టి వీధి - - - జి. టి., మద్రాసు,

Regd. No. M. 1856.

7 th NOVEMBER 1945.




నాగయ్య...జయమ్మ...భానుమతి...నారాయణరావు
లింగమూర్తి...శివరావు నటించినది...

*Directed by* **B.N.REDDI**

CAMERA..BARTLEY..... SOUND..DINSHAW...... ART...NAGOOR..... STUDIO..NEWTONE